# మీ చర్మాన్ని పుష్పదళం లాగ మెత్తగా, మృదువుగా యౌవనంగా వుంచుకోండి...

ఇందుకు మీ చర్మమందలి స్వాభావిక తేమను మీరు నిలబెట్టుకోవాలి. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్‌లోగల ఒక ప్రత్యేకమైన పదార్థము 'హ్యూమెక్టెంట్' చర్మపు తేమను నిలబెట్టి మీ చర్మాన్ని దుమ్ము, వాతావరణమునుండి రక్షిస్తుంది. తేలికైన, మంచువంటి పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మిమ్మలిని సొగసుగా కనబడేటట్టు వుంచి మీ చర్మాన్ని ఎల్లప్పుడు అందంగా, మృదువుగా, యౌవనంగా వుంచుతుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మాత్రమే రాసుకొంటే మీ ముఖము సహజ మనోహరత్వముతో వుంటుంది. లేకపోతే అది రాసుకొన్న తరువాత పౌడర్ అద్దుకోవచ్చును. అప్పుడు పౌడర్ గంటల కొలది ఏక రీతిగా అంటుకొని వుంటుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్: ప్రపంచమంతటా అందకత్తెలు వాడే క్రీమ్!




**పాండ్స్** వ్యానిషింగ్ క్రీమ్ పౌడర్ అద్దుకొనుటకు ఉత్తమమైనది

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

Roophala



రవీంద్ర ఆర్ట్ పిక్చర్సు

తప్పక చూడండి!

# బంగారు గాజులు

దర్శకత్వం: సి.యస్. రావు B.A.(LIT)

నిర్మాత: తమ్మారెడ్డి కృష్ణమూర్తి

ఆంధ్ర-నైజాం: లక్ష్మి రిలీజ్

సీడెడ్: జయలక్ష్మి

ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి, ఆంధ్రసచిత్ర వారపత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥



# ఉత్తరాలు

పాఠకు లందరికీ వినాయకచవితి సందర్భంగా మా శుభాకాంక్షలు.

—సం॥

### కథలు

సంస్కారానికి సంకెళ్ళు ఎంత బావుందో చెప్పే ముందు నా భాషను సంస్కరించుకోవలసిందే. వెంకటరత్నం గారికి హృదయపూర్వక కృతజ్ఞతలు.

కుమారి పాకనాటి జ్యోతి (హన్మకొండ)

* * *





16—8—68 వారపత్రికలో "కుక్క గొడుగులు"—అను కథ చాలా బాగుంది. ఈనాటి మధ్య తరగతి కుటుంబాలలో జరుగుతున్న పద్ధతులు ఈ కథలో తీర్చిదిద్దినట్లున్నవి. ఈ కథలోని సుగుణ పాత్రను చక్కగా పోషించిన ఎ. వి. యస్. ప్రసాద్ గారికి నా అభివందనములు.

ఈ వారం ప్రచురించిన క్రొత్త సీరియల్ "సుజాత" నా మనస్సుకు బాగా నచ్చింది. ఈ కథను పాఠకలోకానికి అందించుచున్న రచయిత్రి గార్కి నా అభినందనలు.

తో. శేషన్నయ్యంప్రభు (మద్రాసు).

* * *

అత్తిలి వెంకటరత్నంగారి పెద్దకథ "సంస్కారానికి సంకెళ్ళు"లో స్త్రీజాతిని చాల అసహ్యంగా చిత్రించారు. స్త్రీలు అందునా హైందవ స్త్రీలు షికార్లకి, సినిమాలకి తిరగలేదని భర్తపై కోపించి, కన్నకొడుకుని, చేసుకున్న భర్తని విడిచి ఇంకొకని పంచని చేరుతుందా? ఇది అసహజం. పురుషుడై కూడ రమణమూర్తి తన భార్య పరాయి మగాడితో షికార్లు చేస్తుంటే ఊరుకోవడం సంస్కారమా? నాగరికతా? ఏమిటనుకోవాలి. ఏమైనా రమణమూర్తి లాటి పురుషులు, శ్యామల వంటి స్త్రీలు ఉండరు. ఇకపోతే జగన్నాధం సంగతి. వివాహమంటే ఇష్టంలేదుగాని ఒకని ఇల్లాలిని తనవెంట ఇష్టంలేదు అంటూనే త్రిప్పుకోవడం మరీఎబ్బెట్టుగా వుంది. ఇష్టం లేనప్పుడు మొదట్లోనే వారింటికెళ్లడం మానివేయవచ్చుగా. లేకపోతే శ్యామలని రావద్దు అని చెప్పొచ్చుగా, ఏ మి టి ఈకథకి అర్థం? ఇటువంటి మనుష్యులు వుంటారా?

—బి. వనజా శరత్, (అనకాపల్లి)

### సీరియల్

ఈ వారం పత్రిక (16—8—68) ముఖచిత్రం ఆకర్షణీయంగా యున్నది. ఉన్నవ విజయలక్ష్మిగారు రచించిన "సుజాత" సీరియల్ ప్రారంభంలోనే చాల బావున్నది. సి. కనకాంబరరాజుగారు రచించిన "బాలల్లారా రండి!" గేయము చాలా బావున్నది. "కుక్క గొడుగులు" కథ చాలా బావున్నది. "పాతబొమ్మలు — కొత్తకబుర్లు" శీర్షిక ఈ వారం చాలా బాగున్నది.

సి. ఎస్. ఎస్. ప్రసాద్ (గూడూరు)

* * *

ఈ వారం (23—8—68) "ఆంధ్ర సచిత్ర వారపత్రిక", 'భారతి' ముఖచిత్రంతో ఎంతో రమణీయంగా వుంది. "సంస్కారానికి సంకెళ్ళు" అన్న కథ నన్నెంతో ఆకర్షించినది. క్రొత్తగా ప్రారంభమయిన ఉన్నవ విజయలక్ష్మిగారి 'సుజాత'


SUVARNA

సీరియల్ మొదటిలోనే ఎంతో ఆకర్షవంతంగా వుంది. "మొగలి పొదలు" సీరియల్‌లో "సుభద్ర" పాత్ర చాలా బాగుందిది. 'బతుకు కథ' మరి మరి బాగుంది. హెచ్. రజనీకాంతారావు (సీతాఫలమండి)

### వ్యాసాలు

2—8—68 తేదీ వారపత్రికలో ఎం. సత్య గారు 'ప్రొఫెసర్ల'పై వ్యాఖ్యానిస్తూ 'నోరు మెదపని మెడికల్ స్టూడెంట్సు యొక్క దుస్థితి'ని వివరించారు.

వైద్యవృత్తి చాలా పవిత్రమైనది. అసమర్థులు అందులో కాలు పెట్టరాదు. వైద్యుడు ఏ ఒక్కలోపం చూపినా ఎన్నో నిండుప్రాణాలు బలైపోతవి. ఎందరో ఆరోగ్యవంతులు రోగపీడితులౌతారు. లేదా అంగ వైకల్యంతో జీవితాంతం బాధపడుతారు. ప్రతిదినము మనం యిలాంటి సంఘటనలు చూస్తూనే వున్నాము.

ఒకానొక మెడికల్ కాలేజీలో జరిగే పరీక్షలో విద్యార్థి 'స్థితి' తారుమారై 'ప్రాక్టికల్సులో' 'ఇంటర్వ్యూలో' 'మరీ కంగారుపడి పోయి, చేతిలో వున్న పరికరాలను' పడవేసి, ఒక జవాబుకు మరియొక జవాబు చెప్పే వాళ్లు నిజ జీవితంలో రోగులు చావుబ్రతుకులనే పరీక్షలో వున్నప్పుడు ఏమి చేయగలరు. ఆ ప్రొఫెసర్‌గారి అతిమంచితనం వల్ల ప్యాస్ కాబడ్డ సదరు డాక్టరు వద్దకు రోగులను తీసుకువస్తే—క్రిందా మీదా పడిపోయి, మరీ ఖంగారెత్తిపోయి, రోగం ఒకటైతేమందొకటిచ్చి ఆ రోగుల భార్యాపిల్లల్ని అనాధలు చేయరా? అలా అనాధలైపోయిన భార్య ఎవరిని నిందించాలి? 'తమ్ముడి'నా? లేక తమ్మునికి పాఠాలు చెప్పిన ప్రొఫెసర్‌నా? లేక యిలాంటి ఖంగారులకు సీట్లిచ్చిన వారినా? ఎవరిని ఎన్ని అన్నా చనిపోయిన రోగి తిరిగి రాగలడా? యీసారి పరీక్ష తప్పితే కనీసం నాలుగు సంవత్సరాలకైనా 'తమ్ముడు' ఎం. బి. బి. ఎస్. అవుతాడేమో గాని రోగి మాట? ఒకసారి అపజయం పొందితే మరియొక పరీక్ష ఆ రోగికి లేదు కదా!

పనగాని ప్రభావతి (సామర్లకోట)

# ఉత్తరాలు

### పాత బొమ్మలు—కొత్త కబుర్లు

2—8—68 వ' తేదీ సంచికలో కొత్త శీర్షిక పాత బొమ్మలు—కొత్త కబుర్లు ప్రవేశపెట్టినందుకు చాలా సంతోషము.

జె. రూపవతీదేవి (ఆవేరు)

### మహీధరోక్తులు

వారం, వారం ప్రచురితమవుతున్న "మహీధరోక్తులు" రసగుళికల్లా వున్నాయి. తే 16—8—68 పత్రికలో మహీధరవారు 'చలం' మీద విసిరిన విసురు ఎబ్బెట్టుగా వుంది. మహీధరవారి హృదయవర్తిత్వం అంత సబబనిపించుకోలేదు.

గోపి (పలగర)

## భారతీయ భాషల వార్తాపత్రికల అమ్మకాలు!

ఈ క్రింది పట్టికలో భారతదేశ భాషలు కొన్నిటిలోని వార్తాపత్రికల అమ్మకాలకి సంబంధించిన వివరాలు ఇవ్వబడ్డాయి. దేశం మొత్తంమీద మొదటిస్థానం మలయాళ భాషది, రెండవస్థానం తమిళానిది, మూడవస్థానం గుజరాతీది., హిందీస్థానం ఎనిమిదవది అయితే తెలుగుది పదవస్థానం. ఆఖరు పదమూడవ స్థానం—సింధీభాషది.

వెయ్యిమందికి పత్రికల అమ్మకాలు

| భాష | 1964 | 1965 | 1966 (అంచనా) |
|---|---|---|---|
| మలయాళం | 94.9 | 99.2 | 88.6 |
| తమిళం | 87.6 | 83.2 | 78.6 |
| గుజరాతీ | 67.6 | 71.0 | 63.2 |
| ఉర్దూ | 53.9 | 48.3 | 35.4 |
| మరాఠీ | 42.6 | 44.4 | 36.3 |
| కన్నడం | 37.5 | 35.9 | 30.8 |
| బెంగాలీ | 38.0 | 34.8 | 32.6 |
| హిందీ | 31.6 | 31.9 | 26.0 |
| పంజాబీ | 26.6 | 27.5 | 19.7 |
| తెలుగు | 21.8 | 22.2 | 22.3 |
| అస్సామీ | 17.2 | 18.6 | 8.2 |
| ఒరియా | 10.4 | 11.0 | 7.2 |
| సింధీ | 7.1 | 7.6 | 6.6 |


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 30—8—'68
కీలకనామ సం॥ భాద్రపద మాసం శుద్ధ సప్తమి

సంపుటము : 61 సంచిక : 1

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1


## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన : శ్రీ గెనిసెట్టి.


"రోగికి అత్యవసరంగా రక్తం కావాలి. విరాళంగా ఎవరిస్తారు అనేది నాకనవసరం."
కాంగ్రెస్ పార్టీ నిధులు
విరాళాల రద్దుకు బిల్లు
"ప్రియా, నేను బయటికి వెళ్ళినప్పుడు తలుపులు మూసుకో...
"నాకు చల్లగాలి కావాలి"
'పాత దీపాల్ని సిద్ధం చేసుకోండి! కేరళ ప్రభుత్వం విజ్ఞప్తి.
— కమ్యూనిస్టు పాలనలో చీకటిని పారగొట్టేందుకా?
కేరళ
మన సొంత పార్టీ వాళ్ళే ఇదంతా చేస్తున్నారంటే నువ్వు నమ్ముతావా?

# రాజధానిలో కాలనిర్ణయం

న్యూఢిల్లీకి నాలుగు ఋతువులు మొదటిది ఆగస్టు 15 వేడుకలతో మొదలవుతుంది. దాని తర్వాత రామలీలా పండుగలు. ఈ పండుగల సందర్భంలో ఒక ప్రముఖ వ్యక్తి - రాష్ట్రపతి కానివ్వండి, ప్రధాన మంత్రి కానివ్వండి, మరెవరయినా పెద్ద మంత్రిగారు కానివ్వండి - రామలీలా మయిదానం చుట్టూ తిరిగి రావాలి. ఈ విధంగా ఏమీ తెలియని ప్రజలకి పండుగలు జరిపేవారి పలుకుబడి తెలియాలి. ఈ జరిపేవారు క్రమంగా మంచి పెత్తందార్లుగా మారిపోవటంలో ఆశ్చర్యంలేదు. వారే లయిసెన్సులు తెప్పిస్తారు. పెద్దవారి దర్శనం ఏర్పాటు చెయిస్తారు....విదేశ రాయబారవర్గం వారినికూడా ఈ వేడుకల లోకి ఈడ్చారు. ముందు ముందు కొందరు పురోహితులు విదేశ ప్రముఖులెవరూ లేక పోతే తాము మంత్రాలు చదవ వనవచ్చు.

**అలెక్సాండర్ కాలంనుంచీ...**

జనవరిలో వేడుకలు అయిపోతాయి 'బీటింగ్ ది రిట్రీట్' అనే సంబరం ఒకటి ఉంది. దీనితోనే వేడుకలు అయిపోతాయి. కాని, ఎప్పటినుంచో వస్తున్న భారత సాంప్రదాయాన్ని ఇది బాగా ప్రతిబింబిస్తుంది. 'రిట్రీట్' లేక 'ఉపసంహరణ' అలెక్సాండర్ కాలంనుంచి ఇక్కడ జరుగుతున్నదే...

శ్రీ నెహ్రూ కాలంలో 'విదేశ ప్రముఖులు' చలికాలంలో ఢిల్లీ వచ్చి వెడుతూ ఉండేవారు. అమెరికా అధ్యక్షుడు, ఇంగ్లాండు రాణి, రష్యా ప్రధాని వీరిలో కొందరు. మిగిలినవారిలో అధికులు నేపాల్ సేనానికన్నా తక్కువ పదవి కలవారు. భారతదేశ ప్రత్యేకతే దీనికి కారణం అనుకోవాలి మనం.

**సోషలిజం అంటే?**

ఎండాకాలంలో రెండవ ఋతువు ప్రారంభం అవుతుంది. ఇది చాలా గొప్ప కాలం. ఈ కాలంలో కష్టాలు అందరికీ నిష్పక్షపాతంగా పంచుతారు. స్వాతంత్ర్యం ముందు గుండె జబ్బు, కాన్సర్ గొప్పవారి జబ్బులనేవారు. ఇప్పుడందరికీ వస్తున్నాయి. సోషలిజం అంటే ఇంతే కదా? సుభిక్ష సమాజం ఈ విధంగానే కదా ఏర్పడేది? లౌకిక సిద్ధాంతానికిది మరొక తార్కాణం కదా?

కాని, ప్రజలలో చాలామందికి ఈ సంగతి తెలియదు! నీటి ఎద్దడి ఉండరాదంటారు తిండి పదార్థాలలో కల్తీ పనికి రాదంటారు. విద్యుచ్ఛక్తి సప్లయి తరుచు ఆగిపోవడం కూడదంటారు......

**మూడవ ఋతువు**

వరదలతో మూడవ ఋతువు మొదలు; బ్రిటిషు పరిపాలన రోజులలో రయిల్వేలవల్ల వరదలు వచ్చాయనేవారు. తర్వాత తర్వాత (ప్రస్తుతం ఒరిస్సా గవర్నరు శ్రీ ఏ. ఎన్. ఖోస్లా నాయకత్వం కింద) ఎన్నో నీటి పారుదల పథకాలు తయారు చేశారు. వరదలు ప్రమాదకరం కాకుండా చేస్తామన్నారు. సాగుబడి ఎక్కువ అవుతుందన్నారు. నౌకాయానం కూడా వీలవుతుందన్నారు. ఇరవయి ఏళ్ల తర్వాత నీటిపారుదలమంత్రి శాఖవారు —ఎన్నో కోట్లు, జీవితాల కర్చు తర్వాత— 'వరదల నరికట్టే సంఘం' ఒక దానిని ఏర్పరుస్తామని ప్రకటించారు. శ్రీ రావు గారికి అధికారం తక్కువ. కాని, నదీతీరాల వెంబడి ఇళ్ల నిర్మాణాన్ని నిషేధిస్తామంటారు. దీని సంగతి ఎలా ఉన్నా ఢిల్లీలో మాత్రం, యమునానది నీరు పొంగగానే, చుట్టుపక్కల పల్లెలవారి నందరినీ న్యూఢిల్లీలోకి తీసుకు వచ్చేస్తారు. వారితో బాటు సంఘ సేవకులు.

నీరు చెడిపోయింది. అదే ఈ ఏటి విశేషం. నీరు చెడటంతో డాక్టర్ల ప్రాక్టీసులు పెరిగాయి......

**అధికారానికి యుద్ధం**

ఉపమంత్రి జహనారా జయపాలసింగ్ లోకసభలో ఒక విసురు విసిరారు. అంతరంగిక వ్యవహారమంత్రి శ్రీ శుక్లా ప్రతిపక్షంవారిని ప్రశ్నలు వెయ్యమని పురమాయిస్తున్నారని ఫిర్యాదు చేశారు. శ్రీ శుక్లా తాము చేసేదానిలో తప్పు లేదన్నారు; రహస్యసమాచారం దేనినీ బయటపెట్టడం లేదుకదా అన్నారు. ఇది లోకసభకి పరిమితమయినది కాదు. శ్రీ మొరార్జీ దేశాయికి అపకీర్తి తెచ్చే సమాచారాన్ని శ్రీ మధూలిమాయెకి ఇచ్చినవారు ఆయన (శ్రీ దేశాయి) సహచరులయిన మంత్రులే కాని వేరెవరూ కారని శ్రీ ఎస్. కె. పాటిల్ అన్నారు. కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ నిజలింగప్ప, జపాన్ పర్యటన, ఆయన అల్లుడి ఉద్యోగం— వీటికి సంబంధించిన సమాచారంకూడా కాంగ్రెసు వారే బయట పెట్టారని కొందరు అంటున్నారు. కాంగ్రెసు అధ్యక్షుడు విచారణ జరిపిస్తున్నారు. ఇదంతా రెండు వర్గాలవారి అధికార వ్యామోహంవల్ల ఏర్పడ్డ విరోధాల ఫలితం అని వేరే చెప్పనక్కరలేదు. శ్రీమతి గాంధీ ఉత్తరప్రదేశానికి చెందినవారు. అందుచేత ఆ రాష్ట్రంవారు ఆమెని బలపరుస్తున్నారు. ఉ. ప్ర. 1946 నుంచి భారతదేశాన్ని పాలిస్తోంది. రాజస్థాన్, మధ్యప్రదేశం, బీహార్లు కూడా ఆమెనే బలపరుస్తున్నాయి. జగజీవనరావ్, సత్యనారాయణ సిన్హాలద్వారా బీహారుని తమ వయిపు తిప్పుకున్నారు. ఇక హిందీ-ఇతర రాష్ట్రాలవారు శ్రీ మొరార్జీ దేశాయికి ఎదురుగా (ఉదాహరణకి ఆయన పేరు ఇస్తున్నాను) ఆమెనే బలపరుస్తారు.

**పేరుకి దెబ్బ**

శ్రీ దేశాయి కుమారుడికి సంబంధించిన గొడవలో ఆయనపేరు దెబ్బతిన్నది; ఆయన అనుసరించిన ఉపాయాలు అంత బాగాలేవు. హిందీని బలపరచి దక్షిణాదివారిని దూరం చేసుకున్నారు. అస్సామ్ పునర్నిర్మాణం పథకం ద్వారా ఆ రాష్ట్రంవారిని దూరం చేసుకున్నారు. అయితే ఏ ఆర్థిక సమస్య మీదా—బాంక్ జాతీయం మినహాయిస్తే —

ఆయన ఒక ధోరణి అంటూ చూడలేదు.

తమ కుమారుడి విషయంలో ఆయన శ్రీమతి గాంధీని ఆశ్రయించారు. దీనివల్ల ఆయనకి వచ్చిన లాభం ఏదీ లేదు. లోక్ సభలో 19 ఆగస్టున చర్చ జరగనే జరుగుతుంది. ఆయన బతికి బయట పడవచ్చు కాని ఆయన పేరు దెబ్బతింటోంది.

ఇంకా అవమానాలు...

శ్రీ కామరాజ్ ద్వారానే తాము శ్రీమతి గాంధి ప్రభుత్వంలోకి రాగలిగారని శ్రీ దేశాయి గ్రహించి ఉండాలి. శ్రీమతి గాంధిగారి విదేశాంగమంత్రి శాఖవారు ఆయనని అవమానించటానికి వెనుదియ్యలేదు ఆయన ఇంతకి ముందే రాజీనామా ఇచ్చి ఉండాలి. ఇప్పుడు వెళ్ళిపోయి లాభం లేదు. ఆయన ఉన్నకొద్దీ అవమానాలకి గురి అవుతారు.

ఇక తర్వాతి దెబ్బ శ్రీ చవాన్ మీద పడుతుంది ఆయనని దెబ్బతియ్యటం మాత్రం తేలిక కాదు.

*　　*　　*

ఇటీవల పార్లమెంటులో జరిగిన ప్రశ్నోత్తరాల వల్ల తెలిసిన దేమిటంటే—

అ. రాజధానిలో హిందీ అంకెలు కల కార్లవారికి 'చలాన్'లు ఇవ్వలేదు.

ఆ. ఇది భాషా విధానానికి విరుద్ధమనే ప్రసక్తి లేదని రవాణాశాఖ మంత్రిగారి అభిప్రాయం.

ఇ. ప్రస్తుతం మోటార్ వెహికిల్స్ చట్టం ప్రకారం బళ్ల ప్లేట్ల మీద రోమన్ లిపి అక్షరాలూ, అంతర్జాతీయంగా చలామణి అవుతున్న అంకెలూ మాత్రమే ఉండాలి. ఈ నియమాన్ని మార్చే ప్రయత్నం గురించి ప్రభుత్వంవారు ఆలోచిస్తున్నారు.

అంటే, చట్టవిరుద్ధం కాబట్టి హిందీ అక్షరాలు, అంకెలు ఉన్న కార్ల విషయంలో చర్య తీసుకోవాలి కదా? రాజ్యాంగం ప్రకారం అంకెలు అంతర్జాతీయంగా వాడే అంకెలుగానే ఉండాలి. రాజ్యాంగం విూద ప్రమాణం చేసిన మొరార్జీ ప్రభృతులు ఈ సంగతి మర్చిపోతున్నారు. తమ ప్రమాణానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నారు.

విదేశాలలోని భారత రాయబార కార్యాలయాలలో హిందినే వీలయినంతవరకూ వాడుతున్నట్లు ఒక మంత్రిగారు శాసనసభలో చెప్పారు. ఇక రాబోయేకాలంలో భారత రాయబారులందరూ హిందీ వచ్చినవారుగానే ఉంటారు. ఇంగ్లీషు వచ్చినవారితో అనువాదకుల సహాయంతో మాట్లాడుతారా?...

# వినాయకచవితి



వల్లభ గణపతి—అవుదయార్‌కోయిల్

*అగజానన పద్మార్కం,*
*గజానన మహర్నిశం*
*అనేక దం తం భక్తానాం*
*ఏక దంత ముపాస్మహే ॥*



గణేశాస - సుచీన్ద్రమ్

తలచుకున్న కార్యం నిర్విఘ్నంగా జరగడానికి మొట్టమొదట గణాధిపతిని పూజించడం భారతీయుల సంప్రదాయం. అలా పూజించకపోతే కోపంవచ్చి వినాయకుడు ఆపనిని జరగకుండా చేస్తాడట! ఏమంటే— విఘ్నాలు ఆయనచేతిలో ఉన్నాయి.

దీనినే మనస్సులో పెట్టుకొని ఒక మహాపండితుడు 'భూనాయకుణ్ణి కొలిస్తే భూములిస్తాడు; ధనాధిపతిని సేవిస్తే ధనం యిస్తాడు; విఘ్ననాయకుణ్ణి భజిస్తే విఘ్నాలే వస్తాయి. కనుక ఆయన్ను సేవించను; మా జోలికి రావద్దని వెయ్యి దండాలు పెడతాను' అని చమత్కారంగా స్తుతించాడు.

కార్యారంభంలోనే కాదు. ఏ దేవతను పూజించదలచినా ముందు వినాయకపూజ జరగవలసినదే! ఇలా సర్వదా, సర్వత్రా ఈ పూజ జరుగుతున్నా భాద్రపద శుద్ధ చవితి నాడు యావద్భారతమూ విశిష్టంగా జరుగుతుంది, ఆరోజు ఆయన జన్మదినం కాబట్టి.

వినాయకుని జన్మను గురించి అనేక గ్రంథాల్లో అనేక రీతులుగా ఉన్నది. వాటిలో పార్వతీదేవి పిండిబొమ్మను తయారు చేసి ప్రాణం పోయించడం, శివుడు కోపించి తలను ఎగరగొట్టగా ఏనుగు తలను పెట్టించడం' ఎలుక వాహనం కావడం, చంద్రుడు నవ్వగా శపించడం, తత్ప్రభావంవల్ల శ్రీకృష్ణుడికి నీలాపనింద రావడం — ఇత్యాది అందరూ చెప్పుకొనే కథ బహుళ ప్రచారంలో ఉన్నది.

వినాయకుడు శాశ్వత బ్రహ్మచారి. 'సిద్ధిబుద్ధిప్రియా' అని అతన్ని పిలవడంవల్ల సిద్ధి, బుద్ధి అని యిద్దరు భార్యలు అతనికున్నారని కొందరంటారు. సిద్ధి అంటే కార్యసిద్ధి అనీ, బుద్ధి ఉత్తమ బుద్ధి అని అభిప్రాయం. సిద్ధి బుద్ధి శబ్దాలు స్త్రీలింగాలు కావడంవల్ల సిద్ధి బుద్ధులు వినాయకుడి భార్యలని ఊహించి వుండవచ్చును. వినాయకుణ్ణి కొలిచేవారికి కార్యసిద్ధి అవుతుందనీ గొప్పబుద్ధి కలుగుతుందనీ తెలుసుకోవాలి. అంచేతనే యితడు విద్యార్థులు తప్పక కొలవవలసిన వేల్పనీ, విద్యాధిదేవత అనీ అంటారు. ప్రాచీన పద్ధతిని అనుసరించే విద్యార్థులు వినాయకుణ్ణి భాద్రపద శుద్ధ చవితినాడు తప్పక పూజిస్తారు. నాడు



దొడ్డ గణపతి—బెంగుళూరు



పంచముఖ విఘ్నేశ్వరుడు - నాగపట్నం

మొదలు తొమ్మిదిరోజులు వైభవంగా పూజలు చేసి, విద్యాచర్చలు, మహోపన్యాసాలు, కాలక్షేపాలు మొదలైనవి జరుపుతారు. వసంత నవరాత్రులు, దేవీ నవరాత్రులువలెనే ఇవా నవరాత్రులున్నూ ప్రసిద్ధమై ఉన్నాయి.

వినాయకుడి స్వరూపం చాలా వికృతమైనది. ఏనుగు తల, ఏకదంతం, శూర్పకర్ణాలు, లంబోదరం, నాగమునను పొట్టకు చుట్టపెట్టుకోవడం విచిత్రం. ఇట్టివానికి ఎలుకవాహనం కావడం మరీ విచిత్రం! దీన్నిబట్టి చూస్తే ఈ వేలుపు పంటల దేవుడని కొందరు తలుస్తున్నారు. తొండంతో సహా గజశిరస్సు—ధాన్యం కోతయయాక వరిమోపును తలపై పెట్టుకొని వెళుతున్న కర్షకుని సూచిస్తున్నదట. ఏకదంతం చేను కోసే కొడవలికి గురుతు చెవులు ధాన్యం తూర్పారబట్టే చేటలకు ఉపలక్షకాలు. లంబోదరం ధాన్యపు గాదెకు చిహ్నం. అతనికి నివేదించే కుడుములు, ఉండ్రాళ్ళు వరిపంటనే సూచిస్తాయి. పాములు, పంటలను అపహరించే ఎలుకలు రాకుండా గమనిస్తాయన్నమాట. ఎలుక వాహనం కావడంవల్ల — దాన్ని అణచివేసి తన స్వాధీనంలో వుంచుకోవడం గ్రహించదగి ఉన్నది.

వినాయకుడి ఏనుగు తల బుద్ధికిన్నీ, వాహనమైన ఎలుక శ్రద్ధకున్నూ చిహ్నాలని కొందరి అభిప్రాయం.

పరమేశ్వరుడు విఘ్నరాజుకు గణాధిపత్యాన్ని అనుగ్రహించగా, బ్రహ్మదేవుడు అణిమాదులైన అష్టసిద్ధులనూ ఇచ్చాడట! గణాధిపతి బ్రహ్మ తనకు చేసిన ఉపకారాన్ని గురించి సంతోషించి 'ఏం కావాలో కోరుకో' అని అడిగాడట! అప్పుడు బ్రహ్మ తాను చేసే సృష్టి కార్యక్రమానికి ఎటువంటి విఘ్నమూ కలగకుండా వుండేటట్లు వరం యివ్వాలని కోరగా వినాయకుడు అలాగే యిచ్చేడట! దీనివల్ల ఏమి తెలుస్తుందీ? బ్రహ్మవంటి సురజేష్ఠుడికి కూడా వినాయకుడంటే హడలన్న మాట.

గౌతమ బుద్ధుడికి వినాయకుడనే పేరు ఉన్నది. అతడు ఒక జన్మలో ఏనుగుగా వుండినట్లు జాతక కథలవల్ల తెలుస్తున్నది. మాయాదేవికి వచ్చిన స్వప్నంలో శ్వేతగజ సమాచారం కానవస్తున్నది. వీటనిటనీబట్టి వినాయకపూజా అవీ బౌద్ధమత ప్రభావంవల్ల వైదిక మతంలో ప్రవేశించినట్లు కొందరు విదేశీయులు అభిప్రాయపడ్డారు. కాని బౌద్ధమతం రాకముందే వైదికమతంలో వినాయకుడి సమాచారం కానవస్తున్నది. అంచేత—పాశ్చాత్యుల ఊహ నిరాధారమని చెప్పవలసి వుంది.



వ్యాఘ్రశక్తి వినాయకుడు—మదురై

మన మత కథలకు ఖగోళ విషయాలతో సంబంధం కల్పించడం ఉన్నది. అది చాలా వరకూ యుక్తియుక్తంగానే కనబడుతుంది. సాధారణంగా భాద్రపద శుద్ధ చవితినాడు హస్తానక్షత్రం వుంటుంది. హస్త నక్షత్రం ముంజేతి ఆకారంలో ఉంటున్నది. ఆనాడు సూర్యోదయాత్పూర్వమే వినాయక నక్షత్రం ఉదయిస్తుంది. ఇందువల్ల అతనికి హస్తిత్వం సంభవిస్తుంది. దాన్నిబట్టే వినాయకుడికి గజత్వం కల్పితమైంది. నాటి చంద్రుడు—ఊహించి చూస్తే బోసినోటితో నవ్వుతున్నట్లు కనబడుతుంది. వినాయకుణ్ణి చూసి చంద్రుడు నవ్వుతున్నాడని గ్రహించ



వీణాధర వినాయకుడు - భవాని

బడింది. దీన్ని అనుసరించే చంద్రుణ్ణి చూడకూడదనే శాపం, శమంతకమణి వృత్తాంతం కూర్చబడ్డాయి. శమంతకమణి కథలోని సింహం సింహరాశి. ఆ రాశిలో వున్న సూర్యుడే శమంతకమణి. జాంబవంతుడే ఆంగ్లేయులుచెప్పే గ్రేట్ బేర్ — పెద్ద ఎలుగుబంటి.

ఈ విధంగా వివిధ కోణాల్లో చూస్తే వినాయకుడి వృత్తాంతం వేర్వేరు రీతులుగా గోచరిస్తుంది. ఏవిధంగా చూసినా వినాయకుడు అందరికీ ఆరాధ్యుడైన వేలుపు! వినాయకచవితి పవిత్రమైన పర్వదినం!

— బులుసు వేంకటరమణయ్య ●



కామాక్షి పేరుకు తగ్గట్టు అందంగా ఉంటుంది, చెంపకు చేరడేసి కళ్ళతో. మొదట కామాక్షి పనిలోకి వస్తూనే, ఇల్లు చిమ్ముతూన్న దాని అందానికి వంటవాడు ముత్తూ పనివాడు రెడ్డి, తోటవాడు నాగప్పా అందరూ ఆశ్చర్యపడిపోతూ, ఎవరి పని వాళ్ళు మరిచిపోయి, దాన్నిచూస్తూ, ఒక పనికి బదులు మరొకపని చేస్తూ, మాచేత చీవాట్లు తింటం మొదలెట్టారు.

మా పనిమనిషి జయమ్మకు జబ్బుచేసి ఆస్పత్రిలో చేరింది. మాకు అర్జెంటుగా పనిమనిషి కావాలని వెతుకుతూంటే మా పాలవాడు తీసుకొచ్చాడు కామాక్షిని:– కొత్తగా కోయంబత్తూరునుంచి వచ్చిందిట కామాక్షి– దాని తల్లిదండ్రులూ, అన్నదమ్ములూ పండ్ల వ్యాపారం చేస్తారుట. కామాక్షి కోయంబత్తూరులో ఉండగా తనుకూడ పండ్లు బండ్లో పెట్టి అమ్మేదిట వీధి వీధి తిరిగి...కామాక్షిదగ్గర పండ్లు కొంటానికి ప్రతివాళ్ళూ ఎగబడేవారుట...మిగత పండ్ల బండ్లవాళ్ళంతా కామాక్షిని తిట్టసాగేవారుట...దాని అందంకోసం పండ్లబండి ఖాళీ అవుతోంది, కానీ పండ్ల కోసరం కాదని నిజానికి మిగత బండ్లలో పండ్లకన్నా కామాక్షి బండ్లో పండ్లు అన్నీ చచ్చువీ, పుచ్చువీ ఉండేవిట — అయినా యిట్టే అమ్ముడు పోయేవిట; కామాక్షి బండిదగ్గర నిలబడితే చాలు ... మళ్లీ కామాక్షి అక్క ఎప్పుడేనా బండిదగ్గర నిలబడితే పండ్లన్నీ బండ్లోనే ఉండేవిట ... ఒక్కళ్ళూ కొనేవారు కాదుట. కామాక్షి అన్నలకు కామాక్షి అందం శత్రువు. ప్రతిరోజూ ఎవర్నో ఒకర్ని కామాక్షిని అలా అన్నాడనో, ఇలా అన్నాడనో – అంటూ తన్నేవాళ్ళూ, తన్నులు తినేవాళ్ళూ.

పళ్లసీజను కానప్పుడు కామాక్షి ఎవరింట్లోనైనా పనికి వెళ్ళేది. ఒకసారి ఒక చెట్టియారు ఇంట్లో పనికి కుదిరిందట... ఆ చెట్టి తలకు నూనె రాసి వీపు తోమమన్నారుట. వెంటనే పని మానేసి వచ్చేసిందట కామాక్షి ... మాట కరకూ, పని చురుకూ కామాక్షికి ఆభరణాలు. చెవలకేమీ పెట్టుకోలేదేమంటే తన కమ్మలు మొగుడు తాకట్టు పెట్టాడని చెప్పింది, ముక్కుపుడకతో సహా.

కామాక్షి ఎప్పుడూ నవ్వదు. మూతి ముడుచుకుని తనపని తాను చేసుకుపోతూంటుంది. ఎప్పుడేనా నవ్విందంటే బగ్గలు సొట్టపడుతూ, పౌర్ణమినాటి వెన్నెల్లాగా దాని ముఖం మరికొస్త అందంగా కనిపించేది. పట్టుమని పాతికేళ్లేనా నిండని కామాక్షి కళ్ళల్లో విషాద రేఖలు కనిపించేవి. కామాక్షి భర్త జబ్బుమనిషట...దగ్గర్లోనే ఒక గుడిసెలో ఉంటున్నారు – నెలకు పది రూపాయిలు అద్దెయిచ్చి. దాని మొగుడు తాపీపని చేస్తాట్ట...కాని, ఎప్పుడూ దగ్గుతూండటంవల్ల ఎవరూ పనియివ్వటం మానేశారు. వాడింటోనే కూర్చుని కామాక్షి మూడేళ్ల కొడుకు చూసుకోడానికి బదులు ఊరికే పిల్లాణ్ణి కొడ్తూంటాట. కామాక్షి పొద్దున పనిలోకి వచ్చి, సాయంకాలం ఆరింటికి ఇంటికి వెళుతుంది. ఈలోగా ఇరుగు పొరుగువాళ్ళు నీ మొగుడు పిల్లాణ్ణి చావగొడ్తూంటాడని, పిల్లాణ్ణి కూడా తీసుకెళ్తాండ'మని చెప్పారు. వెంటనే పిల్లాణ్ణి పుట్టింటికి పంపేసింది, వాళ్ల వూరు వాళ్ళెవరో వెళుతూంటే... 'పోనీ ఉంచలేకపోయావా?. కూడా పిలుచుకుని రావచ్చు'అని నేనంటే 'ఒద్దమ్మా? వాడికి చదువులేక పాడవుతాడు. మా అమ్మ బాగా చూసుకుంటది.' అన్నది.

'అసలు, కన్నతండ్రి ప్రతిరోజూ అలా బిడ్డను కొట్టడం ఏమిటి?' అని నేనంటే కామాక్షి కళ్ళు తుడుచుకుంటూ చెప్పింది. ఆ పిల్లాడు వాణ్ణి 'నాన్నా!' అని పిలవడట.

'ఇదేమన్యాయమే? ఎందుకనడు? కన్నతండ్రిని నాన్నా! అని,' అని మా అత్తగారడిగితే,

'ఆయన కన్నబిడ్డ కాదంటాడు, పెద్దమ్మగారూ! ఆయన పుట్టింటోఉంచి, ఇంకోదాంతో కాపరం చేస్తావుండి నన్ను పెండ్లయిన కాణ్ణుంచీ కష్టాలు పెడ్తా ఉన్నాడు. ఎన్ని కష్టాలుపెట్టినా,తాక్కుండాఉంటే బాగుండేవాడు. తాగొచ్చి, రోజూ తన్నేవాడు. మాయమ్మకి తనంటె ఇష్టం లేదు. అందుకని నన్ను పుట్టింటికి పిల్చుకుపోయింది. పుట్టింట్లోనే పిల్లాడు పుట్టాడు. మాయమ్మగారింట్లో పిల్లాణ్ణి పెట్టుకుని, పండ్ల యాపారం చేసుకుంటా ఉంటిని. అసలు ఈ పిల్లోడికి తండ్రెవరో తెలిస్తేగా! పిలిచేందుకు? 'నాన్నా!' అని. వాడు పుట్టినప్పట్నుంచి పుట్టింటోనే ఉంటిని. మొన్నే మావాళ్ళు రాజీపడి పిల్లోణ్ణీ, నన్నూ. వీడివెంట పంపారు మాయమ్మ కిష్టంలేదు. నేనితన్తో రావడం... ఇంకోదాని వల్లోపడి, నా పెళ్లిచీరా, మంగళసూత్రాలు సహా దానికిచ్చొచ్చాడు.'

అని కామాక్షి చెప్తూంటే మా అత్తగారు ముక్కుమీద వేలేసుకున్నారు దాని ఓర్పుకి.

సాయంకాలం ఆరుగంటలవుతూనే చేతిలో ఏ పని ఉన్నా విడిచిపెట్టి, 'ఇక ఇంటికి పోతున్నానమ్మగారు!' అనేది కామాక్షి.

'ఎందుకే అంత తొందర? చేతిలో పని

పూర్తిచేసి, పోరాదూ?' అని మా అత్తగారంటే,

'మీకు తెలవదమ్మా! మావాడొట్టి అనుమానం మనిషి. కాస్త ఆలస్యం అయితే మన గేటుకాడికొచ్చి, కాచుకోనుంటాడు. నన్నక్కడే తంతాడు, నానా మాటలూ అంటాడు... ఈ కాస్తపనీ పొద్దున్నే వచ్చి చేస్తానమ్మగారూ!' అని బ్రతిమాలుకునేది.

'ఏడే! నీ మొగుడు? నాకు చూపించు వాణ్ణి! నాలుగు చీవాట్లు పెడ్తాను' అని మా అత్తగారంటే,

'అయ్యో! పెద్దమ్మగారూ! మీరాయన్ని చూస్తే అసయ్యించుకుంటారు. తాగి తాగి, గుండె ఎండిపోయి, వరుగ్గై పోయాడు మనిషి. కోపం జాస్తి. ఎప్పుడూ కత్తి దగ్గఱ పెట్టుకోనుంటాడు—' అని కామాక్షి చెప్తూంటే, మా అత్తగారు కత్తిమాట వినగానే, ఇక మళ్లీ వాణ్ణి చూపించమని గాని, దాన్ని ఉండమనిగాని చెప్పకుండా, 'వీడెవడే? రౌడీ చట్టంగా ఉంది. వెధవ పీడ—పో! పో! నీవు యింటికి ఇంకా పెందరాళే పో, ఆ వెధవ గేట్లోకి రాకుండా!' అంటూ తరిమేశారు. 'ఎవరన్నా మంచి పనిమనిషి దొరికితే దీన్ని పంపించేద్దామే... ఆ రౌడీ వెధవ దీనివెంట కత్తిపట్టుకు తిరుగుతూంటే కష్టం కదూ? గూర్ఖాకి కాస్త గట్టిగా చెప్ప హిందీలో...వాడు చచ్చిగి పెట్టినా లోపలికి రానివ్వద్దని ... అన్నట్లు గూర్ఖాల దగ్గరకూడా కత్తి వుంటుంది కదూ?' అన్నారు కాస్త ధైర్యం తెచ్చుకుంటూ మా అత్తగారు.



'ఆ! ఏం భయంలేదు.' అన్నా నవ్వుకుంటూ.

'అంత అందమైన కామాక్షికి ఆ రోగిష్టి మొగుడేమిటి? పైగా కొడతాట్ట దాన్ని దరిద్రుడు—అంత కోమలంగా ఉన్న కామాక్షిని కర్రతీసుకుని బాదేస్తాట్ట. వాడికి చేతులెలా వస్తాయో?'



అంటూ తోమేటప్పుడు దాని వంటి మీద వాతలుచూసి, వాళ్ల వంటిమీద వాతలు పడ్డట్టు బాధపడ్డారు, వంటవాడు ముత్తూ, పనివాడు రెడ్డి, తోటవాడు నాగప్ప.

'ఆ మొగుడు వెధవని చంపి పోగు లేయాలి.' అన్నాడు రెడ్డి. కామాక్షి మొగుణ్ని చూసిన ముత్తు 'అసలు వాడు 'కామాక్షి మొగుడు' అని చెప్పడానికి వీలు లేదు ఆ గాడిద దాని మొగుడు కాలేడు కాకూడదు. న్యాయంగా' అంటూ బాధ పడ్డాడు

'అంతందంగా, చందనం బొమ్మలా ఉన్న కామాక్షికి ఆ మొగుడేమిటి? బక్క చిక్కిన రోగిష్టి వెధవ ... కళ్లు ఛింత నిప్పుల్లా ఉంటాయి ఎప్పుడూ...అందులో, వార్నీషు తాగుతాడట వెధవ. అందుకే

## కామాక్షి కథ

ఎప్పుడూ దగ్గుతూంటాడు...వాడు దగ్గుతూండటం చూస్తే వాడికేదో పెద్ద జబ్బే ఉండేట్టుంది'.

అన్నాడు రెడ్డి అనుమానంగా చూస్తూ ...

'ఆ! కరెక్టు! నిజమే!' అన్నాడు నాగప్ప...

'అయితే! ఆ రోగం కామాక్షికి కూడా రావచ్చులే?' అన్నాడు ముత్తు బాధగా...

'ఇప్పుడేం గతి పాపం! కామాక్షి అన్యాయం అయిపోతుంది?' ... అంటూ ముగ్గురూ తలలు పట్టుకు కూచున్నారు. వాళ్ల డిస్కషన్‌తో మా కారోజు రెండు గంటలకు భోజనం పెట్టాడు ముత్తూ.

కామాక్షిని గురించే ఆలోచిస్తూ పిచ్చివాడిలా, వాడిలో వాడు మాట్లాడుకుంటూ, వేడి నిట్టూర్పులు విడిచేవాడు రెడ్డి.

ఒకరోజు కామాక్షి యింటికెళ్లటం అరగంట లేటయింది. దాని మొగుడొచ్చి గేటుదగ్గర కాచుకున్నాడు కామాక్షి కోసం. 'దాని మొగుడు గేటులోకి వచ్చాడు' అని వినగానే మా అత్తగారు గాభరాపడి పోయి, కామాక్షిని కేకేసి, ముందు యింటికి పొమ్మన్నారు. కామాక్షి మా అత్తగారి దగ్గరకు వచ్చి, తాను యింటికి వెళ్లనని, మొగుణ్ణి గేట్లోనే గూర్ఖాతో గెంటించమని, అతన్తో తన ప్రాణం విసిగి పోయిందని, ఆస్పత్రిలో చేరకపోతే ఆ రోగం తనకు వస్తుందని అందరూ అంటున్నారని, చెప్పి కళ్లు తుడుచుకుంది. దానికి సాయంగా 'అవునమ్మగారూ! కామాక్షి ఆ రోగిష్టాడికి వంటా, అదీ చేస్తూవుంటే, ఆ జబ్బు ఆవిడ కొచ్చినా రావచ్చు' అన్నాడు రెడ్డి...

మా అత్తగారు రెడ్డిని ఉరిమిచూసి, 'నీ కెందుకురా! దాని మొగుడి గొడవ? ఎన్నిసార్లు చెప్పాను? మీరు దాని విషయంలో కలుగజేసుకో వద్దని?' అని చివాట్లు పెట్టారు మా అత్తగారు.

'మా కేంటమ్మా! పాపం!...ఏదో ఆడ కూతురు–అంత కష్టాలు పడ్తూ ఉందే ఆ రోగిష్టాడితో? అదే మా బాధ'

'అంతేన్రటా! / మీ బాధ? ఒక ఆడ కూతురు మీద అనవసరంగా అంత అభిమానం మీ అందరికీ ఎందుకుండాల్రా? నాకు తెలియక అడుగుతాగాని ... వెధవ్వేషాలు కాకపోతే?' అంటూ ఆమె కొప్పడే సరికి,

'మా కేంటమ్మా! ఏదో అంతా ఒకచోట పనిచేసేవాళ్లం గనుక...లేకపోతే కామాక్షి ఏమైపోతే మా కేం? అది అంటువ్యాధని అంటున్నారు...కామాక్షికి ఆ జబ్బు ఎక్కడొస్తుందో అని'

'ఓహో! అదన్నమాట మీ భయం! మరేమీ భయంలేదు. మీ పనులు మీరు చూసుకోండి...ఆలు మగలకు అంటువ్యాధులేమిట్రా తిక్క వెధవా? అయినా పదే పదే దాని మొగుడు సంగతీ, వాడి రోగం సంగతీ, నీ కెందుకూ అంట? అర్థం లేకుండా ...ముందు నీ పనేమిటో చూసుకో'

అంటూ కోప్పడ్డారు మా అత్తగారు. రెడ్డి వెళ్లినట్లే వెళ్లి కామాక్షి ఏం చెప్తుందో అని తలుపుచాటున నిలపడ్డాడు.

అమాయికత్వానికి మరో పేరులా నిలబడ్డ కామాక్షి తన చక్రాల్లాంటి కళ్లు లైట్ హౌస్ లైట్లల్లే క్షణాని కోసారి తిప్పుతూ తన అసహాయస్థితికి అందరూ జాలిపడుతూంటె, వేడి నిట్టూర్పులు విడుస్తూ నిలబడ్డది. మొగుణ్ణి గేట్లోకి వస్తే గెంటించేయమన్న కామాక్షిని చూసి మా అత్తగారు మండిపడ్డారు. ఎక్కువ మండిపడితే వేరే పనిమనిషి లేదుకనక కోపాన్ని కొంత అణుచుకున్నారు. ఈ లోగా మళ్లీ కామాక్షి మొగుడు కబురు పెట్టాడు దాని కోసరం. మా అత్తగారిగుండె ఝల్లుమన్నది. 'ఏట్టాగే? ఇది యిట్టా తిరుక్కుందే!' అంటూ నా దగ్గరకు వచ్చి చెవిలో అన్నారు.

'మనం మాట్లాడక ఊరుకుంటే సరి' అన్నాను.

'మాట్లాడక ఊరుకుంటే, ఈ వెధవలు వెళ్లి, దాని మొగుణ్ణేమన్నా అని... వాడసలే తాగుబోతు వెధవ. వీళ్లమీద చెయి చేసుకుంటే కష్టంకదే? 'తర్వాత పోలీసులూ గొడవా' ... అంటూ ఆవిడ కంగారు పడ్డారు.

బుంగమూతి పెట్టి నిలబడ్డ కామాక్షిని మా అత్తగారు వసుదేవుడు గాడిద కాళ్లు పట్టుకున్నట్టు బతిమలాడటం మొదలెట్టారు.

'నే నెట్టాగమ్మా పోతాను? ఆస్పత్రిలో చేరమంటే చేరడు. రోగం నయం చేసుకోడు. నన్నిడిసెళ్ల నంటాడు. అనుమానం మనిషి...అట్టానే వుంటే ఆ జబ్బు నాకూ్కడా రావచ్చని డాక్టర్లు చెబుతా వుంటే కనుక్కోకుండా పిడివాదం చేస్తా వుంటే ఏంచేసేది చెప్పండి ?'

ఈ లోగా రెడ్డి, నాగప్పా, ముత్తూ కలిసి కామాక్షికోసం కాచుకోనుండే దాని మొగుణ్ని చూట్టానికి వెళ్లారు. వాళ్లని చూడగానే కైపులో వుండే కామాక్షి మొగుడు జేబులో ఉన్న కత్తి పైకి తీశాడు. తక్షణం రెడ్డి, నాగప్పా, ముత్తూ గూర్ఖా వాడి వెనక్కివెళ్లి నిలబడ్డారు. కామాక్షి మొగుడు వాళ్ల ముగ్గురే తన పెళ్లాన్ని ఇంటికి రాకుండా చేస్తున్నారని గోలచేయడం మొదలెట్టారు. వాళ్లని గేటుదాటి బయటకు రమ్మని సవాల్ చేశాడు. ఒక్కొక్కళ్లని నరికి పోగులు పెడ్తానని బెదిరించాడు.

ఆ రోజునుంచి వాడి భయానికి పనివాళ్లు సినిమాకు పోవడంకూడ మానేశారు. అంతకుముందు రెండో ఆటకు వెళ్లే రెడ్డి గేటు దాటడానికే జంకేవాడు 'ఏమో ! తాగుమోతువాడు. అందులో వార్నీషు తాగే వెధవ. తెగించి కత్తితో ఏం చేస్తే ఏంగతి ? పిచ్చివాడి చేతిలో రాయి'.

చివరకు గడియ గడియకు టీ నీళ్లు తాగొచ్చే నాగప్ప టీ తాగడం మానేశాడు. వాడక్కడే ఉంటాడని చెప్పారెవరో. కామాక్షి యింటికి వెళ్లి రెండు రోజులైంది. రోజూ దాని మొగుడు గేట్లోకి రావడం, కబురు పెట్టడం జరుగుతూనే ఉంది. కాని రెడ్డి, వంటవాడూ, నాగప్పా, ఎవరూ గేటువేపు వెళ్లలేదు.

కామాక్షి మొగుడు విషం తిని చచ్చిపోతానని బెదిరిస్తూ జాబురాశాడు దానికి. 'తొందరగా సొమ్మను' అన్నారు రెడ్డి, నాగప్పా, వంటవాడు.

కాని పిండి రుబ్బుతున్న కామాక్షి జాబు చూసి కళ్లనీళ్లు పెట్టుకుంది. గేటు దాకా వెళ్లి మొగుడ్తో రెండు మాటలు మాట్లాడివస్తానని చేతులు కడుక్కుంది. 'వాడితోకూడ యింటికి వెళ్లొద్దు' అని నాగప్పా, వంటవాడూ, రెడ్డి ప్రాధేయపడ్డారు, మా అత్తగారికి తెలియకుండా. పోనని వారికి మాటిచ్చింది కామాక్షి. గేటుదగ్గర మొగుడ్తో ఏంమాట్లాడుతుందో వినాలని రెడ్డి వాళ్లకు ఆదుర్దా ఎక్కువైంది. కానీ వాడు వీళ్లని చూస్తే కత్తి తీస్తాడనే భయంతో కాళ్లుకాలిన పిల్లుల్లాగా భయంతో అటూ ఇటూ తిరుగుతూ 'కామాక్షి ఎప్పుడొస్తుందా?' అని గేటువైపే చూస్తున్నారు. కామాక్షి వచ్చింది కళ్లు తుడుచుకుంటూ—ముగ్గురూ దాని చుట్టూ చేరారు, బెల్లంచుట్టూ ఈగలు చేరినట్లు 'ఏం జరిగింది?' అంటూ. అది కాసేపు మాట్లాడకుండా నిట్టూర్పు విడుస్తూ, తన చక్రాల్లాంటి కళ్లు దీనంగా అటూ, ఇటూ తిప్పుతూ, పిండి రుబ్బడానికి కూచుంది.

వూరెళ్లి, అక్కడ ఓ యేడాదుండి, జబ్బు నయం చేయించుకొస్తా నంటున్నాడని. తను రెండువందల రూపాయలు ఎక్కణ్ణుంచి తెచ్చేదని బాధపడుతూ కళ్ల నీళ్లు పెట్టుకుంది కామాక్షి.

నాగప్ప, రెడ్డి, వంటవాడూ, ఒకళ్ల ముఖం ఒకళ్లు చూసుకున్నారు. మరుక్షణం కామాక్షి కన్నీరుచూసి, కరిగిపోతూ, వేడి నిట్టూర్పులోనే ఓదార్చారు.

'వాడు బుద్ధిలేనివాడు. లేకపోతే పెళ్లాన్నంత డబ్బుతెమ్మని అడుగుతాడా? ఎట్లా తెస్తుందాడది?' అన్నాడు రెడ్డి ఆలోచనపడి...

'వాడు తీరాడబ్బిచ్చింతర్వాత, పోకపోతే?' అంటూ సందేహం వెలిబుచ్చాడు వంటవాడు.



'ఏం జరిగింది కామాక్షీ! వాడు ఆస్పత్రికి పోతానన్నాడా! లేదా?' అని అడిగాడు రెడ్డి—కామాక్షి కెదురుగా గడపమీద కూచుంటూ.

కామాక్షి తలతిప్పింది. 'అడెక్కడ పోతాడు పాపం. కామాక్షిని తిప్పలుపెట్టడానికే వాడు కంకణం కట్టుకున్నాడు' అన్నాడు తనుడు మూటమీద కూచుంటూ నాగప్ప.

'అయ్యగారోచెప్పి వాణ్ణి కాళ్లూ చేతులూ కట్టి బలవంతంగానైనా ఆస్పత్రిలో పడేయించాలి.' అన్నాడు వంటవాడు తలుపుకు ఆనుకుని నిలబడుతూ—

'అయితే యింతకీ వాడేమంటాడు కామాక్షీ' అన్నాడు రెడ్డి విసుగుతో.

రెండొందల రూపాయిలిస్తే తనేదో

'వాడెక్కడికీ వెళ్లడు, కామాక్షినొదిలి. ఆడబ్బెట్టి కొన్నిరోజులు తాగి, తందనాలాడి మళ్లీ వస్తాడు. లాభం లేదు.' అన్నాడు నాగప్ప చప్పరిస్తూ.

'అట్టా రాడు... రానని చెప్పాడు... వచ్చినా, నేని తావిడిచిపెట్ట రానని చెప్పేశాను. పత్రంకూడా రాసిమ్మన్నాడు...'నాకు మొగుడు అవసరంలేదు' అని రాసిస్తానన్నా' అన్నది కామాక్షి కళ్లు దించుకుని...

ఆ మాటతో వంటవాడూ, రెడ్డీ, నాగప్పా సంతోషపడిపోతూ, కామాక్షి కష్టాలు గట్టెక్కాయని గంతులేశారు. పోతే పోయాయి రెండొందలు. అత్తో కొంతా డబ్బు

వేసుకుని కామాక్షి కెలాగైనా సాయం చేయాలని తీర్మానించుకున్నారు.

మర్నాడే కామాక్షి మొగుడూరికెళ్లాడు. నాలుగురోజుల తర్వాత కామాక్షికి టెలిగ్రాం వచ్చింది. దాని మొగుడు వార్నీషు తాగి, ఆస్పత్రిలో పడున్నాడని తక్షణం కామాక్షిని బయలుదేరి రమ్మని.

టెలిగ్రాం చూసిన కామాక్షి కంట తడిపెడ్తూ తను వెళ్లడానికి చేతులో డబ్బులేదనీ, కట్టుకున్న మొగుడావిధంగా ఆస్పత్రిలో పడుంటే తను వెళ్లకపోతే లోకం ఆడిపోసుకుంటుందనీ, లోకం కోసమైనా తను వెళ్లక తప్పదనీ... మా అత్తగారి కాళ్లమీద పడింది. మళ్లీ రెండు రోజుల్లో తిరిగొచ్చే కండిషన్ మీద దాని జీతంలో అడ్వాన్సు యిచ్చారు మా అత్తగారు. మా అత్తగారిచ్చిన అడ్వాన్సుతో బాటు కట్టుకోడానికి చీరలు లేవని వాదగ్గర ఒకచీర తీసుకుంది.

కామాక్షి ప్రయాణం అవుతుందనగానే రెడ్డి, నాగప్ప, వంటవాడూ, కామాక్షి చుట్టూ చేరారు. మొగుడు దగ్గరకు వెళ్లవద్దనీ, దూరంనుంచే చూసేసి రమ్మనమని మరీ మరీ చెప్పారు. ఆ రోజే తీసు

## కామాక్షి కథ

కున్న జీతాల్లోంచి వాళ్లిచ్చిన వందరూపాయలూ తీసుకుని, వేలూర్లో ఉన్న మొగుణ్ణి చూసొస్తానని వెళ్లింది కామాక్షి.

వారం రోజులైంది...పదిరోజులైంది ... పదిహేను రోజులైంది. కామాక్షి జాడే లేదు. రెడ్డికీ, నాగప్పకీ వంటవాడికీ రోజు రోజుకీ గాభరా ఎక్కువైపోయింది. 'కామాక్షి ఏమైపోయిందో అని' వాళ్లు ముగ్గురూ లోలోపల దిగులుపడి పోయారు. కామాక్షి కోసం ఎదురు చూసి, చూసీ మాయింట్లో అందరి కళ్లూ కాయలు కాచాయి.

ఒకరోజు మా పాలవాణ్ణి అడిగింది మా అత్తగారు 'కామాక్షి ఊర్నుంచి ఎప్పుడొస్తుంది ?' అని. కామాక్షి మా పాలవాడింటి పక్కనే ఉండేది. పాలవాడు చెప్పాడు కామాక్షి ఊర్నించి రావడమేమిటి? ఊర్లోనే ఉందని, దానిమొగుడూ ఊర్లోనే ఉన్నాడని, కామాక్షి వేరే ఎక్కడో పని చేస్తోందనీ, చెప్తూ, ఇలా నాటకం ఆడ్డం వాళ్లిద్దరికీ అలవాటేనని చెప్పాడు. వాళ్లిద్దరూ అసలు భార్యాభర్తలు కారనీ, ఇలా చాలచోట్ల మోసంచేసి, కామాక్షి చాల డబ్బు సంపాయించిందనీ కూడ చెప్పాడు.

ఆ మాట విన్న మా అత్తగారు 'హారా! హారా! ఎంత జాణ! ఎంత జాణ!' అంటూ ఇచ్చిన అడ్వాన్సు డబ్బు తల్చుకుని గుండెలు బాదుకున్నారు.

ఈ మాట విన్న రెడ్డి, నాగప్ప, వంటవాడూ ఒకరి తలలు ఒకరు పట్టుకుని కుప్ప కూలిపోయారు...కాస్త కూస్త డబ్బు కాదు వాళ్లు కామాక్షి కిచ్చింది కొన్ని వందలు...దొంగకు తేలుకుట్టినట్లు బాధ పడ్తున్న ఆ ముగ్గురికీ మూలిగే నక్క మీద తాటికాయ పడ్డట్టు మా అత్తగారు ఒక కఠినశిక్ష విధించారు. కామాక్షికి చూపించిన సానుభూతికి బదులుగా వెంటనే వేరే మంచి పనిమనిషి దొరికేదాకా కామాక్షి చేసిన పనంతా వాళ్లనే చేయమన్నారు.

కొత్త పనిమనిషి ఎప్పుడొస్తుందా అని వేయికళ్లతో ఎదురు చూడటం మొదలెట్టారు. రెడ్డి, నాగప్ప వంటవాడూ... వెనకా ముందూ జంఝాటం లేని తల నెరిసిన పనిమనిషి కోసం మా అత్తగారు ఎదురుచూస్తూ కూచున్నారు. ●




**వి. ఎమ్. ఆర్, హైద్రాబాదు**

ప్రశ్నావళి శీర్షికలో భర్గపూరునుండి తెలుగుతల్లి అనే లిఖిత మాసపత్రిక వెలువడుతున్నట్టు చదివాను. దయచేసి ఆ పత్రిక చిరునామా తెలియచేస్తారా?

నేనూ ఆ చిరునామా మరిచిపోయాను బ్రదర్, ఈ లేఖ చూస్తే వారు వ్రాస్తారులే. అప్పుడు చెప్తాను.

**డి. బి. వి. ఎస్, శివమొగ్గ**

ఏమండోయ్ రామలక్ష్మిగారూ మీ హాస్యాస్పదమైన కాదు కాదు హాస్యపూరితమైన ఉత్తరాలను చూస్తే మీ బుర్ర ఇండియన్ మేక్ కాదని మా అనుమానం మీరేమంటారు?

బొత్తిగా ఇండియన్ మేకు బ్రదర్...కోటనం టార్ నల్లమట్టిలో ఆధునిక రసాయనిక ఎరువులు కలిపినట్టుంది. అందుకే కొంచెం మెదడుకి పదును జాస్తి. ఏమంటారు?

**కె. వి. ఎస్, అనంతపురం**

ఎలాంటివాళ్లని నమ్మకూడదు?

ఒక్క క్షణం చూసి పోదామని వచ్చాను.
నన్ను గురించి ఎవరేమనుకున్నా లెక్కలేదు.
ఇలాంటిది నా జీవితంలో చూడలేదు.
ఏమయ్యేట్లా? నాకు తెలియనే లేదు సుమా!
నాకు సలహాలివ్వడం ఇష్టముండదు. అయినా నీ స్థానంలో నేనుంటేనా..
వారం కిందట, కనీసం నిన్ననేనా అడిగి ఉండవలసిందోయ్ ఈరోజు నయాపైసా కూడా లేదు....అనే వాళ్ల నెవరినీ నమ్మకూడదు సుబ్బారావుగారూ!

**పి. ఆర్. ఆర్, ఉండ్రాజవరం**

నిజంగా ఈ ప్రపంచం అంతా అభివృద్ధి వైపే నడుస్తూందంటారా?

అభివృద్ధి అన్న మాటకి వీరే నిర్వచనం ఇస్తున్నారో తెలియదుగాని—అంతా అటువైపే తప్పటడుగులు వేస్తున్నారు.

**ఎమ్. కె. ఆర్, బాపట్ల**

...మర్యాదగా ఆహ్వానిస్తే తాగివచ్చి అభాసుచేశాడా పెద్దమనిషి.

సారాయి తాగుట సభకు యోగ్యత కాదని తెలియని కుసంస్కారి. ఏం చేస్తాం?

**డి. డి, రాజమండ్రి**

ఒకటి అమరగానే ఇంకోటి కావాలని పిస్తుంది ఈ కోరికలకి అంతుండదా?

మనసు కోరే కోర్కెలకి అంతేమిటి? భోగవాంఛ వివేకంవల్ల తగ్గాలేగాని..'భోగింప భోగేచ్ఛ పోవనేరదెపుడు.'

**ఎస్. ఎమ్, హైదరాబాదు**

'గాయాలూ—గేయాలు' పుస్తకం నా దగ్గిర వుంది. దాని తరువాత మరేమైనా కవితల పుస్తకం ప్రచురించారా?

ఆ, రెండుమూడు సంకలనాలు వచ్చాయి.

శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి చిన్నకథలు మీరు చదివేవుంటారు. ఆయన శైలిలో మళ్లీ ఎవరూ రాస్తున్నట్టు లేదు.

ఎవరూ రాయలేరని నా నమ్మకం. మనుషుల నడవడి ఆయన గమనించినంత నిశితంగా ఎవరూ గమనించరు. అది ఆయనకే చెల్లు.

**కె. వి. ఆర్, నేలకొండపల్లి**

సిగరెట్లు అలవాటైతే ఎలా మానాలి?

ఒక్కసారి మానేయడమే. ఇంకే ఇతర చిట్కాలూ ఫలితాలివ్వవు.

**జి. వై. ఎ. ఆర్, రెడ్డి పోలవరం**

అశాశ్వతమైన ఈ దేహంపై మనకెందుకింత మమకారం?

అందాకా మనది కదా? అందుకు!

ఆత్మ నిగ్రహం ఏర్పరచుకోవడం ఎలా?

మనసు గుర్రాల కళ్లెం సడల్చక పోవడమే.

**ఎస్. ఎస్. ఆర్, విశాఖపట్నం**

పుట్టుకకు అర్థం ఏమిటి?

చావుకి నాంది!

**బి. వి. ఎస్. ముక్కాలి (యు. పి.)**

నేను స్కూలుకి వెడుతూంటే అబ్బాయిలు నన్ను అదోలాగు చూస్తారు. కొందరు నన్ను వెంబడిస్తారు. హీరోలాగు పోజు లిస్తూంటారు. వారికెలా బుద్ధి చెప్పేది?

వారికేసి చూడకు చెల్లెలా—నువ్వు చూస్తే కదా ఇవన్నీ కనబడుతున్నాయి! హైస్కూలుకే ఇంతటి హీరోయిన్‌వి. అయితే ఇంక కాలేజీకి వెడితే—భయంగా కూడా ఉంది.

**ఎస్. వి. ఎస్, కావలి**

అక్కయ్యా పాపం ఎక్కువ అయినప్పుడు విష్ణుమూర్తి అవతారం ఎత్తుతాడని పురాణాలు చెప్తున్నాయి కదా? మరిప్పుడు అవతారం ఎత్తాడంటారా?

ఎత్తే ఉంటాడు బ్రదర్, ఎటొచ్చీ బయటికి రావడానికి భయపడుతున్నట్టుంది—ఏ ముఠాతో చేరవలసి వస్తుందో నని!

**ఎం. జి. ఎస్. పాతపిల్లి గిరి**

నండూరిగారి 'ఎంకి'ని శ్రీ శ్రీగారి మహా ప్రస్థానంలోని మరో ప్రపంచానికి లేవదీసుకువెళ్లి అక్కడ లవ్‌సీనులోహాయిగా ఆరుద్రగారి ఊర్వశియొట్టు పాట పాడినట్టు ఒకనాటి మధ్యాహ్నపు నిదరలో విచిత్రమైన కలగన్నాను సుమండీ, మీరు నమ్మకలరా.

నమ్మకేం నిక్షేపంగా నమ్మేను. అప్పుడే తెలివొచ్చేసినందుకు సంతోషించండి. లేకుంటే ఏ రమణారెడ్డి గారి 'అడివి' లోనో పడిపోతే—విశ్వనాథ వారి 'దిండు కింద పోకచెక్క' ఎదురౌను. అప్పుడది విచిత్ర కల కాక సంహాస్వప్నంగా తయారయ్యేది బ్రదర్.

**పి. జి. ఆర్, వైజాగ్**

నేను కొద్దిరోజులలో ఒకామెను వివాహం చేసుకుందామని అనుకుంటున్నాను. ఆమె అందవతియే. కాని గుణవతి అవునో కాదో తెలియదు. పోనీ లోకంపోకడ తెలుసుకుందాం అంటే ఆమెది గుంటూరు. నాకక్కడ తెలిసినవారెవరూ లేరు...తరుణోపాయం తెలియక సతమతమౌతున్నాను. దయచేసి తరుణోపాయం ప్రసాదించ వలసిందిగా కోరుతున్నాను.

పెద్దచిక్కే వచ్చింది తమ్ముడూ, 'అందవతి' అయిన ఆమె 'గుణవతి' అని ఎలా నిరూపించుకుంటుంది? నువ్వు నమ్మాలేగాని లోకులు పలుకాకులు. వారేదో చెప్తే అది విని నమ్మడానికి సిద్ధంగాఉన్న నీకు ఆమె మంచిదని తోచినా నీవు పట్టాన నమ్మలేవు...అది నీమనసును పట్టిన వ్యాధి.

**జి. ఎస్. కె, కొత్తవలస**

సెక్సు! సెక్సు సెక్సు. ఎక్కడ చూసినా ఇదే సినిమాలలో ఇదే. బజారులో పుస్తకాలన్నీ ఇవే. కాలేజీలలో అమ్మాయిలు సెక్సీగా తయారవుతున్నారు. దీనికి ఎవరెంత వరకు బాధ్యులు? ప్రభుత్వం తగిన చర్య తీసుకోక ఎందుకు వెనుకంజ వేస్తున్నది?

బాగుంది. నేషనల్ యూనిఫారం అంటూ ఒకటి ప్రతిపాదింవమంటారా ఏమిటి? అహా, మగా తేడా తెలియకుండా!




కనకలేఖ వెడలగొట్టిన తర్వాత శక్తిదేవునికి ఏమైనాసరే కనకపురిని చూచిరావాలనే పట్టుదల కలిగింది. దక్షిణ దిక్కుకు బయలుదేరాడు. దారిలో తాలహింతాళాది వృక్షాలతో మహాభీకరమైన వింధ్యారణ్యం వచ్చింది.

ఆ వింధ్యారణ్యంలో ఒక తపోవనం కనిపించింది. అక్కడికి వెళ్లి విశ్రాంతి తీసుకున్నాడు, అలసట తగ్గింది. ఆ ఆశ్రమవాసి సూర్యతపసుడనే ముని. అతడు శక్తి దేవునికి అతిథి సత్కారం చేసి, "ఎవడివి? ఎక్కడి వాడివి? ఎక్కడికి బయలుదేరావు?" అని ప్రశ్నించాడు.

"తాపసోత్తమా, నేను కనకపురికి వెళ్లుతున్నాను. అది ఎక్కడవుందో తెలియదు. అదెక్కడ?" అని శక్తిదేవుడు ఆ తపసినే ప్రశ్నించాడు. ముని నవ్వి "కనకపురికి వెళ్లుతున్నానని అంటున్నావు. వూరు ఎక్కడో తెలియదని అంటున్నావు. ఈ ఆశ విచిత్రంగా వుంది. నేను చిరాయువును. అయినా, ఆ వూరి పేరే వినలేదు. అయితే, ఒక్కటి మాత్రం చేయగలను. కాంపిల్య నగరంలో దీర్ఘతపసుడనే ముని వున్నాడు. ఆయన నా సోదరుడు. అతనికి ఆ పట్టణం సంగతి తెలుసుననుకుంటాను. అతనికి తెలియకపోతే మరెవరికీ తెలియదు" అన్నాడు.

శక్తిదేవుడు సూర్య తపసుని మాట ప్రకారం కాంపిల్య నగరానికి వెళ్లాడు. అక్కడ మునిసత్తముడైన దీర్ఘతపసుని దర్శించుకొన్నాడు. కనకపురిని గురించి అతనిని అడిగాడు. ఆ పట్టణం సంగతి తనకు తెలియదని ఆ తపసి కూడా అన్నాడు. కాని, ఆ ముని అతనికి మరొకరి పేరు సూచించాడు: "నాయనా, సముద్రంలో ఉత్పల ద్వీపమనే ద్వీపం వుంది. ఆ ద్వీపంలో ఒక సెంబడివారి దొర— దాశరాజు— ఉన్నాడు. అతని పేరు సత్యవ్రతుడు. అతడు నాకన్నా కడు వృద్ధుడు. అతనికి ఆ వూరు తెలిసి వుంటుందను కుంటాను." అన్నాడు.

శక్తిదేవుడు దీర్ఘతపసుని మాట విన్నాడు. వెంటనే దృఢనిశ్చయంతో ఉత్పల ద్వీపానికి పయనమయ్యాడు. దారిలో అతనికి మరొక ద్వీపానికి వెళ్లే కుబేరుని వంటి ఒక బేహారితో చెలిమి కలిగింది. అతని పేరు సముద్ర మత్స్యుడు. శక్తిదేవుడు అతనితో స్నేహం కలిపి, అతని వోడతో ఉత్పల ద్వీపానికి బయలుదేర దలచాడు. అందరూ సముద్రం చేరారు.

శక్తిదేవుడు ఆ పయోరాశిని చూచి ఆశ్చర్యపడ్డాడు. సముద్రం లోతైన సుడిగుండాలతో భయంకరంగా వుంది. స్ఫటికపు ముద్దల వంటి నురగలతోపాటు తరగలు స్తంభాల వంటి ఉత్తుంగ తరంగాలు పైకి లేచి ఆకాశాన్నే దాటివేసినట్టు కనిపించింది. అప్పుడు, అది స్ఫటిక స్తంభాలు వేసి, ఆకాశమునకు బ్రహ్మాండంలాగా కనిపించింది. శివుడు తాండవం చేయకనే ఒక వైపు వాత్యా సమూహానికి తరగలనే చేతులు పూగిసలాడుతున్నాయి. మేఘాల ఉరుములు మద్దెలల ధ్వనులలాగ వినపడు తున్నాయి. అంతటా మేఘాలు మూగాయి. ఆ దృశ్యం ఎలా వుందంటే, సముద్రం తమ కొలము వాడైన మైనాకుణ్ని రక్షించినందుకు కృతజ్ఞతతో పర్వతాలు సముద్రం మీదికి వాలి, దానికి సేవ చేస్తున్నవా అన్నట్టుంది. సంసారం లాగా పారం లేనిదిగాను, సహించరాని ఆయాసం వంటిదిగాను, అనంతమయిన మాయాజాలం పరచినట్టుగాను, పొగరుపోతు, మూర్ఖుడు అయిన దుర్జనుడు ఎలా మిడిసిపడుతాడో ఆవిధంగాను, ఉన్నది సముద్రం.

శక్తిదేవుడు సముద్ర మత్స్య వణిక్కుతో పాటు వోడ ఎక్కాడు. దిక్కులు కలయజూశాడు. దిక్కులన్నీ విశాలమయిన తరగల దుకూలం కప్పుకున్నట్టు కనిపించింది.

ఓడ పయనిస్తూ వుంది. ఇలా వుండగా, వ్యోమలక్ష్మి ముఖంమీది కాలాగురు తిలకంలాగ ఒకచోట మేఘం పొడసూపింది. అది తమాలంలాగ మరి నమై, పిల్లి పంది రూపంతో నల్లగా విస్తరించింది. అది దుర్జనుని వ్యసనంలాగ వెంటవెంటనే వృద్ధి పొందింది. అది మరింత తీవ్రంగా వ్యాపించి, అజ్ఞానం మానవుని జ్ఞానాన్ని తొలగించి అంధుణ్ని

చేసినట్లై లోకాన్ని అంధకారమయం చేసింది. ఎక్కడా కనులు పొడుచుకున్నా వెలుతురు కని పించక పోయింది. వర్షం ఆరంభ మయింది. దానికి తోడు సుడిగాలి పుట్టింది. సుడిగాలి మితిమీరి పోయి ఆకాశం సముద్రంగాను, సముద్రం ఆకాశం గాను ఒకదాని కొకటి కొట్టుకొని అశేషదిక్కు లనే పగుల గొడుతాయా అన్నట్టు అనిపించింది. అప్పుడు ప్రళయకాలంలో తిరిగే పుష్కరా వర్తక మేఘాల ధ్వని వినబడి గుండె గుభేలు మన్నది.

ఆ తరగల తాకిడికి, ఆ గాలికి, ఆ మేఘాల ధ్వనికి, నౌక అన్ని కట్లు తెంపుకొని ఫెఢీమని విరిగింది. వ్యాపారస్థుల మనస్సులూ దానితో పాటే విరిగాయి. నౌక విరిగి సముద్రంలో మునిగి పోయింది. శక్తిదేవుడిని ఒక మహాకాయమైన మత్స్యం మింగివేసింది. సముద్ర మత్స్య వశి క్కైమో విరిగిన తన వోడ పలక గొకదానిని పట్టుకొని ప్రాణాలు దక్కించుకున్నాడు.

శక్తిదేవుని మింగిన పెద్ద చేపను ఉత్పల ద్వీపపు సెంబడివారు ఉచ్చులు వేసి పట్టుకున్నారు. తమ రాజు సత్యవ్రతుని వద్దకు తీసుకొని పోయారు. అతని ఆజ్ఞ మీద దానిని అతని ఎదటే చీల్చారు. దాని నుంచి శక్తిదేవుడు ప్రాణాలతో బయటపడ్డాడు. విధి గతి ఎవరెరుగుదురు? శక్తి దేవునికి ఘోరమైన అంధకారం నుంచి వెలు పలికి వచ్చినట్లయింది.

దాశరాజు సత్యవ్రతుడు విస్మయపడి, "నీవు ఎవరు? ఏమిటి ఈ విపరీతం?" అని ప్రశ్నించాడు.

శక్తిదేవుడు ఇలా సమాధానం చెప్పాడు:— "సెంబడి రాజా, కనకపురి అనే పట్టణాన్ని చూడ డానికి ప్రపంచమంతా గాలిస్తున్నాను. తిరుగుతూ తిరుగుతూ దీర్ఘతపసుడనే ఋషివద్దకు వచ్చాను. 'నాయనా, దానిని నేను చూడలేదు, వినలేదు. దాశరాజు సత్యవ్రతుడనే వాడున్నాడు. ఆయనను అడుగు—' అన్నాడు. ఆయన మాటమీదనే నేను సముద్ర తీరం చేరాను. ఒక వణిక్కు స్నేహంతో వోడ ఎక్కి ప్రయాణం చేశాను. వోడ పగిలి పోయింది. నన్ను జలజంతువేదో మింగింది. దైవ వశాత్తు ఈ అద్భుత భూమికి వచ్చాను. ఇదంతా కర్మబంధం. మరొకటి ఎలా అవుతుంది?"

సత్యవ్రతుడు అతని మాటలు విని మరింత ఆశ్చర్య కుతూహలాలతో నిండిపోయాడు. "నేనే సత్యవ్రతుణ్ణి. ఇదే ఉత్పల ద్వీపం. నేను గూడ ఆ పట్టణం చూడలేదు. సంతృప్తిగా విశ్రాంతి తీసుకో. ఆ నగరం ఎక్కడ వుందో ప్రయత్నించి వెదికించి చెబుతాను." అని అన్నాడు. శక్తిదేవుడు, ఆ రాత్రికి ఆ ద్వీపంలోని ఒక బ్రాహ్మణుని ఆశ్రమంలో గడిపాడు.

అట్లే కొన్నాళ్లు గడిచాయి. ఆ ద్వీపంలో విష్ణుదత్తుడనే బ్రాహ్మణు డున్నాడు. అతడు కాకతాళీయంగా ఒకమారు శక్తిదేవుని కలుసు కున్నాడు. ఉభయకుశలోపరి ప్రసంగవశాత్తు శక్తిదేవుడు తన వృత్తాంతం విష్ణుదత్తునికి తెలి పాడు. విష్ణుదత్తుడు మరెవడో కాడు. శక్తిదేవుని మేనమామ కుమారుడు. చిన్ననాడే స్వదేశం వదలి ఉత్పల ద్వీపం చేరాడు. అతడు తన మేనమామ కుమారుడని తెలియగానే శక్తిదేవునికి కూడా సంతో షమయింది. "బంధు సమాగమం కాకతాళీయంగా జరిగింది" అని విష్ణుదత్తుడు అన్నాడు. తర్వాత అతని సంగతి విన్నాడు. ఇద్దరూ ఆ రాత్రి ఆ ఆశ్ర మంలో గడిపారు. నిద్ర లేకుండా, అలసటతో బాధపడుతున్న శక్తిదేవుణ్ణి వూరడించడానికి ఒక కథ చెప్పాడు, విష్ణుదత్తుడు:—

పూర్వం యమునా తీరంలోని ఒక పట్టణంలో గోవిందస్వామి అనే బ్రాహ్మణు డుండేవాడు. అతనికి విజయదత్తుడు, అశోకదత్తుడు అనే ఇద్దరు కుమాళ్లు వుండేవారు. వారి పట్టణంలో ఒకమారు దుర్భిక్షం ఏర్పడింది. అందువల్ల గోవిందస్వామి తన కుమారులతో పాటు, భార్యతోపాటు కాశీనగ రానికి వలస పోయాడు. దారిలో అతడు ప్రయాగ చేరాడు. అక్కడ పుణ్యప్రదమైన మహా వటవృక్షం చూచాడు.

ఆ మహావటవృక్షం కింద ఒక కపాల మాలలు ధరించిన ఒక వ్రతి కనిపించాడు. గోవిందస్వామి అతనికి సకుటుంబంగా నమస్కరించి, తన భవి ష్యత్తు ఏమిటని వినయంగా పృచ్ఛ చేశాడు. ఆ వ్రతి తన దివ్యదృష్టితో చూచాడు. "నాయనా నీకు విజయదత్తునితో వియోగం కలుగుతుంది. తర్వాత మళ్లీ కలుసు కొంటారు." అన్నాడు.

గోవిందస్వామి అక్కడి నుంచి కదలి కాశీకి బయలుదేరాడు. చీకటిపడింది. దారిలో ఒక పాడు పడిన దేవాలయం కనిపించింది. గోవిందస్వామి తన భార్యాపుత్రులతో ఆ దేవాలయంలో విశ్ర మించాడు. దూరప్రయాణంతో మొదట్లోనే అలసి వున్నారు. కనుక గోవిందస్వామికి, అతని భార్యకు, అశోకదత్తునికి వెంటనే నిద్రపట్టింది. నిద్ర సర్వదుఃఖాలు, సర్వ శ్రమలు పోగొట్టడంలో పరాకాష్ఠ వంటిది కదూ మరి!

విజయదత్తునికి నిద్ర పట్టలేదు. చలిజ్వరం ముంచుకు వచ్చింది. నీటిలోని చేపలాగ వళ్లు కది లిస్తూ, చలికి వూగిసలాడి పోయాడు. తండ్రి మేల్కొని, అతనిని ప్రేమతోను, యత్నంతోను గట్టిగా కౌగలించుకొని పడుకున్నాడు. కాని, చలి తగ్గలేదు. దుర్జనుడు యధార్థాన్ని వదలనట్టుగా, చలి అతనిని వదల లేదు.

అప్పుడు, విజయదత్తుడు "తండ్రీ, చలి భరించలేక పోతున్నాను. నిప్పు నెగడు వేస్తే చలి తగ్గుతుంది" అని దీనంగా కోరాడు. "నాయనా, ఇక్కడ నిప్పు మంట లెక్కడ తేగలము?" అని తండ్రి విచారం ప్రకటించాడు. "తండ్రీ, అక్కడ మంటలు కనిపిస్తున్నాయి." అని కుమా రుడు దూరంగా వెలిగే మంటలు చూపాడు.

గోవిందస్వామి అతనిని ఆ మంటల వైపు మోసు కొని పోయాడు, కాని, ఆ మంటలు దూరంనుంచి చితి మంటలని అతడు గ్రహించాడు. "నాయనా! అవి భయం కలిగించే చితి మంటలు. వాటిని తాకరాదు. అమంగళకరమయినవి. వానిని సేవించ రాదు" అని కుమారుడికి నచ్చచెప్పాడు. కాని కుమారుని పళ్లు చలికి వీణలాగ మోగిపోతున్నాయి, ఒళ్లంతా గగుర్పొడిచింది. శీత జ్వరం ముమ్మర మయింది. అందువల్ల అతడు మంటల వద్దకు వెళ్లుదామని మరీ మరీ తండ్రిని ప్రాధేయపడ్డాడు. కొడుకు మీది ప్రేమతో గోవిందస్వామి సొద నిప్పు తీసుకు రావడానికి శ్మశానానికి వెళ్లాడు. కుమారుడు గూడ అతని వెంట వడివడిగా వెళ్లాడు.

చితి మండు తున్నది. చితిలో ఎముకలు చిందర వందరగా పడి వున్నాయి. విజయదత్తుడు సొద దగ్గరికి వెళ్లి, దానిని కౌగలించుకొంటున్నట్టుగా దానిపై వంగాడు. అతనికి నెమ్మదిగా చలి తగ్గింది.

చలి కాచుకొంటున్నప్పుడు విజయదత్తునికి చితిలో ఏదో గుండ్రని వస్తువు కనిపించింది.

"తండ్రీ, ఎదుట ఆ నిప్పులో ఎర్రగా కమ లంలాగ కనిపిస్తున్నదే అదేమిటి? గుండ్రంగా వుందే?" అని ప్రశ్నించాడు. "నాయనా అది మనిషి పుర్రె" అని తండ్రి సమాధానం చెప్పాడు.

ఆ మాటలు విని ద్విజకుమారుడు, ఒక కర్ర తీసుకొని, దానిని బాదాడు. ఆ దెబ్బకు ఆకపాలం పగిలి, దానిలోని వస అతని ముఖం మీద చిట్లింది. దాని నతడు నాలుకతో చప్పరించాడు. రుచికరంగా కనిపించింది. వెంటనే, చితి మీదికి ఎగబడి, ఆ కపా లాన్ని తీసుకుని వసను తాగివేశాడు.

వెంటనే, ఆ బాలుడు మహాకాయుడుగా పెరిగి పోయాడు. అతిభయంకర స్వరూపుడయ్యాడు. పైకి కోరలు వెలువడ్డాయి. చివరకు రాక్షసుడుగా అయి, అట్టహాసం చేశాడు. ఆ అట్టహాసానికి దిక్కులు పగిలిపోయినట్లుగా ప్రతిధ్వనించాయి.

తండ్రి విస్తుపోయి చూస్తుండగా, ఆ రాక్షస స్వరూపుడైన విజయదత్తుడు హఠాత్తుగా తండ్రినే ముందుకు లాక్కొని చంపబోయాడు. అప్పుడు ఆకాశం నుంచి "స్వామీ, కపాలస్ఫోటా, అలాటి సాహసం చేయవద్దు." అని వాణి విని పించింది. అంతలో కొందరు రాక్షసులూ అక్కడ కనిపించారు. ఆ రాక్షసులు అతనిని కపాలస్ఫోటుడని సంబోధించ సాగినారు. కపాలస్ఫోటుడు తండ్రిని వదలి ఆ రాక్షసుల వెంట తొందరగా గగనమార్గంలో ఎక్కడికో వెళ్లిపోయాడు.

గోవిందస్వామి పుత్ర వియోగంతో శోభిస్తూ పాడు దేవాలయానికి తిరిగివెళ్లాడు. పుత్ర వియోగం అతనిని దహించి వేయసాగింది. అతని భార్య, సోదరుడు, ఈ వార్త విని గుండెపగిలేట్టు గట్టిగా విలపించారు. వారి శోకాలు విని ఉదయం జనం మూగారు. వారి మనస్సు కూడా కరిగింది. ఆ జనంలో సముద్రదత్తుడనే వ్యాపారి వున్నాడు. అతడు దయాంతరంగుడు. అతడు గోవిందస్వామిని ఊరట పరచి తన యింటికి పిలుచుకొని వెళ్లి, తన ధనానికి కూడా అతనిని అధికారిగా చేశాడు.

గోవిందస్వామి వటవృక్షం కింది మహావ్రతి చెప్పిన మాటలు స్మరిస్తూ, ఎప్పటికైనా తనకు కుమారునితో సమాగమం జరుగుతుందనే ఆశతో, ఎన్నో మనోరథాలు మనసులో ముప్పిరి గొనగా, ఆ వర్తకుని ఇంట్లోనే వున్నాడు.

(ఇంకా ఉంది)

# మీరు పుట్టిన ఇంగ్లీషు తేదీని అనుసరించి మీ స్వభావం? మీ మిత్రులు?

## ధనుస్సు

ఇది రాసులలో తొమ్మిదవది. ప్రతి సంవత్సరం నవంబరు 22 వ తేదీ నుంచి డిశంబరు 21వ తేదీ వరకు సాయన సూర్యుడు ధనూరాశి యందు ఉంటాడు కాబట్టి యీ తేదీల మధ్యను జన్మించిన వారు ధనూరాశి యందు పుట్టినవారుగా పరిగణింపబడుతున్నారు. ఏ సంవత్సరంలోనైనా సరే యీ తేదీల మధ్యను జన్మించినవారికి ధనూరాశి ఫలితాలే వర్తిస్తాయి. దీనికి జననకాలంతోగాని జన్మనక్షత్రంతోగాని నిమిత్తం లేదు.

రాశి ప్రారంభంలో అనగా నవంబరు 22—25 తేదీల మధ్యను జన్మించినవారి మీద అంతకు ముందు ఉన్న వృశ్చికరాశి ప్రభావం కూడా ఉంటుంది. అలాగే రాశి ఆఖరున అనగా డిశంబరు 18—21 తేదీల మధ్యను జన్మించినవారి మీద రాబోయే మకరరాశి ప్రభావం కూడా ఉంటుంది.

గుర్రపు నడుము వంటి నడుము, చేతిలో ధనుస్సు కల పురుషుడు ధనూరాశిగా పరిగణింప బడుచున్నాడు. ఇది ద్విస్వభావరాశి. అగ్నికి సంబంధించిన రాసులలో యిది మూడవది. దేవగురులైన బృహస్పతి యీరాశికి అధిపతి.

ఈ రాశి యందు పుట్టినవారు సాధారణంగా సాహసము కలవారై ఉంటారు. ఇతరుల మీద అధికారాన్ని చలాయించాలనే వాంఛ వీరికి అధికంగా ఉంటుంది. ఆత్మ విశ్వాసం, పట్టుదలా కూడా వీరికి ఉంటాయి.

భవిష్యత్తులో జరగబోయే విషయాలను వీరు ముందుగానే ఊహించగలరు. వీరికి ఊహాశక్తి అధికంగా ఉంటుంది. కాని దీని వలన ఒక్కొక్కప్పుడు ఆచరణకు ఆటంకాలు కలగవచ్చును. వీరికి వ్యవహారజ్ఞానం ఉంటుంది కాని దాని వలన వీరికి అంతగా ప్రయోజనం ఉండదు గాని వీరి మిత్రులకు అది పూర్తిగా ఉపయోగపడుతుంది.

అందరకూ న్యాయం జరగాలని వీరు వాదిస్తారు. అందుకోసం వీరు తమకంటే పెద్దవారిని కూడా యెదురిస్తారు. ఒక్కొక్కప్పుడు వీరి వాదం వలన చాలా చిక్కులను యెదుర్కోవలసి వస్తుంది.

కొత్త సంగతులను వీరు సులభంగా అర్థం చేసికొనగలరు. వీరు సహజంగా సనాతనవాదులే అయినా, అవసరం వచ్చినప్పుడు సంస్కరణలను అమలు జరపడానికి వెనుదీయరు. అందుచేత సులభంగా వీరు సమాజంలో నాయక స్థానాన్ని ఆక్రమించుకోగలరు.

ప్రయాణాల మీద వీరికి సరదా అధికంగా ఉంటుంది. కొత్త మనుషులను కల్సుకొని కొత్త విషయాలను తెల్సుకోవాలని వీరు కోరుతుంటారు. సాధారణంగా వీరు అందరితోను చనువుగా, మాట్లాడుతుంటారు గాని అకస్మికంగా తీవ్రమైన ధోరణిలోనికి దిగిపోతుంటారు. అందుచేత వీరు యెప్పుడు యెలాగ ప్రవర్తించేదీ చెప్పడం కష్టం.

వీరు విశాలహృదయులు. అందుచేత యితరులు చేసిన తప్పులను సులువుగా మరచిపోగలరు. వీరు యే విషయాన్నైనా సులువుగా అంచనా వేయగలరు. అందుచేత వీరు తమ రంగంలో మిగిలిన వారికంటే ముందంజ వేయగలరు.

### ద్రేక్కాణ ఫలం

ధనూరాశిలో మొదటి ద్రేక్కాణానికి (నవంబరు 22—డిశంబరు) 1 బుధుడు అధిపతి. ఈ సమయంలో పుట్టినవారికి సమయానికి తగిన నిర్ణయం చేసే శక్తి ఉంటుంది. అందుచేత జీవితంలో విజయాన్ని సాధించగలరు. ప్రతివిషయాన్ని గురించి సూక్ష్మంగా ఆలోచించగలరు. కాని ఒక్కొక్కసారి ఆలోచన అధికం కావడం వలన ఆచరణ సన్నగిల్లే ప్రమాదం ఉంది. తరుచుగా వీరు కార్యసాధకులుగా ప్రజల చేత గౌరవింపబడతారు. జీవితంలో తమకు ఒక లక్ష్యం ఉందని వీరి అభిప్రాయం.

రెండవ ద్రేక్కాణానికి (డిశంబరు 2 మొదలు 11) చంద్రుడు అధిపతి. ఈ సమయంలో పుట్టిన వారికి ఊహాశక్తి అధికంగా ఉంటుంది. వీరు ముక్కుకు సూటిగా పోయేవారు కావడం వలన యితరులు చిన్న పొరపాట్లు చేసినా వీరు చికాకు పడతారు. విశ్రాంతి అనేది లేకుండా యెప్పుడూ యేదో ఒక పనిని చేస్తుంటారు. తాము నమ్మిన సిద్ధాంతం కోసం యెటువంటి వారినైనా యెదురించగలరు. ఒక్కొక్కసారి వీరు అపార్థం చేసికొన బడే ప్రమాదం కూడా ఉంది. వీరు తమ స్వంత మార్గాన్ని అనుసరించడం వలన విజయాన్ని సాధించగలరు.

మూడవ ద్రేక్కాణానికి (డిశంబరు 12 మొదలు 21) శని అధిపతి. ఈ సమయంలో పుట్టినవారికి అన్నివిషయాల్లోను స్థిరమైన అభిప్రాయాలు ఉంటాయి. సాధారణంగా వీరు సనాతనవాదులే కాని సంస్కరణలను వ్యతిరేకించరు. వీరు తీవ్రమైన ప్రతిఘటనను యెదుర్కొని జీవితంలో విజయాన్ని సాధించగలరు. వీరు సామాన్యమైన జ్ఞానముతో సంతృప్తిని పొందలేరు. ప్రతి విషయంలోను మూలకారణాన్ని గురించి ఆలోచిస్తుంటారు.

సూచన—మొదట చెప్పబడిన రాశి ఫలితానికి తరువాత చెప్పబడిన ద్రేక్కాణ ఫలితానికి తేడా ఉన్నప్పుడు ద్రేక్కాణ ఫలితాన్నే గమనించాలి. ద్రేక్కాణ ఫలితమే సరిగ్గా సరిపోతున్నట్లు చాలా మంది అభిప్రాయం.

### ధనూరాశియందు జన్మించిన భర్తతో వ్యవహరించడం యెలాగ?

వీరు తమ అభిమానాన్ని మాటల్లో కాకుండా చేతల్లో చూపిస్తుంటారు. అందుచేత వీరి నుండి సాధారణంగా పొగడ్తలను ఆశించకూడదు. వీరికి చాలా తొందరగా కోపం వస్తుంది. కాని అది యెంతసేపో ఉండదు. అందుచేత వీరికి కోపం వచ్చినప్పుడు వాదానికి దిగడం అనవసరం. వీరు చిన్న చిన్న విషయాలను గురించి పట్టించుకొనరు. కాబట్టి అనవసరమైన వివరాలు వీరికి చెపితే విసుగు కలుగుతుంది. వీరు స్వేచ్ఛాప్రియులు అందుచేత వీరి మీద నిబంధనలను ఉంచడం మంచిదికాదు. వీరు సాధారణంగా విశ్వాసపాత్రులై ఉంటారు.

### ధనూరాశియందు జన్మించిన భార్యతో వ్యవహరించడం యెలాగ?

ఈమె అందరితోను కలసిమెలసి ఉంటుంది. కాని ఈమెకు దురుద్దేశం యేమీ ఉండదు. ఈమె కుటుంబానికి సంబంధించిన పనులను కష్టపడి చేస్తుంది. కాని తన మీద యితరులు అధికారాన్ని చలాయించడానికి అంగీకరించలేదు. భర్త తన యజమానిగా కాకుండా స్నేహితునిగా ఉండాలని యీమె కోరుతుంది. సమాజంలో తనకు గౌరవస్థానం ఉండాలని యీమె కోరుతుంది. అందుకు ప్రారంభంగా భర్తయే తనను ముందుగా గౌరవించాలని యీమె అభిప్రాయం. కానుకల కంటే పొగడ్తల మీదనే యీమెకు ఆసక్తి అధికంగా ఉంటుంది.

### ధనూరాశియందు జన్మించినవారికి మిత్రులు యెవరు?

ధనూరాశి యందు జన్మించిన మిత్రులును వీరును ఒకే స్వభావాన్ని కలిగి యుంటారు కాబట్టి వీరి మైత్రి చాలా కాలం ఉంటుంది. వీరి మధ్యను భేదాభిప్రాయాలు ఉండకపోవచ్చును కాని ఒకరు చెప్పిన దానిని యింకొకరు వెంటనే అంగీకరించడం వలన వీరి మైత్రి ఉత్సాహకరంగా ఉండదు.

ధనూరాశి యందు జన్మించిన వారికి మకర రాశి (డిశంబరు 22—జనవరి 20) యందు జన్మించిన వారికి మైత్రి అరుదుగా ఉంటుంది. ధనూరాశివారు సాధారణంగా ఆశావాదులై ఉంటారు. మకరరాశివారు తరుచుగా నిరాశావాదులు. అందుచేత వీరికి తరుచుగా భేదాభిప్రాయాలు వస్తుంటాయి. ధనూరాశివారు వ్యయం యెక్కువగా చేస్తారు. మకరరాశివారు మితవ్యయులు. బలవత్తరమైన కారణాల వలన వీరు మిత్రులు అయినా, వీరి మధ్యను సన్నిహితత్వం తక్కువగానే ఉంటుంది. వీరి మైత్రిలో మకరరాశివారు ఉదారంగా వ్యవహరించడం అవసరం.

ధనూరాశి యందు జన్మించినవారికి, కుంభరాశి (జనవరి 21—ఫిబ్రవరి 19) యందు జన్మించిన వారికి మైత్రి బాగా ఉంటుంది. కుంభరాశివారు

సాధారణంగా ఉదారస్వభావులు. ధనూరాశివారు సాహసప్రియులు. అందుచేత ఒకరినొకరు తరుచగా మెచ్చుకొంటుంటారు. వీరు యిరువురూ హాస్య ప్రియులే. సమాజంలో వీరు యిరువురూ కూడా గౌరవాన్ని సంపాదించగలరు. అందుచేత వీరి మైత్రి చాలాకాలం ఉంటుంది. ధనూరాశి వారివద్ద కంటే కుంభరాశి వారివద్ద వ్యవహారజ్ఞానం అధికంగా ఉంటుంది. కాబట్టి ధనూరాశివారు కుంభ రాశి వారిని అనుసరించడం మంచిది.

ధనూరాశి యందు జన్మించినవారికి, మీనరాశి (ఫిబ్రవరి 20—మార్చి 21) యందు జన్మించిన వారికి మైత్రి చిత్రంగా ఉంటుంది. వీరు ఒకనొకరు తరుచుగా విమర్శిస్తుంటారు కాని సమయానికి ఏకం కాగలరు. మీనరాశివారు ప్రతి వ్యవహారంలోను ప్రయోజనాన్ని కోరుతుంటారు. అది ధనూరాశివారికి నచ్చదు. ధనూరాశివారి సాహస స్వభావం మీనరాశి వారికి సరిపడదు. మీనరాశివారు నిదానంతో వ్యవహరిస్తే వీరి మైత్రి ప్రయోజనకరంగా ఉంటుంది. కారణాంతరాల వలన వీరు విడిపోయినా, ఒకరి మీద ఒకరికి అభిమానం ఉంటుంది.

ధనూరాశి యందు జన్మించినవారికి మేషరాశి (మార్చి 22——ఏప్రిల్ 20) యందు జన్మించిన వారికి మైత్రి బాగా ఉంటుంది. వీరు యిద్దరునూ సాహస స్వభావం కలవారే. కాని మేషరాశి వారివలె ధనూరాశివారు తొందరపడరు. ధనూరాశి వారికి గల పట్టుదల, ఆత్మవిశ్వాసం మేషరాశి వారివద్ద తరుచుగా లోపిస్తాయి. కాబట్టి మేషరాశివారు ధనూరాశి వారి నిర్ణయాలను అమలు జరపడం మంచిది. వీరు యిరువురూ కలిసి ప్రయత్నించిన యెడల కష్టతరమైన పనులు కూడా సాధ్యం కాగలవు. వీరు యిద్దరూ కొంచెం నిగ్రహంతో ప్రవర్తించిన యెడల వీరి మైత్రి ఆదర్శప్రాయం కాగలదు.

ధనూరాశి యందు జన్మించినవారికి వృషభ రాశి (ఏప్రిల్ 21— మే 21) యందు జన్మించిన వారికి మైత్రి చాలా అరుదుగా ఉంటుంది. ధనూరాశివారి సహస స్వభావం వృషభరాశి వారికి సరిపడదు. వృషభరాశివారి భౌతిక వాదం ధనూరాశి వారికి యిష్టపడదు. అందుచేత వీరికి మైత్రి యేర్పడినా, చాలా తరుచుగా భేదాభిప్రాయాలు వస్తుంటాయి. బలవత్తరమైన కారణాల వలన వీరు మిత్రులు అయినా వీరి మైత్రి హృదయ పూర్వకంగా ఉండకపోవచ్చును.

ధనూరాశి యందు జన్మించినవారికి, మిధున రాశి ( మే 22—జూన్ 21) యందు జన్మించిన వారికి మైత్రి బాగా ఉంటుంది. మిధునరాశి వారివద్ద ఆలోచనలు ఉంటాయి. ధనూరాశి వారి వద్ద సాహసం, పట్టుదలా ఉంటాయి. కాబట్టి వీరు యిద్దరూ కలిసి హృదయపూర్వకంగా ప్రయత్నించిన యెడల యెటువంటి పనినైనా సాధించగలరు. వీరి మధ్యను గౌరవపూర్వకమైన మైత్రి ఉంటుంది. వీరు కొంచెం సంయమనంతో ప్రవర్తిస్తే వీరి మైత్రి చాలా ప్రయోజనకరంగా ఉంటుంది.

**ధనూరాశి యందు జన్మించినవారికి, కర్కాటక** రాశి (జూన్ 22—జూలై 22) యందు జన్మించిన వారికి మైత్రి చాలా అరుదుగా ఉంటుంది. వీరి స్వభావాల్లో చాలా భేదం ఉంటుంది. కాని ఆభేదమే ఒక్కొక్కసారి వీరి మధ్యను ఆకర్షణను కలిగించవచ్చును. ధనూరాశివారి సాహసస్వభావం కర్కాటక రాశివారికి నచ్చదు. వీరి మధ్యను ఉండే సంబంధం కేవలం పరిచయంగానే ఉండడం వలన ఉపయోగం ఉంటుంది. వీరి మధ్యను తగాయిదా వస్తే అది చాలా దూరం వెళ్ళగలదు. ధనూరాశివారి మీద కర్కాటక రాశివారు పగబట్టే ప్రమాదం ఉంది.

ధనూరాశి యందు జన్మించినవారికి, సింహరాశి (జూలై 23—అగస్టు 22) యందు జన్మించిన వారికి మైత్రి బాగా ఉంటుంది. వీరి యిరువురి స్వభావాల్లో పోలికలు చాలా ఉంటాయి. వీరి స్నేహం వలన ప్రయోజనం కంటే సరదా అధికంగా ఉంటుంది. వీరు యిరువురూ నాయకత్వాన్నే కోరడం వలన అప్పుడప్పుడు వీరి మధ్యను సంఘర్షణ కలగవచ్చును. కాని దాని వలన వీరి మైత్రికి భంగం ఉండదు. ధనూరాశివారు అప్పుడప్పుడు బాధ్యతారహితంగా ప్రవర్తించడం సింహరాశి వారికి సహించదు. వీరి మధ్యను యేదైనా తగాయిదా వస్తే అది చాలా దూరం వెడుతుంది.

ధనూరాశి యందు జన్మించిన వారికి కన్యారాశి (ఆగస్టు 23—సెప్టెంబరు 22) యందు జన్మించిన వారికి స్నేహం చిత్రంగా ఉంటుంది. వీరు ఒకరికొకరు దగ్గరగా ఉన్నప్పుడు దూరంగా ఉండాలనీ, దూరంగా ఉన్నప్పుడు దగ్గరగా ఉండాలనీ కోరుతంటారు. ధనూరాశివారు నాయకత్వాన్ని కోరుతుంటారు. కన్యారాశివారు ప్రయోజనాన్ని కోరుతుంటారు. కాబట్టి కన్యారాశివారు ధనూరాశి వారిని అనుసరించడం మంచిది. ధనూరాశివారు కూడా కన్యారాశివారి అభిప్రాయాలను గౌరవిస్తారు. వీరి మధ్యను మూడవవారి జోక్యాన్ని సహించకూడదు.

ధనూరాశి యందు జన్మించినవారికి, తులారాశి (సెప్టెంబరు 23—అక్టోబరు 22) యందు జన్మించిన వారికి మైత్రి బాగా ఉంటుంది. వీరు యిరువురూ ప్రతివిషయాన్ని గురించి చర్చిస్తుంటారు. ధనూరాశివారు అన్నివిషయాల్లోను సాహసంతో వ్యవహరిస్తారు. తులారాశివారు ప్రతి విషయాన్ని గురించి బాగా ఆలోచిస్తారు. **అందుచేత వీరి మైత్రి ఉభయ ప్రయోజనకరంగా** ఉంటుంది. వీరిలో ఒకరు మితిమీరి ప్రవర్తిస్తే వీరి మైత్రికి అకస్మికంగా భంగం కలుగుతుంది తరువాత ఒకరికొకరు ప్రబల శత్రువులుగా మారే అవకాశం కూడా ఉంది.

ధనూరాశి యందు జన్మించినవారికి, వృశ్చికరాశి )అక్టోబరు 23—నవంబరు 21) యందు జన్మించిన వారికి మైత్రి అరుదుగా ఉంటుంది. ధనూరాశి వారికి యితరుల మీద అధికారాన్ని చలాయించాలని కోరిక ఉంటుంది. అది వృశ్చికరాశి వారికి నచ్చదు. వృశ్చికరాశివారు ఒక్కొక్కప్పుడు మొండి పట్టుదలతో వ్యవహరిస్తారు. అది ధనూరాశివారికి సహించదు. అందుచేత వీరి మైత్రికి భంగం కలగడానికి చాలా అవకాశాలు ఉన్నాయి. వీరి మధ్యను ఉండే సంబంధం కేవలం పరిచయంగానే ఉండడం వలన యిరువురకూ ప్రయోజనం ఉంటుంది.

## ఆరోగ్యం వగైరా

ఆరోగ్యం బాగా ఉంటుంది. శారీరకబలం, మానసికబలం సమానంగా ఉంటాయి. వీరు భోజన ప్రియులు కావడం వలన అనారోగ్యం చేయవచ్చును. తొడలకు సంబంధించిన అనారోగ్యం చేస్తుంది.

## వీరికి అదృష్టాన్ని కలిగించేవి

రంగు—పసుపురంగు, ఎరుపు, నీలం కలిసిన రంగు. (Purple) కూడా మంచిదని కొందరి అభిప్రాయం.

ధరించవలసినవి— ధూమ్రవర్ణము గల మణి (Amethyst)

సంఖ్యలు— 3, 12, 21, 30, 39, 48 వగైరా.

నెలలు— మార్చి 22 మొదలు ఏప్రిల్ 20
జూలై 23 మొదలు ఆగస్టు 22
నవంబరు 22 మొదలు డిశంబరు 21

సంవత్సరాలు—( వయస్సు ) 3, 12, 21, 30, 39, 48, 57, 66 వగైరా.

**(వచ్చేవారం—మకరం)**

**—మహేష్**






ఇందులో చెన్నకేశవులు, రామదాసు, సత్యం, సుబ్బారావు, చక్రపాణి, సీత, మరియూ శ్రీ సి నారాయరెడ్డిగారి పాటా వున్నారు ఇందులో పాట మినహా అందరూ అంతా కేవలం కల్పితం ఎవర్నీ ఉద్దేశించి ఈ నాటకం రాయలేదు

(చెన్నకేశవులి మేడ అలంకరణ తగ్గట్టుగానే వుంది సమయం ఉదయం లో నెక్కడ్నుంచో సీత పాడుకుంటూ హాల్లోకి వచ్చింది టీపాయ్ మీద గుడ్డ సవరిస్తోంది)

సీత

వచ్చినావా నీవు
వాసంత రాణీ
వన్నెచిన్నెల మేని
వలి మబ్బులాని వచ్చి—
నీ రాకకై వేచి
దూరాన నిను జూచి
పులకరించెను తరులు
పొంగి పోయెను గిరులు వచ్చి•

పాట మధ్యలోనే, సత్యం వొచ్చి నించున్నాడు గుమ్మం దగ్గిర కదిలి లోపలికి రాబోతుండగా కాలి కేదో తగిలి శబ్ద మయ్యింది సీత పాట నాపి— అడిగింది

సీత ఎవరు? ఎవరది?

సత్య నేను సత్యాన్ని ఎంత చక్కగా పాడేవు సీతా!

సీత ఎంత సేపయింది బావా, నువ్వొచ్చి

సత్య ఇప్పుడే క్షణం క్రితం వచ్చేను గుమ్మంలోనే నించుని నా అదృష్టంకొద్దీ నీ పాటని విన్నాను

సీత (నవ్వింది) బలేవాడివి బావా, నా పాట వినేం దుకూ్కడా అదృష్టం కలిసి రావాలా?

సత్య నిజం సీతా, నేను పాడమని కోరినప్పుడు నువ్వింత చక్కగా పాడగలవా?

సీత పోనీలే బావా, నా పాటని నువ్వయినా మెచ్చు కుంటున్నావు అదే చాలు ఇంకా నిలబడేవున్నావా! కూచో బావా! (కుర్చీలాగింది)

సత్య ఫర్లేదు నే నాట్టేసేపు ఇక్కడ వుండను. మావయ్య ఇల్లు దాటడం చూచి ఒచ్చేను ఏ నిమిషానికైనా మావయ్య తిరిగి రావచ్చుగా

సీత నాన్న ఇంతలో తిరిగి రాడేమో ఎన్నికల హడావిడిలో తిరుగుతున్నాడు రాకరాక వచ్చేవు మళ్ళా ఎప్పుడొస్తావో ఏమో? కాసేపు కూర్చో

సత్య (కుర్చీలో కూర్చున్నాడు) నే నివాళ మా వూరు వెడుతున్నాను సీతా! అమ్మకి ఒంట్లో బాగో లేదుట

సీత మళ్ళా ఎప్పు డొస్తావు?

సత్య ఏకంగా రిజల్ట్సు తెలిసింతర్వాతనే వస్తాను.

సీత అన్నట్టు బావా! పరీక్ష లెలా రాసేవు?

సత్య పాసవుతాను

సీత ఇంకా చదువుతావా?

సత్య డబ్బు కావద్దూ?

సీత (సత్యానికి దూరంగా కదిలి అన్నది) ఈ డబ్బు పాపిష్టి ది బావా! మా నాన్న దగ్గిర డబ్బు చాలా వుంది ఆ డబ్బుతో నాన్న సుఖపడుతున్నానని అనుకొంటున్నాడే తప్ప, ఎప్పుడో ఒకప్పుడు ఈ డబ్బే ఆయన అహాన్ని తినేసి, ఆయన కట్టుకుంటూన్న ప్రపంచంలో యింత దుమ్ము పోసి పోతుందనీ తెలుసుకో లేక పోతూన్నాడు. నీ దగ్గిర ఆ డబ్బు లేదు నీ దగ్గిరే ఆ డబ్బుంటే దానికో చక్కని రూపాన్నిచ్చి— ఒక మంచి ప్రయోజనం కొరకు ఉపయోగించే వాడివి

సత్య అప్పుడు మీనాన్న నన్ను గౌరవించేవాడు.

సీత నాన్న విషయం తలుచుకున్నప్పుడు జాలి కలుగుతోంది బావా! చాలా తెలివి గలవాడినని ఆయన అనుకుంటున్నాడు ఆయన్ని ఆశ్రయించిన మనుష్యు లందరూ విశ్వాసపాత్రులనీ, తన మంచినే కోరే శ్రేయోభిలాషులనీ భ్రమ పడుతున్నాడు మాయమాటలు చెప్పి మీకేం ఫర్లేదనే మత్తుమందు ప్రయోగించి రాబోయే ఎన్నికల్లో పోటీ చేయవలసిందిగా ఈ మను ష్యులువాన్నని వొత్తిడి చేస్తున్నారు పదవీ వ్యామో హం, కీర్తికండూతి మనిషినెంతటి వాడిన్నైనా లొంగదీసుకుంటాయనే సూక్ష్మ వొప్పపట్ల

నిజమ్మా బావా.

సత్య: మావయ్య నువ్వనుకున్నంత సామాన్యుడు గాడు. ఆయనెవరికీ ఎప్పుడూ లొంగిపోడు. లొంగిపోవడమంటూ జరుగుతే, ఒకబలమైన కారణం వుండాలి— లాభం కనుపించాలి సీతా, ఈమేడనెలా కట్టించేడు మావయ్య? వేలకి వేలు సంపాయించే ఉద్యోగా? లక్షాధికారి బిడ్డడా? ఏంకాదే!

సీత: కన్నతండ్రిని దోషిగా ఎంచే దౌర్భాగ్యురాలినై పోయేను. కానీ తప్పడం లేదు. నాన్నగురించి నాకు బాగా తెలుసు. ఇన్నాళ్ల పెంపకంలో ఒక్కనాడు గూడా ఆయన నన్ను మనసారా పలుకరించలేదు. నాకేం కావాలో ఆయనకి తెలీదు. నన్ను చెప్పనివ్వడు. ఇక్కడ నేను దాయిలా బతుకుతున్నాను బావా! అమ్మంటూ వుంటే నాస్థితి ఇంత అధ్వాన్నంగా వుండేది కాదేమో. ఆడపిల్లగురించి తల్లికే ఎక్కువ తెలుసంటారు. ఈ ఇంట్లో నాకా అదృష్టంలేదు. (పేలవంగా నవ్వి అన్నది) నాన్న గ్గూడా అమ్మలేదుగదా, నన్నాయన 'అమ్మా'అని పిలువగూడదు? కరిగిపోయేదాన్ని.

సత్య: (గలగలా నవ్వేడు) మంచిముచ్చటే! బాగుంది సీతా!

సీత: బావా!

సత్య: చెప్పుసీతా!

సీత: మళ్లీ, తిరిగి తొరగా వొచ్చెయ్యేబావా! ఎందుకో సరిగ్గా చెప్పలేను గానీ, నాకు భయంగా వుంటోంది.

సత్య: భయమా?

సీత: అవును భయమే. నాన్న ఎప్పుడెలా మారిపోతాడో వూహించలేకుండా వున్నాను. నాకిష్టం లేని పనులెన్నో చేస్తున్నాడు. చివరికి—నా విషయంలోనూ అన్యాయం చేస్తాడేమోనని భయంగావుంది. నీకలా అనిపించడం లేదా?

సత్య: (ఆవేశంగా అన్నాడు) నాకు నువ్వు కావాలి. నీకోసం నేనేదైనా చేస్తాను.

సీత: మగవాడివి గనుక నువ్వంత ధీమాగా చెప్ప గలిగేవు. ఆడ పిల్లకి ఆ తెగువ కూడదు గదూ! నేను మాటాడ బోయేది మన పెళ్లి విషయం. అమ్మ వుంటే, అవిడే అన్నివిషయాలూ సంప్రదించేది. నాకు నేనే అమ్మనీ, అన్నీను. సిగ్గు విడిచి మాటాడుతున్నాను. ఏమీ అనుకోవద్దు.

సత్య: నీదుస్థితి నాకు తెలుసు. చెప్పదలచుకున్నదేదో నిర్భయంగా చెప్పు.

సీత: నాన్నవాక్యం నీకు తెలీంది కాదు. నాపెళ్లి విషయంలోనూ - 'లాభాన్నే' ఆశించే బేరగాడాయన. నాన్న చేతుల మీద నాకు పెళ్లి జరగదు. అమ్మకమే జరుగుతుంది. నన్ను దూరం చేసుకోడం నీకుగానీ నాకు గానీ మంచిదికాదు. అవునా?

సత్య: వింటున్నాను. చెప్పు.

సీత: ఇంకేం చెప్పను బావా! ఇంతకంటే నీఆడపిల్లి నా ఏం చెబుతుంది?

సత్య: నీతోగాని నాపెళ్లి పెళ్ళేగాదు. ఇప్పటికే నీకు అలా అన్యాయం చేసేను. అది తెలుసున్నట్టు నిన్ను దూరం చేసుకోడం గూడానా?

సీత: నాకు అన్యాయం చేశావా?

సత్య: నెమ్మదిగా అంటావేం? నీకళ్లుపోగొట్టి నేన్నీకు అన్యాయం చేశాను. ఇంత సుందర విగ్రహానికి అపచారం చేసేను సీతా! పదేళ్ల క్రితం ఆపాడు దీపావళిని అప్పుడే మరచేవా సీతా? అనాడు ఈ చేతులే కదూ నీకళ్ల పోగొట్టింది.

సీత: వొద్దులేబావా! గుర్తుచేయకు. అది మంచికే జరిగిందని చెప్పి చాలా తడవలు అనుకున్నాను. ఆ దీపావళిని నేనెప్పుడో మరిచేను.

సత్య: సీతా, మనపెళ్లి ఎలా కాదో నేనుచూస్తాను. అధైర్యపడొద్దు. నేనిక్కడికి వచ్చింది గూడా ఈమాట చెప్పడానికే. మావయ్య ఎన్ని కల గోడవల్లో నిండా మునిగిపోయేడు. ఇవాళ ఏం చెప్పినా వినిపించుకోడు. అసలు నేనొచ్చినట్టు తెలుస్తేనే మండిపోతాడు. ఈవేడి తగ్గనివ్వు. నేనే స్వయంగా వొచ్చి మావయ్యని అడుగుతాను. మన బంధుత్వాన్ని ఎలా కాదంటాడో చూస్తాను. ధైర్యంగా వుండు.

సీత: (కళ్లుతుడుచుకుంది) నువ్వింత చెబుతున్నా నా మనస్సు కుదుట పడటంలేదు..

సత్య: నన్ను నమ్ము సీతా, ప్రమాణం చేసి చెప్పేదా?

సీత: అంతమాటనకు. నేను నాన్నలాటి మనిషిని గాదు. అమ్మ గుర్తుందా నీకు? ఆవిడేం చేసిందో తెలుసా? మీక్కనిపించడం మాని నాకు కనిపిస్తోంది. ఆమె దివ్యస్వరూపం, నాగుడ్డిలోకం నిండా వెలిగిపోతోంది. నన్నోదారుస్తుంటుంది, లాలిస్తుంటుంది. నాన్నని క్షమించమని కోరుతుంటుంది. ఎగతాళికీ, అనాదరణకీ కృంగిపోవద్దని హెచ్చరిస్తుంది. ఇంత చీకటిలో అమ్మే లేకపోతే ఈసీత బతికేదా?

సత్య: అవును సీతా! నిజం చెప్పేవు. కేలవలు పూర్తయ్యేలోగా వొస్తాను. అంతవరకూ నిబ్బరంగా వుండు. సరేనా?

సీత: (తలూపింది).

సత్య: అయితే వెళ్లిరానా?

సీత: (మళ్లీ తలూపింది)

సత్య: ఒక కానుకిస్తావా? మాయింటి దగ్గిరదాచు కుంటాను.

సీత: ఏమివ్వను?

సత్య: ఆగిపోయిన ఆపాటని మళ్లీపాడు. హృదయంలో నీపాటని దాచుకుని వెళ్లిపోతాను. పాడు సీతా!

సీత: (పాడింది)

> నీచల్లనౌ పాట
> పాగిపోయిన బాట
> మొలిపించె స్వప్నాల
> పలికించె కావ్యాల "వల్లి"

(చక్రపాణి వొచ్చేరావడంతోటే గబగబా చప్పట్లు చరిచేడు. సీత ఆగిపోయింది. సిగ్గుపడింది. సత్యంతో అన్నది)

సీత: పూలమొక్కలకి నీళ్లు పోయాలి బావా! వొస్తాను గబ గబా దొడ్లి వైపువెళ్లింది.

(చక్రపాణిని అసహ్యంగా చూసేడు సత్యం. చక్రపాణి చాలా తాపీగా అన్నాడు.)

చక్ర: సారీ (బదర్! పాట పూర్తయిందనుకున్నాను.

సత్య: ఇంతమాత్రానికే 'సారీ' చెప్పాలా?

చక్ర: అయితే పుచ్చుకోమాకు. ఎప్పుడో మీ మావయ్య లేనివేళ చూచుకుగాని రావు. వొచ్చిన వాడివి తాపీగా సీతపాట వినాలనుకున్నప్పుడు, సరిగ్గా పావకంలో పుడకలాగా నేళకొచ్చిపడ్డాను. నా సంగతంటావా, ఈ పాటలు రోజూ వింటూన్న వాడిని, సరిగ్గా, నాగదికి పదిహేనడుగుల దూరంలో పూలమొక్కలకి నీళ్ళు పోస్తూ పాడుతుంది సీత. అదేవిటో ఖర్మ, ఎప్పుడు విన్నా ఈ పాట కొత్తగా వుంటుంది నాకు. అందుచేత పాట పూర్తయిపోయిందనుకున్నాను.

సత్య: ఇంతకీ అపాట పూర్తి కాలేదని ఎలా తెలుసు కున్నావ్?

చక్ర: వేరే, ఎలా అని అడగాలటయ్యా సత్యం? నీ మొహం చూస్తుంటే తెలీడంలే? సత్యం! నేనోటి అడుగుతానుగాని ఏమీ అనుకోవుగదా?

సత్య: అడుగు.

చక్ర: మనిషికి అభిమానమే ధనమని చాలామంది అంటారు. ఆ అభిమానం కాస్తా విధులు పాలైంతర్వాత అతను బతికి ప్రయోజనం లేదని నేనంటాను. మీమావ మహాశయుడు నెత్తీనోరు కొట్టుకుంటో, నీవట్ల చాలా అమర్యాదగా ప్రవర్తిస్తున్నాను నువ్విక్కడికి రావడం ఏం బాగుంటుంది?

సత్య: నేను సీతని ప్రేమిస్తున్నాను పాణీ!

చక్ర: సీతనిగాక మీ మావని ప్రేమిస్తున్నావని నేను మాత్రం ఎలా అనుకుంటాను? అయితే సీత కోసం మీమావ ఎంతగోల చేసినా భరిస్తానంటావా?

సత్య: మావయ్య అలా అరుస్తాడే గాని, ఆయన అరిచినంతమాత్రాన మాసంబంధం ఎక్కడికి పోతుంది? ఆయన కాదన్నా, సీతని చూసి పోవానికి నాకు అధికారం వుంటుంది. వుంది.

చక్ర: అధికారమంటున్నావు గనక ఒకపని చెయ్య రాదూ?

సత్య: ఏమిటి?

చక్ర: వన్ఫైన్నైట్...విత్సంకెడి కేష్. అఫ్కోర్స్ కేష్ మీ మావదేలే! అంతా ప్లాన్ చేసింతర్వాత... ఉష్..అంతే. ఎగిరిపోండి.

సత్య: ఎగిరిపోడమా?

చక్ర: వేరే మార్గం లేదు. ప్రేమ పక్షులు ఎగిరిపోవాలి. అంతేగాని ద్యూయెట్లు పాడుకుంటో కూర్చోవు.

సత్య: ఏమో. ఈ ఎగిరిపోడాల్లో నాకు నిజాయితీ కనుపించదు.

చక్ర: చూస్తుండు సత్యం! నువ్వలాగే మడికట్టుక్కూచుంటే ఎవడో నాలాటి రోగ్ సీతమెళ్లో తాళిగట్టేసి నీప్రేమకి మంగళహారతి పాడేయగలడు.

(సత్యం దొడ్డి గుమ్మందగ్గరనుంచుని, పూల మొక్కలకి నీళ్ళు పోస్తూన్న సీతనిచూస్తూ అన్నాడు.)

సత్య: నాకు సీతంటే ప్రేమొక్కటే కాదు—సీత కథ మీద జాలిగూడా వుంది.

చక్ర: ఏవిఁటాజాలి? గుడ్డిదనా?

సత్య: పాణీ!

చక్ర: నేను వున్న మాటే అన్నాను సత్యం.

సత్య: సీత నీకు కేవలం గుడ్డిపిల్లగానే కనిపించిందేమొ! మల్లెపూవు, మలయమారుతం, వెన్నెల రేఖ, గలగలపారే సెలయేరు—ఇవన్నీ భూమ్మీద వెలిసినట్లే సీత గూడా వెలిసింది. దురదృష్టం కొద్దీ ఒక అల్పబుద్ధికి కూతురయ్యింది. దౌర్భాగ్యం కొద్దీ అంధురాలైంది.

(పూలమొక్కలదగ్గర సీత పాడుతోంది—)

నీవొవులే రువ్వ
అందాల తొలినవ్వు
చిరుపూల కవ్వించె
విరగబడి నవ్వించె ॥నవ్వి॥

వినవోయ్ విను. హృదయంలో దాచుకున్న అమృతాన్ని వొలికిస్తూన్న సీత దేవతకాదంటావా? తన కంఠ మాధుర్యంతో మనిషిని పరవశింపచేసే సీతని మామూలు పడుచుగానే భావిస్తున్నావా? సీత కేవలం గుడ్డిపిల్లేనా? మూర్తీభవించిన మంచితనమే సీత. ఈ మోసాలు దగాకోరు జీవితాలూ, హింసలూ అన్నింటికీ అతీతంగా బతుకుతూ— కేవలం పువ్వుల్లో పూవుగా మారి ఆపూలతోనే శోభిస్తున్న వనకన్య సీత.

(సీత పాటతో పాటు సత్యం ఆవేశం గూడా ఆగిపోయింది.)

చక్ర: ఏంచెప్పాలో తోచింది కాదు. ఈకవిత్వం మీ మావదగ్గర చెప్పు సత్యం. కూతురింత గొప్పదని ఆయనకి తెలీదు పాపం.

# ఆశ్రయం

సత్య: ఆయనకి సీత ముఖ్యం కాదు. సీతకన్నా విలువైన వ్యవహారాలు చాలా వున్నాయి. ఆ మనిషికి చదువులో డిగ్రీలు లేకపోయినా, లౌక్యంలో మాస్టరైపోయేడు. నువ్వే భాషలో మాటాడుగాక—నీమనసేవిటో తెలుసుకు వ్యవహరించే లౌక్యం ఆయన సొంతం. ఇవాళ కౌన్సిలర్ రేపు యమ్మెల్యే, మినిస్టర్, ఈ గాడిలోనే బడితే దేశనాయకుడు. కన్న కూతురి మనసు తెలుసుకునే సావకాశం లేదు. మా అమ్మని ఈ ఇంటి గడపతొక్కరాదని శాసించేడు. అక్కా తమ్ముడు అనే అభిమానమే లేని మనిషికి ఎవరో ప్రజలు కనుపించడం కల్ల. ఇవాళ ఒకమేడ కట్టుకుని వూరేగుతాన్న ఈమనిషి రేపు...

చక్ర: ఆగిపోయేవేం? పూర్తిచెయ్. దేశాన్నేఅమ్మేస్తాడను. నాకొంచెం సరదాగా వుంటుంది.

(సత్యంమాట పూర్తి చేయకపోడానికి కారణం లేకపోలేదు. అప్పుడే అక్కడికి వచ్చిన వాడు సుబ్బారావు. అతను చెన్నకేశవులి అప్పకొడుకు. వొస్తూనే అన్నాడు.)

సుబ్బా: దేశాన్నే అమ్మేస్తున్నారు ఏవిటి కథ? కొంచె వాడిని చూపించండి, మందగ్గరో చిన్న స్టైజా దేశం వుంది. అగ్గిపెట్టె వుందా చక్రపాణి గారూ! (సత్యంతో) ఇంత పొద్దున్నే వొచ్చేవ్ బావా ఏవిటో విశేషం? గాయట, చక్రపాణి దగ్గర రామదాసు ఆల్లాడి పోతున్నాడు —ఎవరి కోసమో? ఏమో?

చక్ర: ఇంతకీ మీకు అగ్గిపెట్టె కావాలావద్దా?

సుబ్బా: కావాలి. బావా నీకు సీత కనుపించలే..పూల..

చక్ర: (అగ్గిపెట్టె యిచ్చేడు) ఇంద ముందు ఒకవిషయం పూర్తి కానివ్వండి.

సుబ్బా: (సిగరెట్టు ముట్టించుకున్నాడు) అలాగేసార్. సో— నిప్పంటించుకోడం పూర్తయింది. లేవడంతోటే బాబాయి నన్ను బజారు తోలేసేడు. రోడ్డుమీద అడుగు పెట్టేనో లేదో ఏక్సిడెంట్..

చక్ర: మీకే?

సుబ్బా: కాదులేండి. మొత్తానికి చావు కొద్దిలో తప్పి బయటపడ్డాడు. తిన్నగా చౌదరిగారింటికి వెళ్ళి బాబాయి ఖబురు చెప్పి ఇదుగో ఇప్పుడొస్తున్నా. (కుర్చీలాక్కుని కూర్చున్నాడు) చక్రపాణిగారూ! పరీక్ష లెలా రాసేరు? నాపరీక్ష గోవింద. ఆరునూరయ్యేది, నూరు ఆరయ్యేది మనం పాసవ్వం.

చక్ర: అలా అనకండి.

సుబ్బా: నేనలా రాసిస్తానండి.

సత్య: సుబ్బారావ్!

సుబ్బా: నామాట బావా! మనమంటే నేనన్నమాట. నేను పాసవ్వను అంతె. అయ్యా మేస్టారూ తెల్లవారు ఝామున వొచ్చేకల నిజమవుతుందంటారా? ఎంచేతంటే, ఇవాళ తెల్లవారు ఝామున ఒక కలొచ్చింది నాకు. చెన్నకేశవులు బాబాయి నన్ను ఉతికేస్తున్నాడు.

చక్ర: ఉతకడమా?

సుబ్బా: యస్. నిజమండి! బాబూ! ఆయనచాకౖననుకున్నాడో ఏమో, నీళ్ళలోముంచి బండమీద ఉతికేస్తున్నాడు. నేన్నిచాక్కాను కాదు బాబాయ్, ఉతకడం ఆపు బాబాయ్ అని నేనేమొ ఒకటే కాకిగోల. అరగంటగ్గాని ఉతకడం ఆపేడు కాదు.

చక్ర: ఆతర్వాత ఎండబెట్టాడా?

సుబ్బా: అరే కనిపెట్టేసేరే? సూక్ష్మగ్రాహులండి బాబు. ఎండబెట్టేడు సార్. ఎండబెట్టి వెళ్ళిపోతుండగా నాకు వొళ్ళుమండి బాబాయ్ అన్నాను సీరియస్‌గా. ఒచ్చేడు. ఉతకడవైతే పూర్తిచేసేవుగానీ, ఇస్త్రీ మాటేవిటి? అన్నాను. అసలు ఫేక్ట్ ఏవిటో తెలుసుకుని బాబాయి నాముందె ఫెళఫెళా నవ్వేసేడు. భయపడి కళ్ళు విప్పేను. అప్పట్నుంచీ దడగా వుందండి. ఈ పరీక్షలో నేను తప్పి కూచుంటే బాబాయి ఉతకడంతోపాటు మానాన్నారికో ఉత్తరం రాసి ఆయన్నిగూడా ఉతికించి పారేస్తాడుగదా ఎలా చచ్చేది?

సత్య: సుబ్బరావ్?

సుబ్బా: ఏంబావా?

సత్య: నీకు వేరే పనులేం లేవా?

సుబ్బా: పనులంటాడేవిటండీ? ఇవన్నీ పనులు గావు. పరీక్షలయిపోడమే ఒకపని. అక్కడ్నుంచిబాబాయి ఉపన్యాసాలు వినడం, భేష్ బాగున్నాయని ఎంకరేజ్ చేయడం, పెద్దల్తో ఖబుర్లు చెప్పడం మీలాటి ఫ్రండ్స్‌తో బాతాఖాని వేయడం ఇవన్నీ పనులుగావు. ఈపనుల్తో ఛస్తున్నాను బావా!

సత్య: (వెళ్ళిపోయేందుకు సిద్ధపడి అన్నాడు) వెళ్ళొస్తా పాణీ!

చక్ర: మళ్ళా ఎప్పుడొస్తావు?

సత్య: ఇంతలో రాను.



# కపితాన్ ధరించిన వ్యక్తి




# కపితాన్ చొక్కా

- కంఠానికి చక్కగా సరిపడే కాలర్
- సరిగా ఫిట్ అయ్యే భుజాలు, చేతులు
- నడుము వద్ద అనుకూలంగా వుండే "టేపర్ - ఫినిష్"
- ప్యాంటు నుంచి సులువుగా పైకి రాకుండా ఉండుటకు తగినంత పొడవైన చొక్కా క్రింది భాగము
- బలంగా కుట్టబడ్డ 'క్రాస్ స్టిచ్' గుండీలు
- ఇస్త్రీ కాంచెము మాత్రమే చాలును.

**గోల్డ్ స్టార్**
("టెరీన్"/కాటన్. ఇస్త్రీ అక్కరలేదు)

**సిల్వర్ స్టార్**
2×2 సూపర్‌ఫైన్ కోంబెడ్ కాటన్. ఇస్త్రీ కాంచెము మాత్రమే చాలును

**బ్రాంజ్ స్టార్**
100% కాటన్

ఎంచుకొనేందుకు తెలుపు, ఐవరీ, గ్రే, బ్లూ, ఫాన్ రంగులు మరియు ఆకర్షణీయమైన చెక్, స్ట్రయిప్స్‌లు గల రకాలు వున్నాయి

## బొంబే డైయింగ్

BD-7634 TEL

# ఆశ్రయం

చక్ర: వొచ్చినప్పుడు మాత్రం కనిపించు.

సత్య: నువ్వు మీ వూరెళ్ళావా?

చక్ర: వెళ్లను. ఇక్కడ కొన్ని పనులు మిగిలి పోయేయి.

సత్య: రైట్. గుడ్‌లక్. వొస్తాను. వుంటాను సుబ్బారావ్.

సుబ్బు: వెళ్లిరా బాబా!

(సత్యం వెళ్లిపోయింతర్వాత, చక్రపాణి సిగరెట్టు ముట్టించేడు. అతడు సుబ్బారావుని అడిగేడు.)

చక్ర: మీకు రామదాసు కనిపించేడని చెప్పేరు?

సుబ్బా: అవునండి. ఆ బయట, మీగదిదగ్గర అల్లాడి పోతూ తిరుగుతున్నాడు. చేతిలో సంచీ, భుజమ్మీద కెమేరాను. పలుకరిద్దామనుకున్నానుగాని బస్సుఛార్జీ అడుగుతాడేమోనని నోరు విప్పలేదు.

చక్ర: బస్సుఛార్జీనా?

సుబ్బా: జోకండి!బాబు! ఈమాత్రం జోక్‌కే అదిరి పడతారేం! మాబాబాయి జోకులెప్పుడైనా విన్నారా మరి?

చక్ర: విన్నాను.

సుబ్బా: ఏం విన్నారు, అద్దెజోకులా? అవి కావండి బాబు! ఎన్నికలొస్తున్నాయిగా — జోకుమీద జోకుతో ఉదరగొడుతున్నాడు. అదిగో. రామదాసుగారే వొచ్చేరు.

చక్ర: ఫర్లేదు. రా. సుబ్బారావుగారొక్కరే వున్నారు.

(దాసు లోపలికొచ్చేడు. అతని దగ్గిర కెమేరా ఒక్కటే వుంది.)

దాసు: సుబ్బారావుని చూస్తూ — నవ్వి అన్నాడు. గుడ్‌మార్నింగ్.

సుబ్బా: సంచీ ఏది గురూగారూ!

దాసు: మీరు చూసేరా?

సుబ్బా: సంచిచూసేను. సరుకుచూళ్లేదు.ఏవిటోఅది

దాసు: బీరకాయలు.

సుబ్బా: జోకేనా?

చక్ర: నెంబర్ వన్ జోక్. ఎక్కడపెట్టేవు?

దాసు: నీగుమ్మం దగ్గిర.

చక్ర: ఒక్కక్షణం సుబ్బారావుగారూ! సంచీలోపల పెట్టి వొస్తాను.

(చక్రపాణి వెళ్లేడు.)

సుబ్బా: కెమేరాతో వొచ్చేరు!

దాసు: మంగినపూడి పిక్నిక్ వుంది.

సుబ్బా: పిక్నిక్ అంటున్నారు. కొంపదీసి పరీక్షలు బాగిరాసేరా?

దాసు: మనం రాసేదేవిటండి. బోడిరాయడం.

సుబ్బా: అంటే?

దాసు: పరీక్షలకోసం మనం చదవం. మనముందూ వెనకవాళ్లని చదవండిరా గాడిదల్లారా అని ఎంకరేజ్ చేస్తాం. వాళ్లు చదివి బ్రహ్మాండంగా రాస్తుంటే, మనం కాపీ కొడతాం.

సుబ్బా: చెప్పేరుకాదె? కాపీకొట్టేరా? దర్జాగా కొట్టేరా? ఎవరూ చూళ్లే?

దాసు: కాపీ కొట్టడం ఆర్టు. అది అందరి బాబాగారు.

సుబ్బా: మా బాబాయి ఉపన్యాసం గూడా ఆర్టే. ఎలక్షన్లో నించోడం గూడా ఒక ఆర్టు. బాబాయి లాటి వాళ్లు చెప్పిన మహా గొప్ప ఆర్టు. ఎన్ని ఆర్టులండి బాబూ! అవును రామదాసుగారూ— తమరెవర్నైనా ప్రేమించడమనే ఆర్టు చేసేరా?

దాసు: మన కాలేజీలో శాంత వుంది చూసేరూ. ఆ అమ్మాయి న్నేను ప్రేమించేను. ఈ రహస్యం ఎవర్తోనూ చెప్పకండి. దుర్గాలో సీన్ కెనరీ సినిమా కెడదామని— శాంతా సినిమా కొస్తావా అన్నాను. ఆ మాటతో శాంతకి వళ్లు మండి పోయిందేమో, కళ్లెర్రచేసి నా వేపు చూసి రెండే రెండు ముక్కలంది. నీకు అక్కా చెల్లెళ్లు లేరా అని.

సుబ్బా: అప్పుడు మీరే మన్నారు.

దాసు: చెల్లి సినిమా కొస్తావా అన్నాను.

సుబ్బా: అబ్బ...... అదర గొట్టేరండి.

దాసు: అదిగో చక్రపాణి గా డొస్తున్నట్టుంది. మరి మాటాడకండి.

(చక్రపాణి వచ్చి దాసుతో అన్నాడు)

చక్ర: మూడేనా దొరికాయి?

దాసు: అవును.

సుబ్బా: ఏవిటిసార్?

దాసు: బీరకాయలు.

సుబ్బా: అబ్బబ్బ మళ్ళా జోకేనా? చంపవతల పారేస్తున్నారు సార్!

(ఫోన్ మోగడంతో సుబ్బారావు పరుగెత్తుకుంటూ వెళ్లి ఫోన్ తీసేడు)

సుబ్బా: హల్లో..... బాబాయా?..... చౌదరిగారికి విషయం చెప్పేను.. ఎక్కడికీ.... ఫాన్సీసెంటరుకా? ఇప్పుడే వెళ్లాలా? అలాగే.... అలాగే బాబాయ్.. . అన్నట్టు చక్రపాణిగారు నీకోసం ఎదురు చూస్తున్నారు. అరగంటలో వస్తావా? అలాగే..... ఇదుగో ఇప్పుడే వెడుతున్నాను. (ఫోన్ పెట్టేసేడు) ఒచ్చిందిసార్ పిలుపు. రాత్రికి ఈ ఇంట్లో గొప్పడిన్నరుందిట. మన దుంప తెగిపోయిందన్న మాటే. వస్తానండి.

(సుబ్బారావు విసురుగా వెళ్ళిపోయేడు.)

చక్ర: ఆరు తెస్తావనుకున్నాను. వెధవా! మూడు తెచ్చి మొహాన్న కొట్టేవు.

దాసు: అక్కడికి సంతోషించు. ఏవిటోరా చక్రం! మనం వెధవలివై పోతున్నావేమో! పైగా— ఎవడో తల మాసిన వెధవ నన్ను బ్లాక్‌మెయిల్ చేస్తున్నాడు. 'తాగి తిరుగుతున్నట్టు తెలిసింది. వీలు చూచుకుని డొక్క చింపుతానని' మా నాన్న ఉత్తరం రాసేడు.

చక్ర: అయితే ఏమిటంటావ్? ఇక తాగవా?

దాసు: అదేంమాటలే? కాని, ఇవాళ సత్యంగాడు నన్ను చూచి అనుమానించేడేమోనని దిగులుగా వుంది. మంచి వెధవలకి మనం మంచిగానే కనిపించాలిగదా!

చక్ర: ఎవడూ చూళ్లేదు. నువ్వేం బెంగారు పడొద్దు.

దాసు: సత్యం గాడింకా పూరెళ్ళ లేదేంరా?
చక్ర: వాడికి సీత మీద జాలి గూడా వుంగిటు.
దాసు: నిజమేనేమొ.
చక్ర: ఒక గుడ్డి దాని ప్రేమ కావాలనే సత్యం గాడు ఫూల్ నెంబరు వన్. కేవలం ప్రేమతో ఎన్నాళ్ళు బతుకుతార్రా మనుషులు? మనం అలాకాదే?
దాసు: ఏమోరా బాబూ! నీ ప్లాన్సన్నీ దారుణంగా వున్నాయి. నువ్వు చేస్తుంది మహా పాపంరా. నువ్వూ నేను తాగుదాం. ఇష్టమొచ్చినట్టు తిరుగుదాం. దానివల్ల మనిద్దరం మస్యైనా ఫర్లేదు. కానీరేయ్, ఒక అనాయకురాలి, ఒక గుడ్డి పిల్లని అన్యాయం చేస్తే పుట్టగతులుండవేమోరా?
చక్ర: రాస్కెల్. నీతులు చెప్పడం నీ ఒంటికి మంచిది కాదు.
దాసు: నిలువునా ముంచేవు. ఇంకా వాళ్ళేమిటి? మంచేమిటి? నీ బాగుకోసం, నీ సుఖం కోసం ఎంత మందిని పుసురు పెడుతున్నావో తెలుసా?
చక్ర: ఎంత మందైనా సరె. నేను లెఖ్ఖచెయ్యను. నా సుఖానికి అడ్డొచ్చే మనిషెవడైనా సరే మసి. సత్యంగాడు సీత పాటనీ, సీత మనసుని మెచ్చుకుంటున్నట్టే నేను చెన్నకేశవులి డబ్బునీ, హంగునీ లైక్ చేస్తున్నాను. చెన్నకేవులు ఇవాళ ఫస్టుక్లాసు ప్రయాణికుడు. మనం థర్డ్‌క్లాసు జనతాగాళ్ళం. రేపు చెన్నకేశవులు విమానం ఎక్కే మాట నిజం. ఆ జాతకం నాకు తెలుసు. అతను విమానం ఎక్కింతర్వాత మనం ఫస్టుక్లాసు ప్రయాణికులమైపోతాం. చెన్నకేశవులు ఎదుగుతున్నాడు— రూల్ ప్రకారం మనం ఎదిగిపోతాం. అతన్ని ఆశ్రయించాలనుకుంటే, సీతని ఉపయోగించుకోవాలి. ఒరేయ్ రాందాసూ! ఇవాల్టితో నీతి పాఠాలు అవతల పెట్టు. నీ మనసులో బతుకుతున్న 'మంచి బాలుడి' గొంతు కోసి పారేయ్. మనం మనుషులంరా సన్నాసీ! మనిషెప్పుడూ బాగుపడాలనే సూత్రాన్ని పట్టుకు వేళ్ళాడాలి. సత్యంగాడు ఇంతలో రాడు. వాడొచ్చేలోజుకి నేను చెన్నకేశవులి అల్లుడ్నైపోవాలి.
దాసు: నా కేమిటో భయంగా వుందిరా.
చక్ర: రాందాసూ! ఇన్నేళ్ళు నా పక్కన తిరిగేవు. నా మనసేమిటో నా కంటే గూడా బాగా అర్థం చేసుకున్న వాడివి— ఇవా ళెందుకురా భయపడతావ్?
దాసు: రాబందు నీకు తెలుస్రా చక్రం?
చక్ర: నోరుమూయ్. కాగితం కలం పుచ్చుకో.
దాసు: మళ్లా ఉత్తర మేదైనా రాయాలా?
చక్ర: అవునేం?
దాసు: నే నింక రాయలేను.
చక్ర: ఇది ఆఖరి ఉత్తరం. రెండు ఉత్తరాలా నీ చేత రాయించి, మూడో ఉత్తరం నేను రాసుకుంటే తేడాని సులువుగా కనిపెట్ట గలడు ముసలాడు.
దాసు: ఇదివరకు రాసినవి చాల్లేరా. నన్ను చంపకు.

చక్ర: ఫూల్. ఎందుకురా ఇంత మంచి వెధవైపోతున్నావు! కొంచెం తాగుతావా?
దాసు: సమాధాన పడ్డాడు నీ గదికి వెళ్లి రాయొచ్చుగా.
చక్ర: టైంలేదు. ఇక్కడే రాయి. ఇదిగో నోట్సు. ఒక కాగితం చించుకో. మిగిలిన ఖర్మకాండ మొత్తం ఇక్కడే జరగాలి. వ్రాయి.
(దాసు, నోట్సులో కాగితం చించి రాసేందుకు సిద్ధపడ్డాడు. చక్రపాణి చాలా మెత్తగా నవ్వేసి అన్నాడు)
చక్ర: ఎంత మంచివాడివిరా ఫ్రండూ! వ్రాయి. డియర్ చక్రపాణి, నా మాట వినలేదు. ఖర్మ అనుభవించు. ఇవాళే మీ అన్నయ్యకీ ఉత్తరం రాస్తున్నాను. ఆస్తిలో పంపకమే కాదు— మీ అన్నయ్యకి శాశ్వతంగా దూరమైపోతావు.
దాసు: రాస్తూ ఆగి అన్నాడు) నిజం చెప్పరా? నీ కెంత ఆస్తి వుంది.
చక్ర: మధ్యలో నస పెట్టకు. కానివ్వు. అంత మంచి వాడినీ వదులుకున్న తర్వాత ఆస్తి పంపకం నిన్ను ఉద్ధరించదు. జాగ్రత్త. నీ శ్రేయోభిలాషి. చాలు.
దాసు: (పూర్తి చేసేడు) ఎప్పుడు పోస్ట్ చేయమంటావ్?
చక్ర: ఇదపోస్ట్ చేయనవసరంలేదు. ఉదయం లేస్తూనే నాగదిలో పడివుంది ఉత్తరం. (రామదాసు రాసిన ఉత్తరాన్ని పుచ్చుకుని జేబులో పెట్టుకున్నాడు.) కెమేరాతో రెడీగావుండు. సీతని పిలుస్తాను. బ్యూటీఫుల్ స్నాప్ ఒక్కటి.
దాసు: నీగదిలో తీయమన్నావుగదూ.
చక్ర: వొద్దు. ఇక్కడే.
దాసు: ఒకటి గమనించేవో లేదో. సీత గుడ్డిదిరా. దొంగ ఫోటోలు చెల్లవు.
చక్ర: ఫోటో ముఖ్యం. కథ అడ్డం తిరక్కపోతే, ఆ ఫోటోతోపనే వుండదు.

దాసు: ఎందుచేతో నువ్వు ఇవాళ చాలా ఆవేశంగా వున్నావు. అన్నీ ఇవాళేనా, ఈఇంట్లోనేనా?
చక్ర: అవును అన్నీ ఇక్కడే, ఇవాళే! ప్లాన్ కొంచెం మారింది. నాగది ఈ ప్లానులోరాదు. సత్యంగాడి వరసేం బాగోలేదు. వాడు నాధాన్నుని తన్నుకుపోతే నేను సహించలేను. వాయిదాలు వేయడమో ఇష్టంలేదు. ఇంకేం చెప్పను. చెన్నకేశవులొచ్చే వేళయింది. ఎన్నో నెలల నాప్లాన్‌కి రోజా పతాక సన్నివేశం. అడ్డుచెప్పకు దాసూ! సీతని పిలుస్తానుండు. (వెళ్ళబోయేడు)
దాసు: (ఖంగారుగా పిలిచేడు) చక్రం! (చక్రపాణి ఆగిపోయేడు) అసలిదంతా ఎందుకుగాని నన్నొదిలిపెట్టరాబాబూ! నేను ఫోటో తీయలేను.
చక్ర: చంపుతాను. నాకు వూరికే సేవలు చేస్తున్నావుట్రా ఫూల్! నిన్ను మేపుతున్నాన్రా! నీ జన్మలో రుచిచూడని బ్రాందీ విస్కీలిస్తున్నాను. సినిమాలకి డబ్బులిస్తున్నాను. నాకీమేలు చేసిపెడితే రేపు నిన్ను అందలం ఎక్కించబోతున్నాను. అండర్‌స్టాండ్.
దాసు: (ఒక్కకోపంతో నాలికిపోయేడు) చాలాదారుణంగా అన్నావురా చక్రం. నన్ను అవమానిస్తున్నావుగదూ. రైట్. నేను నీకు తొత్తుని గానురా. నువ్వు చెప్పినట్టు చస్తేచెయ్యనింక. బై.
(రామదాసు విసురుగా వెళ్లబోయేడుగాని చక్రపాణి అతన్ని చేతోపట్టుకు ఆపిఅన్నాడు).
చక్ర: లాభంలేదురాదాసూ! నువ్వు నన్నొదిలిఎక్కడికీ వెళ్ళలేవు. నాప్లాన్‌లో నువ్వు చాలావరకు కమిట్ అయ్యేవు. దొంగఉత్తరాలురాసి ఫోర్ట్వంటీ గాడివైపోయేవు. నేను సులువుగా తప్పుకోగల్ను. నీకా తెలివితేటలు దేవుడిచ్చేడు గాదు. ఇవాళ నిన్ను మాటలో అవమానించానేమో. నన్ను ధిక్కరిస్తే రేపు నీబతుకు—దాసొరేయ్—నామాటకి యస్సను. దాసోహమను.



క్విక్. వన్. టూ.

దాసు: (త్రీ అనకురా లవుడీ రాస్కెల్, గూండా, ఇడియట్.

చక్ర: ప్రైవేట్ చివ్రరోజిది. కౌన్సిలర్ గారి అల్లుడ్ని. గీతబాగుంటే మినిస్టర్నై పోగలడు మాష్. అంత అమర్యాదగా మాటాడకు.

దాసు: పిల్లంతా మంత్రులై, ఆ మంత్రులకి నీలాటి వెధవలు అల్లుళ్లైతే, దేశం గతి చెప్పా లింక. కానివ్వు చక్రం. నేను బఫూన్ని. సత్ర కాయిని. నీ యిష్టం. సీతని పిలిచి. పాపం కట్టుకో.

చక్ర: (నవ్వేడు మెల్లిగా) కాసబియాంకా కథ తెలుసురా నీకు?

దాసు: ఇప్పుడు వాడెందుకులే. వెధవ వసులకి వాడి బాబున్నేను.

చక్ర: అయితేసరే, సీతని పిలుస్తాను. చప్పుడు కాకుండా ఫోటో తీసెయ్. ఫోజు నేనే సెట్ చేసుకుంటాను. ఓ. కే.?

దాసు: వెళ్లింక.

(రామదాసు దొడ్డి గుమ్మం దగ్గర దొంగలా నక్కి కెమేరాని తెరిచేడు. చక్రపాణి దొడ్లోకి వెళ్లి పూలమొక్కల దగ్గరున్న సీతని పిలుచుకు వచ్చేడు.)

చక్ర: సీతొచ్చిందోయ్ సత్యం!... సత్యం!.... అరె, ఇంతలోనే ఎక్కడికి వెళ్లినట్టు చెప్మా?

సీత: నాన్న వచ్చే వేళయింది.

చక్ర: మీరిక్కడే కూచోండి. బయటికి వెళ్లి వాడిని పిలుచుకు వస్తాను.

(సీత కుర్చీలో కూర్చుంది. చక్రపాణి బయటకు వెళ్లినట్టు వెళ్లి మళ్లా వెంటనే అడుగులో అడుగు వేసి సీత వెనక్కి వచ్చి నించు న్నాడు. సరిగ్గా ఆ వేళకి రామదాసు కెమెరాతో ముందుకు వచ్చేడు. చక్రపాణి సైగ చేసేడు. చక్రపాణి సీత పక్కన నించుని, తలని సీతమీదికి వంచినవ్వబోయే ప్రయత్నం చేయగా— రామ

# ఆశ్రయం

దాసు అక్కడున్న కుర్చీని తన్నడంతో నిశ్శబ్దం ఛిన్నాభిన్నమయ్యింది. చక్రపాణి మెల్లిగా బయటకి తప్పుకున్నాడు. సీత ఉలిక్కిపడి లేచి నించుని అడిగింది.

సీత: ఎవరది? ఎవరు? సత్యం?

రామ: సత్యం కాదండి. నేను. నేను.

సీత: నేనంటే? ఎవరు? చక్రపాణిగారూ!

చక్రపాణి అప్పుడే బయట నుంచి వచ్చి నట్టు నటించేడు.)

చక్ర: నువ్వట్రా? ఎంతసేపయింది వచ్చి?

దాసు: ఇప్పుడే. నువ్వు గదిలో లేకపోతే, ఇక్కడి కొచ్చేవేమోనని—

చక్ర: నీకు సత్యం కనిపించలే?....

దాసు: సత్యమేనా? కనిపించేడు. నోటికి వేలు అడ్డు పెట్టుకుని ఎక్కడికో తూలుకుంటూ పోతున్నాడు. తాగేడేమో.

సీత: తాగేడా......సత్యం తాగేడా?

చక్ర: క్షమించండి సీతాదేవి! సత్యం ఇవాళేం దుకో ఖంగారులో వున్నాడు.

(సీత తోటలోకి వెళ్లబోతుండగా చక్రపాణి అనునయంగా అన్నాడు.)

చక్ర: ఎంత మంచివాడు ఎంత దిగజారిపోయేడో గదా! మీకు శ్రమ యిచ్చేను. క్షమించండి సీతాదేవి!

(సీత వెళ్లిపోయింది. రెండు క్షణాలు మిత్రు లిద్దరూ ఒకరి మొహం లొకరు చూచుకున్నారు. రామదాసు భయపడుతూనే వున్నాడు.)

చక్ర: ఫూల్!

దాసు: చూచుకోలేదురా. వెధవ ఖంగారు. పాడు కుర్చీ ప్లాన్ని పాడుచేసింది.

చక్ర: కల్పించుకుని నువ్వు గుడ్డి వెధవ్వై పోయేవు. గుడ్డిదేమొ, విన్నా, నన్ను మన




వెధకాన్ని కళ్లారా చూచినట్టు అసహ్యించు కుని వెళ్లిపోయింది.

దాసు: అసహ్యించుకున్నదనే అంటావా?

చక్ర: అలా అనుకోవాల్సిందే మరి. చేసింది జాలక సత్యంగాడు తాగేడని చెప్పేవు. ఆ మాట చస్తే నమ్మదు.

దాసు: ఏం చెప్పాలో తోచలేదురా. అలవాటుపడ్డ ప్రాణివేను....తాగడం మీదికి మనసుపోయి పెలేసేను. ఒరేయ్ ఇవన్నీ నా మనస్సాక్షిగా చెయ్యాలని చెయ్యలేదురా.

చక్ర: వెళ్లిపో యింక. పొగుండ్రతం తిన్నగా నా గదికి ఒచ్చెయ్.

దాసు: ఎందుకుట?

చక్ర: తాగవుట్రా?

దాసు: తాగన్నా.

చక్ర: తలేసున్నా తిరుగుతోందా? సాయంత్రం ఆరు కొట్టేసరికి నువ్వు నా గదిలో వుంటావు. ఒక్క నిమిషం దాటినా నే నూరుకోను. గో.

(రామదాసు బయట అడుగుపెట్టి మళ్లా అంత లోనే తిరిగొచ్చేడు.)

దాసు: చెన్నకేశవు లొస్తున్నార్రా.

చక్ర: భయపడకు. రైట్. నోటుబుక్ పుచ్చుకో. నువ్వు దానికోసమే ఒచ్చేవు. (ఇల్లంతాచూసి, దేవుడి ఫోటో దగ్గిరి కెళ్లి బొట్టు పెట్టు కున్నాడు.) ఏవిటోరా దాసూ! నామీద నీకింత గౌరవం వున్నదంటే నేను నమ్మలేకుండా వున్నాను. చేతులెత్తి దేవుడికి నమస్కారం చేస్తే పిచ్చి వెధవలంటున్నారు జనం. సరే. నీ నమ్మకాన్ని పాడు చేయడ మెందుకు.

ఆ వేళకి చెన్నకేశవు లొచ్చేడు.

చక్ర: నమస్కారం సార్! (రామదాసుని చూస్తూ అన్నాడు) వచ్చేతడవైనా బుద్ధిగా చదువు కోరా. పాసవుతావు. (రామదాసుకి బొట్టు పెట్టేడు) దేవుడ్ని మనసులో దాచుకో. బాగు పడతావు. నోట్సు జాగ్రత్త. రేపురా, మిగతా పుస్తకా లిస్తాను. భద్రంగా తిరిగివ్వు. వెళ్లింక.

దాసు: థేంక్స్ పాణి. నీ మేలు జన్మకిక మరువ లేను. ఒస్తారా. ఒస్తానండి.

చెన్న: మంచిది నాయనా!

(రామదాసు వెళ్లిపోయేడు.)

చక్ర: మా క్లాసు కుర్రాళ్లంతా నన్ను మహా భక్తు డిగా జమ కట్టేసేరుసార్! పిడీ సంవత్సరం పరీక్ష తప్పేది ఖాయమట. వచ్చే సంవత్సర మైనా పాసయ్యేందుకు దేవుడ్ని వాడి తరపున కోరమన్నాడు. నవ్వకండి. నేను మీకోసం, యిక్కడ కూచున్నాను గదా. నా గదికి రారా వెడదామంటే విన్నాడు కాదు. ఇక్కడే, అర్జం టుగా మీ దేవుడికే నా చేత నమస్కారం చేయిం చేడు. ఏవిటోనండి చాదస్తం.

చెన్న: ఈ దేశం ఇవాళ యిలా యింకా బట్ట కట్టు కుని బతుకుతుందంటే ఏవిటి కారణం! మరేం లేదు. చాలా ఈజీగా చెప్పొచ్చు. నీలాటి బుద్ధి, వంతులు చేస్తున్న ఈ పూజలే కారణమని నేనంటాను.

చక్ర: థేంక్స్ సార్! నా మీద మమిన్న ఆదరంకొద్దీ మీరీ మాట అన్నారే గాని, ఎవరైనా ఇదివింటే మన మొహాల మీద నవ్వేస్తారు.

చిన్న: ఇవాళ నువ్వు ఏం చేసినా తప్పుకింద భావించే ఈ ప్రజావాహినిని నువ్వూ నేనూ క్షమించి వాళ్ళిందే తప్ప ఇతరత్రా ఇంకో మార్గం లేదు. మనిషి చెడిపోడానికి కారణం నేను చెబుతాను విను. దేవుడి మీద వాడికి నమ్మకం పోయింది. దేవుళ్ళంతా చిల్లర రాళ్ళని చెప్పి గోల చేస్తున్నాడు. దేవుణ్ణి లెఖ్ఖచెయ్యనివాడు దేవుళ్ళాంటి మనుష్యుల్నేం గౌరవిస్తాడు. అందుచేత మనిషి చెడిపోతున్నాడు.

చక్ర: ఎంత మంచి ముక్క చెప్పారండి. ఈనాడు మీరు నాకు చెన్నకేశవులుగానే కనుపించవచ్చు. కాని సార్, ఈ దేశం మీ రనుకున్నంత అధ్వాన్న స్థితిలో లేదు. మీలాటి మహాశయుల సేవ యివాళ దేశం పొందక పోవచ్చు. ఆ రోజు, ఆ అవసరం — ఈ దేశానికి తప్పకుండా వున్నాయి.

చిన్న: (ఉబ్బి పోయేడు) చిన్నవాడివి. దైవభక్తుడివి. నీ మాట నాకు ఆశీస్సు. నిన్న సాయంత్రం ఛైర్మెన్ ఖబురంపేడు. రేపు జరగబోయే జనరల్ ఎలక్షన్లలో అతను నించుంటాడట. నేనేమో సపోర్టు చెయ్యాలిట.

చక్ర: (ఆత్రంగా) అడిగేడు. మీరే మన్నారు?

చిన్న: నువ్వేడు ఏవిటంత ఇంగారుగా అడిగేవు?

చక్ర: ఏం లేదుసార్! రేపు ఎన్నికల్లో మీరే నించోవాలి. మా వాళ్ళందర్తో మీ విషయం చెప్పేసేను.

చిన్న: నాకు చదువు లేదు. ఛైర్మెన్ గోలచేస్తున్నాడు.

చక్ర: చదువా? చదువు గురించి మాటాడేందుకు ఛైర్మెన్ ఎవరండి? ఆయనకి భయపడి నించోడం మానుకుంటున్నారా ఏం?

చిన్న: నేనంత తెలివి తక్కువవాడిని కాదు— మానుకోడానికి.

చక్ర: మీరామాటమీదే నించోండి. నా తరవాతి గురించి మీకు చెప్పుకోడం యిష్టంలేదు. మా స్టూడెంట్సందర్నీ కూడదీసుకుని మీకు ప్రచారంచేస్తాం. వీధి వీధినా, గుమ్మం గుమ్మంనా మీ పేరు వెలుస్తుంది. మనిషి నిద్రపోతే వాడి కలలో గూడా మీ ప్రచారం జరిగే ఏర్పాటు నేను చేస్తాను.

చిన్న: (చక్రపాణి చేతులు పుచ్చుకున్నాడు) ఎంత మంచివాడివోయ్ కుర్రాడా! దేశంలో నీలాటి యువకులున్నంత కాలం, నా బోటి మనిషికి భయంలేదు. నీ ఉద్రేకంతో నన్ను ఉక్కిరి బిక్కిరి చేసేవు. నువ్వా ఆ మాటమీదే నిలబడు. మాకు దేశసేవ చేసే అవకాశమే రావాలి గాని, చదువుకోడం ఎంతపని? పదవిలో వున్న అయి. దేళ్ళా చాలవూ? ఇదిగో మన శోభనాద్రి గారితో ఈ విషయమే మాటాడి వస్తున్నా.

చక్ర: అల్లా చెప్పండి. మీరు ఉదయమే ఇల్లు కదలి వెళ్ళిపోయేరని మీ సత్యం ఇక్కడి కొచ్చేడు.

## రచయితలకు మనవి

### కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాత ప్రతులని తిప్పివంపగోరే రచయితలు వ్రాత ప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన, స్వంత చిరునామాగల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంప రాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాత ప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజీగల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరించబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

### నవలలు

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాత ప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాత ప్రతులతో స్వంత చిరునామాగల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 అరఠావు పేజీల పయిన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

### కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరించబడని కార్టూన్‌లు తిప్పి పంపగోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాగల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

షరా: వ్రాతప్రతులనీ, కార్టూన్లనీ వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయమై ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

సంపాదకుడు

ఆంధ్రసచిత్రవారపత్రిక

## ఆశ్రయం

ఇప్పుడే వెళ్లిపోయేడు.

చెన్న: సత్యమా? సత్యం వచ్చేడా?

చక్ర: ఒచ్చేడు. వచ్చి.... నా చేత....

చెన్న: నా....చేత? చెప్పు. తర్వాత చెప్పవయ్యా!

చక్ర: ఏమిటో సార్! మీరంటే నా కెంత గౌరవమో సత్య మంటే అంత ప్రాణం. ఇన్నేళ్ళుగా కలిసి చదువుకుంటూన్న వాళ్ళమాయె. ఆతన్నాకు చేసినదానికి సాయపడకపోతే ఎల్లా చెప్పండి? ఒక్కసారి సీతగార్ని పిలుచుకొస్తావా పాణీ అన్నాడు.

చెన్న: పాణీ.... ఇంటి కొచ్చింది చాలక. సీతని పిలవ మన్నాడు. నువ్వు పిలిచేవా?

చక్ర: .. .. ..

చెన్న: పిలిచేవా అంటున్నాను.

చక్ర:( వినయంగా అన్నాడు ) నేను అబద్ధం అంత తొందరగా చెప్పలేను.

చెన్న: పిలిచేవా అంటున్నాను.

చక్ర: ( భయంగా అన్నాడు ) పిలిచేనండి.

చెన్న: సీత వచ్చిందా?

చక్ర: ( తలూపేడు )

చెన్న: తర్వాత ఏమైయ్యింది?

చక్ర: సత్యం పారిపోయేడు.

చెన్న: సీత కూడా పారిపోయిందా?

చక్ర: ఇంట్లోకి వెళ్లిపోయింది. అతనెందుకు పారి పోయేడో తెలీడం లేదు. ఇవాళ ఉదయం నాకు మరో ఉత్తరం వచ్చింది.

చెన్న: మళ్ళా ఆకాశరామన్నేనా?

(చక్రపాణి తలూపి ఉత్తర మిచ్చేడు. చెన్న కేశవులు ఆ ఉత్తరం చదివి అన్నాడు)

చెన్న: ఎవడీ ఆకాశరామన్నగాడు? వెధవ కనిపిస్తే కాల్చి పారేద్దును.

చక్ర: ఈ ఉత్తరం ఉదయమే చూచుకున్నాను. రాత్రి సత్యం నా గది కొచ్చి వెళ్లేడు.

చెన్న: ఇంకేం? ఈ అడంగి పనులు వాడే చేసి వుంటాడు. అవునయ్యా! వాడితో ఒక్క ముక్క అనేయరాదూ?

చక్ర: ఏమని?

చెన్న: సీతని నువ్వు పెళ్లి చేసుకోబోతున్నావని.

చక్ర: సార్!

చెన్న: ఏం? నేన్నిజమే చెబుతున్నాను. ఆ మాట వాడితో చెప్పేయమంటున్నాను.

చక్ర: .. .. ..

చెన్న: ఏమిటి సంశయిస్తున్నావు?

చక్ర: అతన్నాకు ప్రాణ మిత్రుడు.

చెన్న: నాకు మేనల్లుడు గూడాను. అవుతే ఏం జరిగిం దిప్పుడు?

చక్ర: (కాసేపు మవునంగా వుండి అన్నాడు) సత్యం సంగతి నాకు తెలుసు. అతను చాలా మంచి వాడు. ఈ ఉత్తరాల్ని అతను రాయడం లేదు గాని, అతను ఎవరిచేతనో రాయిస్తున్నాడు అతనెందు కింత దారుణంగా మారిపోయేడో అర్థం గావడం లేదు. ఎదటుబడి నన్ను అన్ని విషయాలూ అడగొచ్చు. అయినా అడగడం లేదు. అతనడగందే చెప్పడం నా కిష్టంలేదు. కానివ్వండి. ఏం జరగనున్నదో అదే జరుగు తుంది.

చెన్న: ఇంకా ఏమిటి జరిగేది? నువ్విందాకటి మాట మీదే వుంచో. నీ స్నేహితు లందర్నీ కూడదీసు కుని రేపు ఎన్నికల్లో నా తరపున పని చేయిం చు అది చాలు. సీతకీ నీకూ పెళ్లి నేను చేస్తాను. ఈ పెళ్లికి అడ్డుపడే వెధవల్ని అక్కడికక్కడే కాల్చి పారేస్తాను.

చక్ర: సార్!

చెన్న: సార్ అనొద్దు. మావగారూ అను. నీ మాట మీద నువ్వు, నా మాటమీద నేను నించుందాం.

చక్ర: (తటదించుకుని అన్నాడు) ఇక్కడే మీకో మాట చెప్పాలి. ఎన్నికల్లో మీకు ప్రచారం చేయ బోయేది సీతగారి కోసం కాదు.

చెన్న: తెలుసు నాకు. ఈ మాటు సత్యంగాడొస్తే ఖబురు పెట్టు— వెధవని పట్టుకుని పళ్ళు రాల గొడతాను.

చక్ర: దయచేసి మీరా ప్రయత్నాలేవీ చేయకండి. అతన్నాకు మిత్రుడు. తెలిసో, తెలీకో నా మీద పగబట్టేడు. ఇది మా యిద్దరికీ సంబంధించిన విషయం. దాన్లో మీరు కలుగ జేసు కోడం నా కిష్టం లేదు. నా మీదొట్టువేసి చెప్పండి. సత్యం మీ కెప్పుడు కనుపించినా, మీరతన్ని ఏమీ అనరనీ, అసలు అతన్ని పట్టించుకో రనీ'ను.

చెన్న: (ఆశ్చర్యపోయేడు)

చక్ర: మాటివ్వండి సార్! సత్యం నాకు ప్రాణ మిత్రుడు. అతన్ని పట్టుకు అవమానిస్తే, నన్నూ అవమానించినట్టే అవుతుంది.

చెన్న: ఎంత మంచివాడివోయ్ చక్రపాణీ! సరే అలాగే కానివ్వు.

చక్ర: థేంక్స్. వస్తానుసార్ (రెండడుగులు వేసి— వెనక్కొచ్చేడు) నా గదికి అద్దె యిద్దామనే వచ్చేను. ఆ విషయం మరిచిపోయి ఏవేవేమిటో చెప్పి వెళ్ళబోతున్నాను. క్షమించండి. (జేబులోంచి ముప్పై రూపాయలు తీసేడు) ఇది వచ్చేనెల అద్దె. ఆ నెలంతా నేనిక్కడే వుండి, మీ ప్రచారం సాగిస్తాను. పుచ్చుకోండి.

చెన్న: పుచ్చుకుని— అలా చూస్తూ నించుండి పోయేడు

చక్ర: ఒస్తానండి. సెలవు.

(చక్రపాణి గది దాటుతూండగా తెర.)

(ఇంకా వుంది)




మనుష్యుల్లో కొందరు స్తోత్రప్రియులు ఉంటారు. ఎవరైనా 'నువ్వు ఇంద్రుడంతటి వాడవు, చంద్రునివంటి వాడవు' అని పొగిడేస్తే ఎంతో తృప్తిపడి, వారు ఆ పొగడినవారిని సమ్మానిస్తారు. కొందరికి స్తోత్రమంటేనే కిట్టదు. మానవులను స్తుతించడానికి కొందరు ఇష్టపడరు కూడా. వారు ఎట్టి కష్టాలనయినా ఎదుర్కొని కష్టాలు తప్పించుకోగలరు !

సుప్రసిద్ధ సంకీర్తనాచార్యుడై తిరుపతిలో శ్రీ వెంకటేశ్వరుని సన్నిధిలో తన జీవితాన్ని గడిపిన తాళ్ళపాక అన్నమయ్య గారిపేరు వినని వారు తెలుగు దేశంలో ఉండరు. ఆయన వేలకొద్దీ కీర్తనలను భగవంతునిపై రచించాడు. ఉత్తమభక్తుడు వాగ్గేయకారుడు...

సంకల్పసిద్ధుడు. 'ఓ' అని పిలిస్తే దేవుడు పలుకుతాడు. ఆయన చూపిన మహత్తులు అనేకంగా ప్రజలు చెప్పుకుంటూ ఉంటారు.

ఆ కాలంలో సాళువ నరసింహరాయలు విజయనగర సామ్రాజ్యానికి అధిపతి. ఆయనకు అన్నమయ్య శక్తిసామర్థ్యాలు తెలుసు. సంగీతమంటే రాయలు చెవికోసుకుంటాడు. అందువల్ల అన్నమయ్యమీద ఆయనకు ఎంతో గౌరవం! తరచుగా గొప్ప మర్యాదలతో అన్నమయ్యను తన దగ్గిరికి రప్పించుకొని, కీర్తనలు పాడించుకుని, తృప్తిపొంది సత్కరించి పంపుతూ వుండేవాడు. వారిద్దరికీ ఎంతో మైత్రి ఏర్పడింది.

ఒకసారి నరసింహరాయలు అన్నమయ్య గారిని ఆస్థానానికి పిలిపించి, ఆయన గానామృతాన్ని కర్ణపేయంగా చేసుకుని ఎంతో ఆనందించాడు. ఆ సమయంలో మహాకవి భగవంతునిమీద ఒక శృంగార కీర్తన అల్లి, పాడినది రాయల మనస్సును మిక్కిలి ఆకర్షించింది. ఆ పాడిన కీర్తననే పదే పదే పాడించుకుని ఎంతో మురిసిపోయాడు. అప్పుడు తనపైని అలాంటి కీర్తన కట్టించుకొని అన్నమయ్యచేత పాడించుకోవాలనే కోరిక రాయలకు కలిగింది

రాయలు తన కోరికను ఆయనకు తెలియజేశాడు. అన్నమయ్యకు పట్టరాని కోపం వచ్చింది. తాను మనుష్యులను స్తుతించడనే సంగతి రాయలకు తెలుసు. తెలిసి కూడా, అతని కిలాటి చెడ్డకోరిక కలగడం అసహ్యమనిపించింది. తన కోపతాపాలను లోలోపలే అణచుకుని, తాను భగవంతుని కీర్తించిన రీతిని మానవమాత్రుణ్ణి స్తుతించలేనని నిర్మొగమాటంగా చెప్పివేశాడు. చక్రవర్తి అయిన తన మాటను తిరస్కరించినందుకు రాయలకు కోపం వచ్చింది. పట్టుదల హెచ్చింది. 'కీర్తన పాడనిదే నీవు ఇక్కడనుంచి కదలలేవు' అన్నాడాయన. 'నాచేత నీమీద కీర్తన పాడించడం నీకు కాదుగదా, బ్రహ్మకూడా తరం కాదు' అన్నాడు అన్నమయ్య !

ఇక వేముంది? అప్పుడైన అన్నమయ్యకు రాయలు నౌకర్లచేత బంగారు సంకెళ్ళు వేయించాడు: అన్నమయ్య తన పరితాపాన్ని తెలుపుతూ దేవునిపై ఒక్క కీర్తన పాడేసరికి ఆ సంకెళ్ళు వాటంతటవే విడిపోయాయి. రాయలే స్వయంగా వచ్చి సంకెళ్ళు బిగించాడు. అన్నమయ్య మళ్ళీ ఆపాటే పాడేడు. సంకెళ్ళు విడిపోయి కిందపడ్డాయి. రాయల ఆశ్చర్యానికి మేరలేకపోయింది! ఆయన అన్నమయ్య కాళ్ళమీదపడి తన అపరాధాన్ని క్షమించ గోరాడు!

అన్నమయ్య కరుణించి ఆయనను క్షమించాడు.

పరమ భక్తులకు లౌకిక ప్రపంచం తృణప్రాయం! వారి దృష్టిలో సామాన్యుడికీ చక్రవర్తికీ భేదం లేదు ఆ భక్తులు ఎట్టి కష్టదశలోనయినా తమ నియమాలను ఉల్లంఘించరు. భగవంతుడే వారి కష్టాలను తొలగిస్తాడు. వారు భగవంతుని స్తుతించిన నోటితో మానవుణ్ణి స్తుతించరు.



సీరియల్




ఉన్నవ విజయలక్ష్మి

**జరిగిన కథ**

సుజాత టీచరుగా పని చేస్తూ మానేసి స్టెనో నేర్చుకున్నది. అన్నపూర్ణా ఇంజనీరింగు వర్క్సులో స్టెనోగ్రాఫర్‌గా చేరింది ఆ కంపెనీ అధిపతి నీలకంఠం. అతని కొడుకు శ్రీధర్ శ్రీధర్‌ని ఎక్కడో చూసినట్లు అనిపిస్తుంది సుజాతకి సూర్యం సుజాతకి మేనబావ ఆమెని వెతుక్కుంటూ వస్తాడు వాళ్ళిద్దరికీ పెళ్ళి చెయ్యాలని తలిదండ్రులు చిన్నప్పుడే అనుకున్నారు సూర్యం అందంగా వుండడు చదువు కూడా అబ్బలేదు సుజాత అతన్ని తప్పించుకు తిరుగుతూ వుంటుంది

## 3

మేష్టర్లు కేకలేసిన తొస్సేవు ఏడుపు వచ్చినా ఆ స్కూలుభవనం, వందల సంఖ్యలో వున్న విద్యార్థులు, తన క్లాసురూము, వంతైన నిముషాలకోసారి మారే మేష్టర్లూ, స్కూలు అయిపోగానే కావలసినంతసేపు ఆడుకోటానికి అనువుగావున్న ప్లేగ్రౌండూ అన్నీ వాడిలో కొత్త ఆసక్తిని కలిగించాయి.

'తల్లికోసం బెంగ పెట్టు కుంటాడు' అంటూ అచ్చమ్మగారు చేసే గారం తల్లి ప్రేమనే మరిపించేది—ఈ కారణాలన్నీ వాడు అక్కడ వుండగలగటానికి దోహదంచేశాయి.

'మరీ చీకటిపడిందాకా వుండిపోకు తొస్సేవు ఆడుకుని వచ్చెసెయి' అని మధ్య మధ్య ఇంట్లో వాళ్ళంతా హెచ్చరించటం మాత్రం బలే విసుగ్గా వుండేది. త్వరగావచ్చి చేసేదేముంది అసలు ఏం తోస్తుంది అను కున్న వాడి దృష్టి వరండామీది సైకిలు మీద పడింది. రంగనాథం చాలాకాలం దాన్ని ఉపయోగించి చివరికి తొక్కటానికి తనకీ నడవటానికి దానికీకూడా ఓపికలేక నాలుగు వీధుల దూరంలోవున్న స్కూలుకి సైకి లెందుకులే అనుకుని దాన్ని మూలపడేశాడు. మేనల్లుడి కోరిక వింటూనే అదెంత భాగ్యం అంటూ ఓ ఆదివారం కూర్చుని దానిదుమ్ము దులిపి చిన్నచిన్న మరామత్తులు చేయించి నేర్పటం మొదలుపెట్టాడు—వీధివాకిట్లో ఓ వారం రోజులు నేర్చుకుని ఓ డజను దెబ్బలు తగిలించుకుని ఫరవా లేదు కాస్త వచ్చింది అని ధైర్యంచిక్కాక,

'ఇక్కడ జాగా చాలటంలేదు మామయ్యా వీధిలోకి తీసుకువెళ్తాను' అని బయలు దేరాడో రోజు. మొదట సరదా పడ్డాడేకాని వీధిలో పదిమందినీ చూసేసరికి, కౌరవ సైన్యాన్ని చూసిన ఉత్తర కుమారుడిలా గజగజ లాడిపోయాడు సూర్యం. అయినా ఓటమిని అంత త్వరగా అంగీకరించటం ఇష్టంలేక ఓసారి తనకి తనే ధైర్యం చెప్పకుని కాస్తదూరం మెల్లిగా తొక్కుకుంటూ వెళ్ళాడు. ఆ తరువాత ఇంక ఏం చేయాలో తోచక ఖంగారు పడిపోయాడు—ఎదురుగా పెద్దపశువులమంద వస్తోంది. పదేళ్ళయినా నిండని అప్పిగాడు ఓచేత్తో గోచీ సద్దు కుంటూ మరోచేత్తో కర్ర వూపుకుంటూ వాటివెనక ఇటూఅటూ పరుగులుపెట్టి వాటిని అదుపులోకి తేవాలని ప్రయత్ని స్తున్నాడేకాని అవి వాడిని కాస్తకూడా లక్ష్యపెట్టకుండా వాటి ఇష్టం వచ్చినట్లే నడుస్తున్నాయి—ఇంక ఆమందని తప్పించు కుని ముందుకి పోగటం తనతరం కాదని ప్రక్కసందులోకి తిరగాలనుకున్నాడు.

అటునుంచి ఒక సినిమాబండి వూరే గింపు వస్తోంది. రామాయణగాథకి సంబం ధించిన ఆ చలనచిత్రంలో ముఖ్యపాత్ర లైన సీతారాముల వేషాలు ప్రత్యక్షంగా వేయించి మరీ ప్రచారం పాగిస్తున్నారు ఆ హాలువాళ్ళు. బాజాలమోత వింటూనే పేపర్లకోసం ఎగబడిన కుర్రమూక వాటి సంగతి వదిలేసి,

'సీత సిగరెట్టు కాలుస్తోందర్రోయ్' అంటూ చప్పట్లుకొడుతూ గెంతులెయ్యటం ప్రారంభించారు. అసలు సంగతేమిటంటే రాములవారి వేషంసరే ఓ పురుషమూర్తి చేత వేయించారు. అతని ప్రక్కనే సీత వేషంలో నిలబడి గంటలతరబడి వూరంతా వూరేగటానికి ఇష్టపడిన స్త్రీని వెతకలేక ఆ వేషంకూడ మరో మొగవాడిచేత వేయిం చారు— టిక్కట్లుపెట్టి డబ్బు వసూలు చేసి చూపించే పేరుమోసిన పెద్ద పెద్ద నాటకాల్లోనే పురుషులు స్త్రీపాత్ర ధరిం చగా లేనిది కాస్తంత సినిమా పబ్లిసిటీకి అభ్యంతరం ఏముంది అనుకున్నాడు హాలు ప్రొప్రయిటరు ఉదయంనుండి గూడులేని బండిమీద ఎండలో నెత్తి మాడుతూంటే అదేపనిగా తిరిగి తిరిగిన సీతారాములు అలసి పోవటం సహజమే మధ్యలో ఆపి హోటల్లో ఇంత టిఫిను కాఫీ ఇప్పించినా అరగంట కోసారి సిగరెట్టు కాల్చుకోటానికి వాళ్ళకి వీలుకాలేదు. అందుచేతే ఇంక మరి ఆగ లేక ఎవరూ చూడకుండా రెండుదమ్ములు పీల్చి అవతల పారేద్దాం అనుకుని ముట్టిం చిన సిగరెట్టు వాడు పారవేసేలోపువే ఈ కుర్రమూక కంటబడటం, అంత అల్లరి జరగటం అయింది—

సందులోకి తిరగబోయిన సూర్యం క్షణం తెల్లబోయి. ఆ తరువాత ఆ గుంపులోకి జొరబడే సాహసం చెయ్యలేక ఎడంప్రక్కకి తిరిగాడు. అంతలోనే అతని కుర్రలోకి

మెరుపులా దూసుకు వచ్చింది ఓ భయం—ఉదయం స్కూలుకి వెళ్తూ చూశాడతను. కొత్తగా ఈనిన వరాహం ఒకటి రోడ్డు ప్రక్క మురికిగుంటదగ్గర నివాసం ఏర్పరచుకొని, ఆ దారిన పోయేవాళ్ళు తన పసికూనల కేమయినా అపకారం తల పెడతారేమోనన్న భయంతో అల్లంత దూరంలో వుండగానే ఫీంకరిస్తూ తనే వాళ్ళమీదికి విరుచుకుపడటానికి సిద్ధపడుతోంది. అదంతా గుర్తువచ్చి గబుక్కున సైకిలు వెనక్కి తిప్పబోయాడు. కాని అప్పటికే అంతా మించిపోయింది. ఏనుగు గున్నలాంటి ఆ వరాహం 'ఫీం' అంటూ చెవులు బద్దలయి, గుండెలు అదిరిపోయేలా అరవటంతో, భయంతో కాళ్ళూ చేతులూ ఆడని సూర్యం సైకిలు తిన్నగా ఎదురుగా వస్తున్న మనిషికి కొట్టించటం, ఆ మనిషి అంటే అదే రామయ్యగారి నౌకరు పేరయ్య సినిమా బండిమీది సీతారాముల్ని చూస్తూ పరధ్యానంగా వుండటంవల్ల సూర్యం సైకిలుని తప్పించుకోలేకపోవటం, అతను అప్పటిదాకా దగ్గరుండి గానుగలో ఆడించుకు వస్తున్న ఆరు వీశల నువ్వులనూనె అతని వంటినిండా వలికిపోయి ఆ పాత్ర దొర్లి అల్లంతదూరాన పడటం అన్నీ క్షణాలమీద జరిగిపోయాయి — నలుగురూ చేరి తనని చావగొడతారేమోనన్న భయంతో ఎలావున్న సైకిలు అలా వదిలేసి పరుగు పుచ్చుకున్నాడు సూర్యం—గేటుదగ్గరే నిలబడి వుండటంవల్ల, జరిగింది కొస్త కొస్త వూహించుకుంటూ పరుగు పరుగున వెళ్ళాడు రంగనాథం. నలుగురూ నాలుగుమాటలూ అంటూంటే, అసలు దోషి ఆ చుట్టుపట్ల లేకపోవటం వల్ల, తనే తప్పుచేసినవాడిలా క్షమాపణ చెప్పుకున్నాడు. అంతేకాదు, ఏ కీలుకాకీలు బిగుసుకుపోయిన మనిషిలా అయిపోయిన ఆ ముసిలి సైకిలుని నడిపించుకుని తీసుకువెళ్ళటం సాధ్యంకాక మరో ఇద్దర్ని బ్రతిమాలి సాయంపట్టి మరీ తెచ్చుకున్నాడు ఇంట్లోకి—

బెదురు చూపులు చూస్తూ అమ్మమ్మ ప్రక్కన నక్కి కూర్చున్న సూర్యాన్ని చూసి,

'బావకేం చేతకాదు' అని సుజాత నవ్వుతూ చప్పట్లు కొట్టటం,

'పిల్లాడి మోకాలు చెక్కుకుపోయి రక్తం చిమ్మింది—కాస్త బాగా వచ్చేనాకా దగ్గరుండి నేర్పుకోవద్దా—వాడేదో నరదా పడ్డాడని వీధిలోకి పంపించేసి వూరుకుంటావా' అంటూ ఆ తప్పంతా తన కొడుకుదే అయినట్లు విసుక్కుంటూ అచ్చమ్మగారు మనవడి మొణుకులకి కొబ్బరినూనె రాయటం,

'అదేం పిల్లాడో, చదువులో తెలివీ లేదు—పనిలో చురుకులేదు— చేతానాత కాని పనికి




తయారయి నిక్షేపంలాంటి సైకిలు విరిచి పోగులుపెట్టాడు.' అని మీనాక్షి అత్తగారికి వినపడకుండా సణుగుకోవటం,

'అబ్బే—పొలం దున్నుకుని బ్రతకటానికి తప్ప మరెందుకూ పనికిరాడు వీడు.' అని రంగనాథం లోలోపలే విసుక్కోటం—ఇవన్నీ ఆతరవాత జరిగిన ఘట్టంతో అరకొలు—

మొదటి సంవత్సరం సూర్యం మార్కులు అంతంతమాత్రంగానే వచ్చినా, రంగనాథం మేష్టారి మేనల్లుడనే విషయం గుర్తువచ్చి పై తరగతిలోకి పంపించేశాడు—ఆ తరువాత సంవత్సరం అతని పేపర్లు దిద్దిన మేష్టర్లకి దిక్కుతోచక రంగనాథాన్నే సంప్రో

అడిగారు. ఏ సబ్జక్టులోనూ పదిహేనుకి మించని అతని మార్కుల్నిచూసి 'మీరు ఎలాంటి మొహమ్మాటం పెట్టుకోవద్దు' అనేవాడతను నిర్మొహమ్మాటంగా.

ఒక్కో క్లాసులో రెండేళ్ళూ మూడేళ్ళూ కూర్చోడం సిగ్గూ, విసుగుకూడ అనిపించటంవల్ల సూర్యం ఇంక స్కూలుకి వెళ్ళనని

కాదు— ఇంట్లోనే చదివి ప్రైవేటుగా మెట్రిక్ పరీక్షకి వెళ్తే బాగుంటుందని అందరూ కలిపి నిర్ణయించారు—పల్లెటూరిలో సౌకర్యం వుండదు కనక ఆ బాధ్యత కూడ అన్నగారిమీదే పెట్టింది శాంతమ్మ.

సుజాతకి పదహారేళ్లు వచ్చాయి. పదకొండవ తరగతి చదువుతోంది. 'ఇప్పటికే చాలా ఆలశ్యం అయిపోయింది- కాలాన్ని బట్టి నేనూ వూరుకున్నాను—ఇంక ఈ వేసంగుల్లో ఏమయినాసరే పిల్ల పెళ్లి చేయాలి' కొడుకుని ఆజ్ఞాపిస్తున్నట్లే చెప్పింది అచ్చమ్మగారు. శాంతమ్మ సంబర పడుతూ తల్లి మాటలకి వంతపాడింది.

అప్పటికి మూర్త్యానికి ఇరవై రెండు నిండాయి. 'ఈ మార్చికి కాదు పై మార్చికి కడతాను' అంటూ మెట్రిక్‌పరీక్షకి వెళ్లటం వాయిదా వేస్తూనే వున్నాడతను— ప్యాసవుతాననే నమ్మకం వున్నా లేకపోయినా ఆ సంవత్సరం తప్పకుండా పరీక్షకివెళ్లి ఆ బెడద వదుల్చుకోటానికే నిశ్చయించుకున్నాడిప్పుడు— ఫలితం ఎలావున్నా ఇంక చదవదలుచుకోలేదు కనక ఆపీటితో అతని చదువు పూర్తయిపోయినట్లే — అందుచేత ఇంక ఎలాంటి అభ్యంతరమూ లేదు కనక అంటే పెళ్లివల్ల చదువు పాడవుతుంది అనే ఇబ్బందేం లేదు కనక అక్షణంగా ఆమూడు ముళ్లూ వేయించేసెయ్యాలని వాళ్ల ముచ్చట.

# సుజాత

మరీ చిన్నతనంలో హాస్యానికీ, చెల్లెల్ని సంతృప్తి పరచటానికీ రంగంనాథం ఆ మాట అన్నది నిజమే—

తరువాత ఎప్పుడైనా తల్లీ చెల్లెలూ ఆ ప్రస్తావన తెచ్చినప్పుడు నవ్వేసి వూరు కునేవాడేకాని తన ఉద్దేశ్యం బయట పెట్ట లేకపోయాడు.

'పిల్లలూ పెద్దవాళ్లవుతున్నారు — వాళ్లముందు ఈ పెళ్లి ముచ్చట్లు ఏమిటీ— మీరైనా చెప్పకూడదూ?' అని విసుక్కుంటున్న భార్యకి,

'సరదాకి అంటున్నారేకాని వాళ్లకి మాత్రం తెలియదూ — వాడి అందం చూస్తూనే వున్నాం కదా, ఇంక పొట్ట కోసినా అక్షరం ముక్కలేదు — ఇంక ఏమొహం పెట్టుకుని పెళ్లిచెయ్య మంటారు — అనవసరంగా మనం వెలితిని పడటం — శాంత కంటెకూడ అమెకి మనస్సు నొప్పించటం — ఎందుకొచ్చిన గొడవ.' అని సర్దిచెప్పేసేవాడు.

కాని ఇవాళ తల్లీ చెల్లెలూ నిజంగా ఆ పెళ్లి జరగాలని పట్టుపట్టటంతో అతనికి ఆశ్చర్యంతో ఉక్కిరి బిక్కిరి అయినట్లే అయింది — మేనరికం అయినంత మాత్రాన చేసితీరాలా—ఇంక మిగతా వేవీ చూసుకో అక్కర్లేదా అనిపించింది.

తల్లీ వాళ్లూ ఆ విషయాలేవీ ఎందుకు ఆలోచించటం లేదు-అతనికి చాలాసేపటి దాకా అర్థంకాలేదు—

కొంతమంది వుంటారు — వాళ్లకి ప్రపంచంలో డబ్బువినా మరేదీ కనిపించదు. ఈ డబ్బు సాధించలేనిదంటూ ఏమి వుండ దనిపిస్తుంది వాళ్లకి. అచ్చంగా అలాంటి వాళ్లకి ప్రతినిధి అచ్చమ్మగారు — ఇంక అలాంటి మనస్తత్వం కలవాళ్లకి భగ వంతుడు ఐశ్వర్యంకూడ ఇవ్వటం జరిగితే ఇంక వాళ్ల ఆలోచనలు ఎలా సాగుతాయో వూహించలేం — ప్రతివాళ్లూ తమ డబ్బు చూసి తమకి దాసోహం అంటారనీ తమ మాటకి అసలు తిరుగు అనేది వుండదనీ ఓ అభిప్రాయం గాఢంగా నాటుకు పోతుంది—అలాంటి దృక్పథంకల శాంత మ్మకి అన్నా వదినలకి మరో ఉద్దేశ్యం వుండవచ్చుననే ఆలోచనయినా రాదు—

పోనీ అప్పుడయినా రంగనాథం ధైర్యం చేసి 'నీ కొడుకు ఒట్టి మడ్డి వెధవ. వాడికి అపరంజి బొమ్మ అపర సరస్వతి లాంటి నా కూతుర్ని ఇవ్వను.' అని చెప్పేసెయలేక పోయాడు.

'ఇప్పుడు దాని పెళ్లికి తొందరేమిటి— నీవాడికయినా ఎన్నేళ్లున్నాయని— ముందీ మెట్రిక్ పరీక్షయినా పూర్తికానీ— అయినా సుజా మరో ఏడాది చదివితే స్కూల్లో వున్న చదువు అయిపోతుంది— మధ్యలో మానిపించటం ఏమిటీ' అంటూ నసిగేశాడు.

'ఇంకో ఏడేమిటి, అమ్మాయికీఏడు మెట్రిక్లేషను పరీక్ష కాదూ.' అంది అచ్చమ్మగారు పదకొండవ తరగతి అంటె ఎస్. ఎస్. ఎల్. సి. అని ఇంక హైస్కూలు చదువు అయిపోతుందనీ ఆవిడికి గుర్తు వుంది.

'కాదులే. ఈ మధ్య క్రొత్తగా సెవెంతు ఫారం అని మరోక్లాసు పెంచారు—'

'అదేమిటి మళ్లీ?' తెల్లబోయింది అచ్చమ్మగారు.

'అంటే అది ప్యాసయినవాళ్ళు మూడేళ్లు చదివితే బియ్యే డిగ్రీ వస్తుంది.'

'సరిపోయింది. నువ్వు చదువుకునే రోజుల్లో రెండేళ్లు ఎఫ్ఫే రెండేళ్ళు బి. య్యే వుండేది—ఇప్పుడో ఏడాది ఇక్కడ కలిపి అక్కడ తగ్గించారన్నమాట.




ఉదయమందలి
తాజాదనము
గంటల కొలది
వుండేలా చేసుకోండి...
దానికి కావలసినది పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్
టాల్క్! ఉదయం స్నానానంతరం
పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్‌ను
వొళ్లంతా అద్దుకొంటే తాజాదనము,
హాయిని గంటల కొలది వుంచుతుంది.
పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ [illegible]
[illegible] పరిమళము వొంటి మీద
రోజంతా నిలిచి వుంటుంది. చెమటను
త్వరగా పీల్చే గుణము గల పాండ్స్
డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ మండే ఎండలలో,
ఉక్కబోసే వాతావరణములో మిమ్మల్ని
సేద దేర్చి, చల్లగా, హాయిగా,
పరిమళంతో వుంచుతుంది. సంవత్సర
మంతా అన్ని వాతావరణములలోను,
మీరు వాడదగినది పాండ్స్
డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్!
Pond's
Dreamflower talc
Dreamflower talc
పాండ్స్
డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ —
ఎంతో మెత్తటి మేలు రకం టాల్క్!
రిజి. ట్రే. మా. పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్

సంబంధం సిద్ధంగా వుంది లేపు పెళ్ళయిపోతుంది అన్నట్లు ఇప్పట్నుంచే చదువు మాన్పించి ఇంట్లో కూర్చోపెడతానంటావు— ఏమైనా చెప్పండి నాన్నగారు.' అంటూ గారంగా తండ్రివంక చూసింది.

'ఇంక ఇప్పుడు కాలేజీలో చేరితే మూడేళ్ళ చదువు పూర్తయిందాకా పెళ్ళి వద్దంటావు — సంబంధం సిద్ధంగా లేక పోయినా నాలుగునెలల్లో కుదురుతుంది— అందాకా వూరికే కూర్చోటం ఇష్టంలేక పోతే సంగీతం నేర్చుకో. అప్పుడు సరదా పడ్డావుగా, నీ నోట్లోంచి మాటరానటం తడవు ఇంట్లో డబ్బుకి ఇబ్బంది పడుతున్నా మూటయాభైపోసి వీణ కొన్నారు. నాలుగు నెలలయినా నేర్చుకున్నావో లేదో చదువు సాగటంలేదు అంటూ దాన్ని మూలపడేశావు...'

'అబ్బబ్బ ఎప్పుడూ అదే గొడవా—అప్పుడేదో సరదా పడ్డానేకాని నాకు సంగీతం రాదసలు. వచ్చే చదువు కాస్తా మానేసి రాని సంగీతంతో కుస్తీపట్టమంటుంది అమ్మ.' తండ్రి కుర్చీవెనక రెండుచేతులూ వేసి చిన్నపిల్లలాగు నవ్వటం మొదలు పెట్టింది సుజాత,

'ఆలోచిద్దాంలే...' అన్నాడతను పుస్తకం పుటలు ఇటూ అటూ తిరగేస్తూ.

'ఆలోచించటం కాదు — ఊఁ అనండి — నా ఫ్రెండ్సంతా కాలేజీలో చేరుతున్నారు— నేనొక్కదాన్నీ ఈ సెవెంతు ఫారం సర్టిఫికేటు పెట్లో దాచుకుని ఇంట్లో కూర్చోనా...'

'అలాగే అన్నాను కదమ్మా.' చిరునవ్వు పెదవులమీద తొణికిసలాడుతూండగా తల తిప్పి చూశాడు.

'బలే. బలే. నాన్నగారు ఒప్పుకున్నారమ్మా.' సంబరంగా గెంతుతూ చప్పట్లు కొట్టింది సుజాత.

తండ్రీ కూతురూ కలిసి తనని ఆట పట్టిస్తున్నారని ఉడుకు మోత్తనం వచ్చింది మీనాక్షమ్మకి.

'అంతే ఇంక — మీ అలుసు చూసుకునే అది అలా ఎగురుతోంది - సరే పోనీ అందరూ ఉద్యోగం చేయ్యటం కోసమే చదువుకోటం లేదు అనుకుందాం — మరింక అలాంటప్పుడు కాలక్షేపం కోసమే కదా— ఓ నలుగురు అమ్మాయిలుంటే, వాళ్ళందరికీ సంబంధాలు కుదిరేసరికి బోలెడు టైము పడుతుందని ఈలోగా అందర్నీ వూరికే ఇంట్లో కూర్చోపెట్టుకోటం ఎందుకనీ చదువుల్లో పెడుతున్నారు. మనకలాంటి బాధేం లేదు - హాయిగా అనువైన సంబంధం చూసి...'

'పోనియ్యొద్దు — ఆడపిల్లల సరదాలు ముద్దు ముచ్చట్లు అన్నీ చిన్నతనంలోనే— పెళ్ళయింతరువాత మొగుడూ అత్తా ఆడబిడ్డలూ అంటూ సంసార జంజాటంలో పడి కుడితిలో పడ్డ ఎలకలా కొట్టుకోటమే కాని, వాళ్ళ మనస్సు విప్పి చెప్పుకోటానికి వ్యవధే వుండదు...' అప్పుడే అమ్మాయిని అత్తవారింటికి పంపించేస్తున్నంత దిగులుగా వుంది అతని గొంతు. చెయ్యి వెనక్కి చాచి ఆప్యాయంగా కూతురి చెయ్యి నిమురుతూ వుండిపోయాడు.

విస్తుపోయి, బుగ్గలు నొక్కుకుంటూ 'అబ్బ. ఎన్ని ఖబుర్లు చెప్పారండీ— మీ కూతురికి పెళ్ళిచేసి అత్తవారింటికి పంపించాలనేసరికి మీ కిన్ని ఆలోచనలు వచ్చాయి— మరి ఆనాడు మేమంతా అలా వచ్చినవాళ్ళం కాదూ—' అంటూ యెత్తి పొడిచింది మీనాక్షమ్మ.

అతను తల్లిమాటకి ఎదురు చెప్పలేక భార్యను మనస్సు నొప్పించిన సందర్భాలు చాలా వున్నాయి మరి. ఇవాళ ఆమె ధైర్యంగా ఆమాట మొహంమీదే అనేసరికి అదంతా గుర్తువచ్చి సిగ్గుపడుతున్నవాడిలా నవ్వేసి వూరుకున్నాడు.

(ఇంకా వుంది)

# మహీధరోక్తులు

మహీధర నళినీమోహనరావు

నిమ్మరసపు వాతి నేత్ర దృష్టము కాదు
వేడిచేసినపుడు జాడ తెలియు
కష్టసమయమందు కనిపించులోగుట్టు
హృదయవర్తి యిూ మహీధరోక్తి.

తలుచుకొన్న హితులు కొలమారుసని
యండ్రు
కోట్లకొలది జనులు కొలుచుచుండి
కుందునేమొ శివుడు కొలమారి పలు
మార్లు!
హృదయవర్తి యిూ మహీధరోక్తి.




దొంగవర్తకమున దోచిన సొమ్ముతో
గుడులు కట్టి మెప్పు పడయగలరె?
మాతపుట్టినిల్లు మామకుతెలియదా?
హృదయవర్తి యిూ మహీధరోక్తి.

సుఖము లేదు లేదు సుఖరోగములలోన
నేతి బీరలోన నేయిలేదు
ధర్మ మసలులేదు ధర్మాసుపత్రిలో
హృదయవర్తి యిూ మహీధరోక్తి.

లేకకైన నిల్లరికపు టల్లునకైన
పరమ శుంఠకైన పండకైన
తెలుగు పంతులన్న పలుసు మిక్కుట
మయా!
హృదయవర్తి యిూ మహీధరోక్తి.

'ప్పు - రెండేళ్ళ క్రితం దాకా అసలు మామిడికాయ కొనుక్కుని ఎరగం—ఊర గాయకి కాయంతా కాంతమ్మే పంపించేది పాపం—పదిరూపాయలు పెట్టి కొనుక్కున్నం దుకు కాదు కాని ఏమిటో కోపం తెచ్చుకో టానికయినా అర్థం వుండాలి — చదువు సంధ్యా, ఉద్యోగమూ మానుకోకుండా పిల్ల నెవరిస్తారనో తనలో తనే అను కుంటున్నట్టు కాస్త పైకే గొణు క్కుంటూ చేతిలో ముక్కలు గంపలో పోసింది మీనాక్షమ్మ.

భర్త, కూతురూ ఏమీ సమాధానం చెప్పక పోవటంచేత కాస్సేపటితరువాత తనే మళ్ళీ అంది 'మొన్న సుందరమ్మగారు సంబంధం చెప్పింది సుజాతకి...' అత్తగారు లేకపోవటం వల్ల కాస్త చొరవగానే చెప్పబోయింది కాని భార్య ఇందాకటి ఉపోద్ఘాతమంతా దేని కోసరమో అర్థం చేసుకున్న రంగనాథం, 'మనం ఇవాళే తొందరపడి పై సంబంధాలు మానుకోటం బాగుండదు - అమ్మ పోయి ఆరు నెలలయినా కాకుండా మనం వ్రతం త్రించి ఏదో చేసేశామని కొంత అను కోటమే కాకుండా బంధువులు కూడ దుయ్య బడతారు—మాద్దాంలే — ఈలోగా ముందు వాడికే పెళ్ళి అయిపోతే మరీ మంచిది' అన్నారు. అవతల గది గుమ్మంలో వాలు కుర్చీలో కూర్చుని పుస్తకం చదువుకుం టున్న అతను పుస్తకం మడిచి వెనక్కి వాలి—నచ్చ చెప్తున్నట్టుగా భార్య వంక చూశాడు. ఆవిడ ఏదో అనబోయింది ఇంతలో.

'నేనో ఉపాయం చెప్పనా.' అన్న ముదాత మాటలకి ఇద్దరూ కుతూహలంగా ఆ పిల్ల వంక చూశారు.

'నేను కాలేజీలో చేరతాను. నాకు చదువు సందా తీరుతుంది— ఈలోగా బావ పెళ్ళి అయిపోతుంది.' కళ్ళు చక్రాలలా తిప్పుతూ ఉత్సాహంగా చెప్పింది.

రంగనాథం ముసిముసిగా నవ్వుకున్నారు. కాని మీనాక్షమ్మ మాత్రం వినగానే ముఖం చిట్లించింది.

'బాగుందమ్మా వరస — ఈ చదివింది చాలదా ఏమిటి? నువ్వేం ఉద్యోగాలు చెయ్యాలా ఏమైనానా?'

'ఉద్యోగం చెయ్యటం కోసమె అందరూ చదువుకుంటారా — అయినా అసలేదో










# ఆ స్వచ్ఛమైన
# మనోహరమైన తెల్ల తనానికి




లయన్ బ్రాండ్

## విక్టోరియా
## బ్లూ ఒ ఒ బి (OOB)

(ప్రశస్తమైన ముదురు నీలం)

అవును, కొంచెం విక్టోరియా బ్లూ
ఒఒబి మీ తెల్ల బట్టలకు అద్భుతమైన
ప్రత్యేకత నిస్తుంది! వాటికి మిలమిట్లు కొలిపే తెల్ల
తనాన్ని చేకూర్చుతుంది. మీ చొక్కాలకు, చీరెలకు,
దుప్పట్లకు అటివచ్చే విధంగా అదనపు తెలుపునిచ్చే పద్ధతి!



తయారుచేయువారు: అల్ట్రామరైన్ అండ్ పిగ్మెంట్స్ లిమిటెడ్ అంబత్తూర్, మద్రాస్-58.
సోల్ సెల్లింగ్ ఏజంట్సు: టెంప్ లైన్ ట్రేడింగ్ కంపెనీ, 318, లింగి చెట్టి స్ట్రీట్, మద్రాసు-1.

# ఇంటర్వ్యూ

వెలివల సాంబశివరావు



డిగ్రీ పుచ్చుకొని వూరికే యింట్లో కూర్చోవాలంటే సిగ్గనిపించింది రాజశేఖరానికి. మొదట్లో సంతోషపడి, సంబరపడి వూరంతట్లో తనొక్కడే ఎం. ఏ. సోషయాలజీ యని కాలరు పైకేసుకొని తిరిగినా రానురాను తనకు తానే విసుక్కున్నాడు అంత చదువు చదివి రాళ్ళేమీ తేలేనందుకు.

మొదట్లో తన్నుతాను చూచి చిరాకు పడినా, కొంతకాలానికి లోకులుకూడా తనను చూచి నవ్వుతున్నట్లు, హేళన చేస్తున్నట్లు వూహించుకొన్నాడు. ఒకటి రెండు చోట్ల చెవులారా విన్నాడు.

ఉద్యోగం సంపాదించాలంటే అంత తేలికైన పనికాదని అనుభవం మీద తెలిసికొన్నాడు. ఆ విషయమే అందరికీ చెప్పాడు. కాని నొప్పించలేకపోయాడు. పదిహేను వందలమంది ఇంజనీర్లకే వుద్యోగాలు వూడాయని పేపర్లో పడిన వార్తను పది మందికీ చూపించాడు. నిరుద్యోగసమస్య యెలా యెదురౌతున్నది సోదాహరణంగా పదిహేను నిమిషాలు మాట్లాడాడు. ఎదుటి వాళ్ళు తనను అసమర్థుని క్రింద జమ కట్టారని తెలుసుకొన్నాడు. ఆరోజునుంచి యింటోనుంచి వీధిలోకి వచ్చి రచ్చబండ దగ్గర రాజకీయాలు మాట్లాడటానిగ్గాని పంచాయతీ ఆఫీసులో పిచ్చాపాటీ మాట్లాడటానిక్కాని అతనికి మనోధైర్యం చాలక పోయింది. ఆత్మాభిమానం దెబ్బతిన్నది.

అన్నయ్య అడగకముందే కాఫీ తెచ్చి అందించే చిన్నారిచెల్లెలు చీటికి మాటికి కయ్యానికి తయారైంది. పదిసార్లు ప్రతిమాలించుకొన్నా చెప్పినపని చేసేదిగాదు. విసుక్కునేది. చిరుబుర్రు లాడేది, యెదురుగా కనిపిస్తే మొఖం మాడ్చుకొనేది.

అదివరకు చెప్పకపోయినా యిస్త్రీ చేయించుకొచ్చే చిన్నాడు, మరీ మొండి కేసాడు. ఆ తరువాత చెంబు యిస్త్రీ చేసికోవాల్సి వచ్చింది రాజశేఖరానికి.

తననుగూర్చి తల్లిదండ్రులు యిబ్బంది పడటం అతడు గమనించకపోలేదు. వాళ్ళే కాని ఆమాత్రం దయ, జాలి తనపై చూపకపోతే యేమయ్యేవాడో! అతనే వూహించుకోలేక పోయాడు.

అతడూ వుద్యోగాన్వేషణలోనే వున్నాడు. పత్రికల్లోని వాంటెడ్ కాలమ్స్‌లోని ప్రతి వాక్యటికీ ఒకటికి రెండుసార్లు చదివి తనకు సంబంధించిన దైతేవెంటనే అప్లికేషన్ పడేస్తున్నాడు.

అప్లికేషన్ పడెయ్యటం — పోస్టుమేన్ కోసం యెదురు చూడటం మొదలైంది. తర్వాత తర్వాత అది వ్రతమైంది. పోస్టుమేన్ యే కార్డిచ్చినా కవరిచ్చినా 'ఇంటర్వ్యూ లెటర'ని ఆరాటపడేవాడు. తర్వాత తర్వాత నిరాశతో నిస్పృహతో దిగాలుపడి కుర్చీలో కూలబడి పోయేవాడు.

తనంత తాను రెండుమెతుకులు తింటే తప్ప, తన ఆకలిని గూర్చి పట్టించుకొనే వాళ్ళెవ్వరూ లేరని తెలిసికొన్నాడు. ఎలాగైనా వీలైనంత త్వరలో వుద్యోగం సంపాదించాలనే దృఢ సంకల్పాన్ని కొన్నాడు.

'ఎలా సాధించటం' అని అంతలోనే నిరుత్సాహ పడ్డాడు.

మరుసటిరోజు వుదయం అందరికన్న ముందుగా లేచాడు. పనులన్నీ ముగించుకొన్నాడు. అతను అందరికన్నా ముందు లేవటం పెద్దవాళ్ళకు ఆశ్చర్యం కలిగించినా పిల్లలు పరిహాసం క్రింద జమ కట్టారు.

'పాపం! రోజూ లేచేసరికి రెండే యిడ్లెన్లు మిగులుతున్నయ్ కదూ...అందుకని...' చిన్నాడు పకపకా నవ్వాడు. చెల్లెలు శారద పల్లవి గూర్చింది. వదిన కూడా వంత పలక్కపోయినా మరదివంక ఆదోలా చూచింది. అక్కడ నిల్చోలేక-కూర్చోలేక పోయాడు రాజశేఖరం.

అంతలోనే గలగలమని శారద యేడుస్తూ అనేస్తున్నమాటలు రాజశేఖరాన్ని నరనరం తినేస్తున్నవి. తాను పెట్టిన రెండు రూపాయిలు పుస్తకంలో కనపడటంలేదని, చిన్నాడు తీసివుంటాడని వాణ్ని తిట్టిపోస్తున్నది. వాడు తీయలేదంటే తీయలేదని ఒట్టు మీద వొట్టేసి చెబుతున్నాడు. అనుమానం అన్నయ్యమీద దాకా పోయింది. శారద అతని దగ్గరగా వచ్చింది. అడగలేక పోయింది. అనుమానం అంత త్వరగా కదలించియలేక పోయింది. రాజశేఖరమే చెప్పాడు తాను తీసినట్లు శారద- లోలోన విసుక్కొంది. 'నాడబ్బులంటే అందరికీ తీపే' అని పైకి అనేసి అక్కడ ఒక్కక్షణంకూడా వుంటానికి యిష్టంలేక రుసరుసలాడుతూ బుసలు కొట్టుకొంటూ వెళ్ళింది.

ఏమీ మాట్లాడలేని స్థితిలో మౌనంగా వెళ్ళిపోయాడు రాజశేఖరం.

* * *

'ఇంటర్వ్యూ' 'ఇంటర్వ్యూ' వచ్చింది అన్నయ్యకు అని చిన్నాడు, శారద యిల్లంతా పందడి చేశారు. యెగిరి గంతేసారు. ఎవరికి వారు ముందుగా ఆ లెటర్ను అన్నయ్యకు అందించాలనే సంతోషంతో పోట్లాడుకున్నారు. గిల్లుకున్నారు. గిచ్చుకున్నారు. తిట్టుకున్నారు.

కిటికీలోగుండా నిర్లిప్తంగా చూస్తున్న అన్నయ్యకు అందించారా లెటర్ను- తీసికొన్నాడు. చదివాడు- ఒక నిట్టూర్పు విడిచాడు.

'నా పుస్తకంలోని రెండు రూపాయిలు తీసికెళ్ళావని యేదేదో అన్నాను. నన్ను క్షమించు బ్రదర్.' అంది చెల్లెలు శారద చేటంత ముఖాన్నిండా నవ్వులు చెరిగిపోస్తూ.

'అన్నయ్యా! నీవు చెంబు యిస్త్రీ చేసికొంటుంటే నా కెంతో బాధగా వుంది. నీ ప్యాంట్లూ షర్టులూ యిప్పుడే పోయి ఐరన్ చేయించుకొస్తాను. సరేనా! టాటా' అంటూ చిన్నాడు సమాధానం కొఱకు యెదురు చూడకుండా వెళ్ళిపోయాడు.

వారి అమాయక పసి హృదయాలను లోలోన వూహించుకొని తీయని అనుభూతి పొందాడు. లాలనగా చెల్లెలు తల నిమిరాడు. అన్న మనస్సులోని ఆప్యాయత వూహించుకోలేని శారద నిండుగా నవ్వుకోలేక పోయింది.

'అన్నయ్యా! ఈ డ్రస్‌తో స్కూల్ కెళ్ళాలంటే నాకు ఛీ యనిపిస్తున్నది. నీకు వుద్యోగం రాగానే 'శారీ' తీసుకు రావాలి' అంది శారద.

'పిచ్చితల్లీ! తప్పక తెస్తాను!' అన్నాడు ఆర్ద్రంగా.

ఆ రోజే రెండుగంటలకు ఇంటర్వ్యూ. అప్పటికే ఒకటి కావొస్తున్నది. గబ గబ పనులు ముగించుకొని ఇంటర్వ్యూకి బయలుదేరటానికి సిద్ధమయ్యాడు. వదిన్ను యెదురుగా రమ్మన్నాడు. 'క్షేమంగా వెళ్ళి లాభంగా రమ్మనమని' ఆశీర్వదించింది యెదురుగా వస్తూ.

* * *

'రాత్రి ప్రొద్దుపోయిన దాకా రాజశేఖరం యింటికి రాకపోయేసరికి యింట్లో వాళ్ళందరికి యేమీ తోచలేదు. ఎవరికి వాళ్ళు పనులు చేసికొని పోతున్నా, అతని మాట అందరి నోళ్ళలో నానుతూనే వున్నది.

పెందలాడే అన్నం తిని సందకాడే కోడి కూడలా నిదరపోయే చిన్నాడు అన్నం మాని నిదుర వాయిదా వేసాడు.

శారద తాను కొనుక్కోబోయే చీర రంగును సెలక్టు చేసికోలేక తికమక పడిపోతూ అలాగే కూర్చుండిపోయింది.

తాను యెదురు వెళ్ళినందుకు జరిగే ఫలాన్ని వినాలని లోలోన తహతహ పడుతూ మాధవి అలాగే మదనపడుతూ కూర్చుండిపోయింది.

కొడుకు యిన్నాళ్ళకొక వుద్యోగంలో చేరబోతున్నాడనే సంతోషంతో — ఆ శుభవార్త చెప్పుడు చెవిని వేసుకొందామనే సంతృప్తితో తల్లి కళ్ళల్లో వత్తులేసికొని వుంది.

రాజశేఖరం వచ్చాడు.

చెరువులోని కలువలు విచ్చుకొన్నట్లు అందరి మొఖాల్లోను ఆనందం విచ్చుకొంది- అది త్రుటికాలంలో మాయమైంది, మెదలకుండా మౌనంగా, విదానంగా మెట్లెక్కి పోతున్న రాజశేఖరాన్ని చూచి,

'ఏమైంది రాజా' అంది తల్లి.

'కాయా పండా మఱదీ?' వదిన కుతూహలంగా అడిగింది.

చిన్నాడు, శారద ప్రశ్నలవర్షం కురిపించటానికి ముందుకురికారు కాని, అన్నయ్య ముఖం చూచి తమకు తామే వుపసంహరించుకొన్నారు.

ముభావంగానే రాజశేఖరం పైకెళ్ళిపోయాడు.

తల్లి మళ్లీ మాట్లాడించలేదు.

మాధవి మనస్సులో భయపడింది. తాను యెదురుగా వెళ్ళినందుకు తనను గూర్చి, అత్తగారేమనుకొంటారో ననే వేదన, మరది యేమని నొచ్చుకుంటాడో ననే ఆవేదన ఆమెను క్రుంగతీసినవి. జరిగిన విషయాన్నిగూర్చి తెలిసికోవటం ఆమె కర్తవ్యంగా భావించింది. వెళ్ళి రాజశేఖరాన్ని అడిగింది. వదినపట్లగల గౌరవం ప్రేమ చొప్పన రాజశేఖరం విషయాన్ని దాచలేక పోయాడు.

'ఇంటర్వ్యూకి వెళ్ళలేదు వదినా ?'

'ఎందుకని?' ఆశ్చర్యపడింది మాధవి.

'ఇంటర్వ్యూకి నేనూ మరో అమ్మాయి వెళ్ళాం. ఆ అమ్మాయి చాలా బాధల్లో వున్నట్లు, పెద్ద కుటుంబభారం ఆమె కున్నట్టు చెప్పింది. ఆమె పరిస్థితులన్నీ విన్నతరువాత నాకా ఇంటర్వ్యూకు వెళ్ళదామనే వుద్దేశమే కలుగలేదు. విరమించుకున్నాను వదినా' అన్నాడు రాజశేఖరం తానొక మంచిపని చేసాననే సంతృప్తితో.

మాధవి మాట్లాడలేదు. క్రిందికి దిగి వచ్చింది.

సంగతి సందర్భమూ అందరికీ తెలిసింది.

* * *

(44 వ పేజీ చూడండి)

## గణపతి ఇన్ "లౌ"

Jayadev..

ఓ రోజున ఉండ్రాళ్ళు తెగతిని బొజ్జ బరువును నడవలేక ఓ మూల కూలబడి వున్నాడు గణపతి



ఉన్నట్టుండి అక్కడ ఓ మెరుపు తీగ తళుక్కుమంది!!




అనుకుని ఆ అమ్మాయి వెంట పడ్డాడు అడ్రసు కనిపెడదామనో.....




ఇంతలో ఆ అమ్మాయి ఎటో మాయమయింది!







ఇంతలో అటువు నారదుడొచ్చాడు










అసలేం జరిగిందో చెప్పు?


గణపతి మెఱుపు తీగ గురించి చెప్పాడు
అదా సంగతి - ఇప్పుడర్థమయింది - నువ్వా పిల్లను ప్రేమించావ్ ——— ఔనా?


ఔను ఫస్టు సైట్ లోనే ఆ పిల్లకు నా గుండె ఇచ్చేశా
ఆ అమ్మాయి ఎవరన్నది నీకు తెలుసా?


ఊహూ! ఇలా పోలికలు చెప్పగల్ను


గణపతి అన్ని వివరాలూ కొలతలతో సహా చెప్పాడు నారదుడు త్రిలోక సంచారి గనుక.........
ఉండూ - ఆ కొలతలున్న అమ్మాయి అడ్రసేమిటో చూడనీ!!


నారదుడు డైరీ రెఫర్ చేసి అడ్రస్ చెప్పాడు!!
థాంక్స్! ఇలా పరిచయం లేని ఆ పిల్లతో మాట్లాడ్డం ఎలా?


గణపతి నారదుడి సహాయం కోరాడు
బాబ్బాబు! ఇది నీ తంబూరా కాదు చేతులనుకో!


ఆఖరికి నారదుడు సరేనన్నాడు —
తిన్నగా ఆ అమ్మాయింటికే బయల్దేరాడు


అమ్మాయి వాళ్లింట్లో —
నారాయణా.... ఓ బాలికా నీకో సంగతి తెలుసా?
నాకేం తెలియదు నువ్వల్లా స్వామీ

హో హో హాల్లు-హాలు- గణపతి లేడూ- నిన్ను ప్రేమించాడు!! - నిన్ను కలుసుకోవాల ----.

మరు క్షణం భూమి పగిలింది

నారదుడు చెంప తడుము కున్నాడు - చెంప మీద ఐదు వేళ్ళు !!!!!

నారదుడు పరుగున గణపతి దగ్గరికి వచ్చాడు

పరేషు నాయనా! నేను అర్జంటుగా-వైద్యుడిని చూడాలి వస్తా !!

అంటూ దౌడు తీశాడు

ఇదుగో ఆ అమ్మాయిని చూశావా? ఏమంది — ఛీ — వట్టి దద్దమ్మ! ఇతే ఇప్పుడేం చెయ్యాలి ..... ఓ ప్రేమలేఖ రాస్తేనో

వెంటనే! వ్యాస మహర్షి భాషలో ఓ లౌ లెటర్ రాసి పోస్టు చేశాడు గణపతి

మర్నాడే రిప్లయి వచ్చింది

హా నా ప్రేమ ఫలించింది సాయంత్రం-పారిజాత- వనంలో కలవమని- రాసింది

సాయంత్రం పారిజాత పార్కులో ........

దారిలో ఓ పిల్లి ఎదు రైంది - దాన్ని తప్పిం చుకు వచ్చే సరికి లేటు యింది! క్షమించు !!

ఆ అమ్మాయి ఎలుక ను చూసి కెవ్వున కేక వేసింది —

ఛీ ఛీ ఇదంటే నాకు తెగ భయం! ఇది మీకు వాహనమా


జైనూ- ఏం? నీకది నచ్చక పోతే, దాన్ని అమ్మేసి ఓ చిన్న తేరు కొంటూంటే సరేనా?!


ఏవిటో "స్మాల్ తేరా" హు... అవి తయారై నట్టే- మీరూ కొన్నట్టో— అది సరే మీ తాతలు ఉద్దేశ్యం??


నిన్ను పెళ్ళాడ్డానికే — ప్లీజ్- నా ప్రేమ కాదనకు నువ్వేం ప్రైమస్టా చేస్తా నిజంగానే భూప్రదక్షిణా చెయ్యాలా??


అదేమీ చెయ్యక్కర్లా — నన్ను పెళ్ళాడ్డానికి మీకేం అర్హతలున్నాయి?
అర్హతలా అవేమైనా కట్టెడం దాయను బాయీ? వీశ వెలెంటా?


మీరు పొట్టి- నేను పొడుగూనూ — మనకి జోడు కుదరదు!!


మీ మీద కోపం వచ్చి మీ చెవులు మెలిమేలంటే అవి చాటంత వెడల్పు!! నా చేతులకందవు!


మీకు ఖండరాళ్ళు ఇష్టం - నాకు అడవి- కోళ్ళు ఇష్టం - మనకి పొత్తు కుదర్దు!


కొబ్బుట్టు-వస్తాం! సెలవ్!!


అంటూ ఆ అమ్మాయి వెళ్ళిపోయింది — ఛీ! ఈ ఆడాళ్ళని హా ఛస్తే ప్రేమించకూడదనుకున్నాడు గణపతి

# ఇంటర్వ్యూ

(39వ పేజీ తరువాయి)

తిన్నగా ఆ అమ్మాయి యింట్లోకి రావటం అక్కడి వాళ్ళందరికీ ఆశ్చర్యం కలిగించింది. మాధవి సాదరంగా ఆహ్వా నించింది. శారద సరదాగా అనుసరించింది. ఆ అమ్మాయిని చూస్తూ విస్తుపోతూ నిబ్బరంగా వుండిపోయింది పార్వతమ్మ. చిన్నాడు చోద్యంగా చూడసాగాడు.

'నమస్కారమండీ' అన్నది ఆ అమ్మాయి.

ఆశ్చర్యంలో మునిగి తేలుతున్న పార్వతమ్మ పైకి తేలేసరికి, మరల ఆ అమ్మాయి మాట విని మరింత ఆశ్చర్యానికి లోనై, మరికొంతసేపు తేరుకొని తెప్పరిల్లేసరికి ఆ అమ్మాయి రెండో గడప దాటి మధ్య హాల్లోని కుర్చీలో కూర్చొని వుండటం గమనించింది. మాధవిని యేవేవో అడుగు తున్నది. ఆమేదో చెబుతున్నది. ఇద్దరూ నవ్వుకుంటున్నారు.

పార్వతమ్మ ఆ గదిలో గుండా పోకుండా మరో దారిని వంటగదిలోకి వెళ్ళి శారద చేత కాఫీ పంపించింది.

బ్రతిమాలించుకోకుండానే వచ్చినమ్మాయి కాఫీ త్రాగేసింది, మాధవికన్నా ముందు గానే. కాఫీకప్పు ఒక ప్రక్కగా పెట్టి ఆ అమ్మాయి వంటగదిలోకి క్యాడా తొంగి చూడటం కాకుండా — అమాంతం ఆ గది లోకివెళ్ళి క్రిందే చతికిలబడింది. ఆ చొర వకు పార్వతమ్మ తికమక పడిపోయింది. తుకతుక వుడికినట్లు మనస్సు తయా రైంది.

'ఎవరమ్మా మీరు?' అని సాధ్యమైనంత నిబ్బరంగా, నిశ్చలంగా అడిగింది పార్వ తమ్మ.

'నేనూ— మీ అబ్బాయిగారూ...'

'ఆ...' అంది ఆత్రంగా — ఆదుర్దాగా పార్వతమ్మ.

'ఒకే కాలేజీలో చదువుకున్నామండీ. నా పేరు రాజేశ్వరమ్మ. మా నాన్నగారికి పెద్ద 'ఫరమ్' వుందండి గుంటూరులో. నేను మా అక్కయ్యదగ్గర హైదరాబాద్‌లో వుంటున్నాను. మా అమ్మను నాన్నను చూచి పోదామని వచ్చాను. అంతలోకే మీ అబ్బాయిగారిక్కడే వుంటున్నారని తెలిసి చూద్దామని వచ్చాను' అంది నిర్భయంగా— పార్వతమ్మ కళ్ళలోకి చూస్తూ.

పార్వతమ్మకు ముళ్ళమీద నిల్చొన్నట్లు, గాలిలో తేలిపోతున్నట్లు, నేల క్రుంగి పోతున్నట్లు, అంతా వింతగా కని పించింది.

'మా అబ్బాయి పేరేమిటమ్మా' అని అడిగింది, యేదో అనుమానం మనస్సును పీక్కుతింటుంటే. ఆ అబ్బాయి పేరు చెప్ప టానికి ఆ అమ్మాయి చాలా సిగ్గుపడింది. పనేమిగా పేరు చెప్పలేదు. పెదాలు ఆడించిందిగాని మాట పెగిలి, పెదవి దాటి రాలేదు. పార్వతమ్మ అనుమానం బలకొమ్మ లేసింది.

మాధవిమీద కూడా కోపం వచ్చింది. తెగకుండా వాళ్ళ సంభాషణ సాగిపోతున్నది. శారద కూడా వాళ్ళతోపాటే కబుర్లు పెట్టింది. పట్టించుకోకుండా పార్వతమ్మ మౌనంగా వుండిపోయింది.

'వారు రాలేదు: మళ్ళీ వస్తాను. వచ్చి పోయానని చెప్పండి' అని మాధవి దగ్గర పార్వతమ్మ దగ్గర మరీ మరీ చెప్పి సెలవు తీసికొని వెళ్ళింది రాజేశ్వరమ్మ. వెళ్ళి పోతూ శారదకు 'మంచి అమ్మాయ్' అనే సర్టిఫికెట్ ఇచ్చిపోయింది. శారద మురిసి పోయింది. పార్వతమ్మకు మనస్సు వో పట్టాన లేదు.

'అమ్మాయ్ మాధవీ! ఆ అమ్మాయి వచ్చిన పనేమిటే' ఆదుర్దాను అణచుకోలేక అడిగింది పార్వతమ్మ.

'అదే అత్తయ్యా! మన రాజూ — ఆ అమ్మాయీ ఒకే కాలేజీలో చదివారంట. రాజంటే ఆ అమ్మాయికి — ఆ అమ్మా యంటే రాజుకి తగని ఇష్టమంట. మరి వాళ్ళిద్దరు ప్రేమించుకొన్నారేమో...నాకు మాత్రం అనుమానంగానే వుంది' అంది మాధవి పొయ్యిలోకి పుల్ల లెగదోస్తూ.

పార్వతమ్మ అనుకొన్నదంతా అయిందని కుప్పలా కూలిపోయింది.

* * *

సాయం సమయం. చల్లగా గాలి వీస్తున్నది. గాంధీ పార్కులోని అశోక వృక్షములమీదుగా వచ్చే గాలి కెరటాలు — బీటలు వేసిన మానవ హృదయంలోని వేడిని సహించటం పాలుపోటంలేదు. సాయంత్ర మయ్యేసరికల్లా అక్కడ జనం చేరు తుంటారు. ఒకప్పుడు [illegible]రికి కుప్పలతో

# ఇంటర్వ్యూ

పందుల గుంపులతో కంపుకొట్టే — ఆ పార్కు యిప్పుడు పదిమంది కూర్చోటానికి వనందుగా వున్నది. గుంటూరు జిల్లా కేంద్రమైనప్పటికీ — యెన్నో విద్యాసంస్థ లున్నప్పటికి — యెందరో మహానుభావు లున్నప్పటికీ — మొన్న మొన్నటిదాకా ఆ పార్కును గురించి పట్టించుకోకుండా వుండటం ఆలోచించ వలసిన విషయమే' అనుకొన్నాడు రాజశేఖరం.

తానొక ఆఫీసరైతే — తనకు తోచిన తీరులో — సుందర కాశ్మీరంలాగా చేయక పోయినా— ముచ్చట గొలిపేటట్లు చేయగల ననే ఆలోచనతో—ఆ పార్కులో కూర్చొని, నిల్చొని, అటూ యిటూ తిరిగి ప్లాను గీసాడు. పథకం వేసాడు. యేదో విధంగా ఆ పార్కుకి పనిగట్టు కెళ్ళాడు కొన్నాళ్ళు.

ఒకరోజు జిన్నాటవర్ మీదుగా నడిచి వస్తుంటే అతన్ని పలకరించిం దామె.

'నమస్కారమండీ! మీ మేలు మరిచి పోలేను. మీరెగాని ఇంటర్వ్యూకొస్తే నాకు వుద్యోగం దొరికేదిగాదు—మా అమ్మ దక్కేది కాదు మా యిల్లంతా గట్టె క్కిందీ వచ్చే దిక్కులో వదేది' అని చెప్పకుపోయింది.

'రండి! హోటల్లో కెళ్ళి కూర్చుందాం' అని రాజశేఖరం హోటల్‌వైపు దారితీసాడు. ఆ అమ్మాయి మారు మాట్లాడలేదు. అతని వెనకాలే నడిచింది.

'అన్నట్టు! మీ పేరు...'

'రాజేశ్వరి...ఎందు కంతసుమావంవచ్చిం దండీ' అంది కాఫీ చప్పరిస్తూ.

'మరేం లేదు లెండి...వూరికె అడిగాను' అన్నాడు రాజశేఖరం.

'మీరుగాని ఇంటర్వ్యూకి వచ్చివుంటే నా జీవితమింత వున్నతస్థితికి వచ్చేది కాదండీ'

మా అమ్మకు మందు కొనిచ్చే శక్తి వుండేది కాదు. ఆ వుద్యోగమే లేకుంటే మా చెల్లెళ్ళు చదివించుకొని వుండేదాన్ని కాదు. అంతంత మాత్రంగా వున్న మా నాన్న ఆరోగ్యం మరీ పాడయ్యేది. మేనే జరుగారు ఎద్దాన్నగా ఒకనెల జీతం యిచ్చారు. ఇంటర్వ్యూకి 'రెండో' ఆయన రాలేదేమని అడిగారు. నాకు తెలియదన్నాను. 'నీవు అదృష్టవంతురాలివమ్మా' అన్నారు. ఆనందించుకొన్నాను.

'ఇంటర్వ్యూకు పిలిచింది నిన్నూ మరో మొగబ్బాయినే' నన్నారు. 'అలాగా' అని నేను ఫ్లైకి ముక్కుమీద వేలేసుకొని, పగలబడి పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వానండీ లోలోన' అని నవ్వింది గలగలా.

బిల్లు చెల్లించాడు రాజశేఖరం.

ఇద్దరూ అనుకోకుండా మాట్లాడు కొంటూ వెళ్ళి స్వరాజ్యమైదాన్‌లో కూర్చు న్నారు.

'మీ అమ్మగారికిప్పుడు కుశలమేగా' అన్నాడు.

'ఆ... మా యింట్లో వాళ్ళందరి ప్రాణాలూ యిప్పుడు కుదుట పడినవి. సమస్యలన్నీ తీరిపోయినవి. మీరుమాత్రమేదో లాగా వున్నారు' అన్నది మాటిగా అతని కళ్ళలోకి చూస్తూ.

'మరేం లేదు...'

'యేదో దాస్తున్నారు...చెప్పండి...' అని అతని రెండుచేతులూ పట్టుకొంది. అతను విడిపించుకోటానికి ప్రయత్నించలేదు. ఆమె సిగ్గుపడింది.

'మొన్న నేను యింట్లో లేనప్పుడు ఒక అమ్మాయి నాకోసం వచ్చిందట...నాకొట్టు మెట్‌నని చెప్పిందట. రాజేశ్వరి అనే అమ్మాయి నాతోపాటు యెవ్వరూ చదువ లేదు'...

'పోనీ కామేశ్వరమ్మ అనే అమ్మాయి వుందా?' అంది గడ్డంక్రింద చేయిపెట్టు కొని దీర్ఘాలోచన చేస్తూ, విచిత్రంగా చూస్తూ వింతగా విస్తుపోతూ.

'ఒకే ఒక్క అమ్మాయి వుండేది... ఆ అమ్మాయిని మాత్రం నేను...'

'ఆ...మీరెంతో మంచివారను కున్నాను. కాఫీకి పిలిస్తే మంచివారనుకొని వచ్చాను. నేను నాకష్టాలను చెప్పుకొన్నప్పుడు మీరు ఇంటర్వ్యూను కూడా లెక్కచేయక మానుకొని త్యాగంచేసినట్లు నటించి, యేదో వూహించుకున్నారు. మీరింత అల్పంనని తలంచుకోలేదు...' అని రుసరుసలతో విలవిల లాడిపోయింది.

'రాణీ...నా మాటవినమ్మా—ఆ ఒకే ఒక అమ్మాయి యిద్దరిపిల్లల తల్లి. ఆమెను నేను పూజ్యభావంతో చూచేవాడిని. పెద్దక్కగా వూహించుకొని, ఆరాధించేవాడిని' అన్నాడు రాజశేఖరం ఆవేశంగా.

'రాజీ...అని పిలిచారు... మీరు నన్ను ప్రేమిస్తున్నారా?' అంది లాలనగా.

'అవును'... అన్నాడు ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ.

'ఆగండి...మీకు ముందే చెప్పాను. మేము పేదవాళ్ళమని...'

'వాళ్ళకు హృదయాలు వుండవా ?' అన్నాడు ఛలోక్తిగా.

'ఆస్తులు వుండవుగా' అంది.

'నాక్కావాల్సింది ఆస్తులు కాదు. మనస్సు మాత్రమే. నేను యివ్వాళ కాక పోయినా రేపో మాపో వుద్యోగం సంపాదించు కొని నా సంసారాన్ని నేను గౌరవంగా నడుపుకోగలను. నిన్ను ప్రేమిస్తున్నాను రాజీ...'

'రాకండి. దగ్గరగా రాకండి ... నాకు కొంత గాథ వుంది. దాన్ని వివరంగా వినండి. నేను తీసికొచ్చే జీతం మీదే మా చెల్లెళ్ళని చదివిస్తున్నాను. మా తమ్ముడిని చదివిస్తున్నాను మా అమ్మను పోషిస్తు న్నాను. మా నాన్నను బ్రతికిస్తున్నాను. మరి వీళ్ళందరూ మీకు భారమైతే... వాళ్ళని లేని కాను' అంది కన్నీరు నిండిన కళ్ళతో.

కన్నీటిని తుడుస్తూ—'అలి రేపువారు ఆత్మబంధువులు గదా' అని బుజ్జగించాడు.

విరిసిన దిరిసెనలా మురిసిపోయింది రాజేశ్వరి.

అంతలో అక్కడికొక 'ప్లయిమవుత్'కారు దూసుకొంటూవచ్చి ఆగింది. కారు ఆగిందే తడవుగా 'బాయ్' కారులోనుంచి గబగబా 'డోర్' తీసి 'రాజేశ్వరి'ని ఆహ్వానించి సీటు చూపాడు. ఆమె సీట్లో కూర్చొంది. రాజశేఖరానికి నోట్లో పచ్చి వెలక్కాయ పడ్డట్లయింది.

'రండి యిది మా మేనేజరుగారి కారు' అని ఆహ్వానించింది.

రాజశేఖరం వచ్చి కూర్చున్నాడన్నమాటే గాని, అతని క్రింద ముళ్ళు పరిచినట్లున్నది.

అతను ఆలోచనల్నుండి తేరుకొనేసరికి కారు పెద్ద బంగళాముందు ఆగింది. బాయ్ వచ్చి తలుపు తీశాడు. రాజశేఖరం, అతనితోపాటు రాజేశ్వరి దిగారు.

రాజశేఖరం ఆమెను అనుసరించటం మినహా మరేమీ మాట్లాడలేకపోతున్నాడు. ఒక విశాలమైన గదిలో కూర్చున్నారిద్దరు. రేడియోగ్రామ్ ప్రక్కనే తన ఫోటో వుండటం చూచి ఆశ్చర్యపోయాడు రాజశేఖరం. అది తన పాస్‌పోర్టు సైజు ఫోటో. అప్లికేషన్ ఫారంతోపాటు జతచేసి పంపినది. అది యెలా వచ్చిందీ వూహించుకో లేకపోయాడు.

రాజేశ్వరి లేచి నిల్చొంది. అప్రయత్నంగా ఆమె కళ్ళలో కన్నీరు పొంగుతూ వచ్చింది. ఆమె పెల్లుబికి వస్తున్న హృదయావేగాన్ని ఆపుకోలేక పోయింది. బావురుమంది. రాజశేఖరం కాళ్ళపై పడింది. అతని పాదాలు తడిసిపోయాయి.

'నన్ను క్షమించండి! నన్ను అపార్థం చేసికోకండి! నేను మీ చరణ దాసిని' అన్నది. అతని కయోమయంగా వున్నది.

'నేను కొన్నాళ్ళుగా అన్వేషిస్తున్న నా జీవిత భాగస్వామి నేడు దొరికాడు. ఇదే మా యిల్లు. ఆ ఫరమ్ మేనేజరే మా నాన్నగారు. మొదట్లో మీకు చెప్పినట్లే చాలామందికి చెప్పాను. వాళ్ళందరూ మీరు చేసిన త్యాగానికి, మీరు చూపిన వుదార హృదయానికి పవిత్ర ప్రేమకూ బహు దూరంగా వున్నారు. మీ యింటికి వచ్చిన రాజేశ్వరమ్మనూ నేనే! మా నాన్నగారు అల్లుడిని నిరయించుకోటానికి 'ఇంటర్వ్యూ' పెట్టారుగాని నిజాయింటుమెంటు గ్గాదు' అంది రాజేశ్వరి.

'ఈ ఆస్తి— అంతస్తులు చూపి నన్ను మభ్యపెట్టటానికా యిక్కడికి తీసికొచ్చింది' అని గబగబా మేడమెట్లు దిగుతున్న రాజశేఖరానికి యెదురయ్యాడు తండ్రి.

'ఆగవోయ్! నీ క్కాబోయే మామగారు నా క్లాసుమేటేలేవోయ్. అతడు కోట్లు సంపాదించాడు. కాకపోతే నేను రామకోటి సంపాదించాను' అన్నాడు రాజశేఖరం తండ్రి నవ్వుతూ.

అప్పుడే కార్లోనుంచి దిగిన పార్వతమ్మ, మాధవి, శారద, చిన్నాడునూ చూచి గబగబా వచ్చి ఆహ్వానించింది రాజేశ్వరి.

పార్వతమ్మ విస్తుపోయి చూచింది.

మాధవి మందస్మితం చేసింది.

శారద 'చిన్నాదినా' అని సరదాగా పిలిచి వరస కలిపింది.

చిన్నాడు క్రొత్తదినవంక వింతగా చూచాడు. మొన్నొచ్చిన రాజేశ్వరమ్మయినామె అన్నాడు.

'అబ్బాయి ఇంటర్వ్యూలో ఫస్టుగా సెలక్టయ్యాడే! అల్లా చూస్తావేం!' అన్నాడు ముసలాయన. ●



# ! లిస్టువేస్తే చూద్దాం

**కె. రామలక్ష్మి**

'ప్రతి ఏటా అనుకుంటాను. ఏమేమి' అంటుంది ఉష. 'కాని కనీసం ఏం చేయాలి చేయాలో, ఏమేమి చేయకూడదో— కాని అన్న వాటి లిస్టొకటి తయారయింది కదా ఏం ప్రయోజనం? ఒక్కటీ జరగదు' సంతోషించు అంటాన్నేను! మనలోని లోపాలనేవి గుర్తించడం కూడా గొప్పేకదా అలా గుర్తించినవాడు, ఎప్పటికేనా వాటిని సరిచేసే అవకాశం రావచ్చుకదా. అందరిదీ తప్పుదారి—ఒక్క నాదే తప్పు అనుకుని పొగే అహంభావులు కూడా తమ దుర్గుణ సంపత్తిని లిస్టేసుకు చూసుకుంటేగాని వారి అహం అణగదు, తిన్నగా అందరినీ చూడాలేరు అనిపిస్తుంది.

అయితే ఇలా ఓ జాబితా తయారు చేయడంతోనే—'పని తీరింది' అన్నా తప్పించుకు పోయే తత్వం ద్యోతకమవడం లేదా అంటుంది ఉష. 'మరీ అంత యిదిగా ఆలోచిస్తే నేమిటోయ్ కనీసం తెలుపు నలుపుల్లో — నీ వెంత సొంపుగా ఉండాలి అన్నది రాసేస్తాం గదా— అసలలా లిస్టులు వేయడంలోనే మేజిక్ ఉంది' అంటాన్నేను. 'నా ముఖం' అని అనకపోయినా అనుకునే ఉంటుంది ఉష 'నీకు నా కష్ట సుఖాలన్నీ రాసేయగానే హృదయం తేలికబడినట్టయింది' అని రాయమా? హృదయంలో గూడుకట్టుకున్న బాధలు వ్యథలు ఎవరితోనేనా పంచుకుంటే హాయిగా ఉంటుంది. అంతమాత్రంచేత వాస్తవాన్నుంచి తప్పించుకో చూస్తున్నాం అనుకోకూడదు. చైనావాళ్లలో ఒక అలవాటుంది — సంవత్సరాదినాడు—గడచిన సంవత్సరపు బిల్లులు, అన్నీ గుదిగుచ్చి తగలపెట్టారట— అంటే అప్పులన్నీ తీరినట్టేనని వారి భావన! పాపం — చైనా పాలవాడు పెరుగువాడు, చాకలాడు!...నీ ముఖం వాళ్లూ అలాగే తగలబెట్టేస్తే — చెల్లు అయిపోయిందిగా' అంటారా అంతేమరి.

నాకో మేనమామ ఉన్నాడు వచ్చిన బిల్లులు అతి శ్రద్ధగా డేటువారీగా ఫైలులో పెట్టి చూసుకుంటాడు— అలా చేస్తే—వాటిని తీర్చినట్టేనని భావించడం కూడా కద్దు. అంతెందుకు అప్పు పట్టు పద్దులో రాసేసే తీర్చేసినంత తేలికగా ఊపిరితీస్తారు నాన్నగారు! బిల్లులు తగలెట్టినంత మాత్రాన, ఫైలు చేసినంత మాత్రాన, మరిచి పోయినంత మాత్రాన తీర్చేసినట్టు అయితే ఎంత బాగుండును కదూ? 'కాని బిల్లులకి డూప్లికేట్లు

పంపి మన సుందర స్వప్నం కల్లోల పరుస్తాగే చిట్టితల్లీ' అంటుంది వేలకి కాలూని నిలిచే తత్వంగల ఉష తేలిక బడ్డట్టయిన హృదయం కాస్తా డూప్లికేట్ల జ్ఞాపకంతో టన్ను బరువు అధికం అవుతుంది.

ఈ తత్వానికి ఒక్కటే విరుగుడుట — దాన్ని కుదుర్చుకోడానికి స్వంతంగా ప్రయత్నించడమే— సులభ మార్గం లేదు. కోప తాపాలు ఆత్మ స్థయిర్యం వలన పోవాలే గాని కాగితంమీద రాసి పడేస్తే పోతాయా పోవు. బిల్లులు అప్పతీరిస్తే అయిపోతాయి గాని, అవి రాకుండా ఉండడానికి వేరు మార్గం లేదు ... పొదుపుమీద రేడియో నాటకం విని చచ్చేటంత కోపంవచ్చి 'ఆ మనిషిలాంటి మనిషి ఉండడు — అంటూ నానాతిటూ్లా తిట్టి ఆ కాగితం కాస్తా బోయిలర్‌లో పారేసానే' అవే నన్ను చూసి ఉషలాంటి వాళ్లు నవ్వుకోవచ్చు ... ఈ మాటుసారి రేడియో కాని బద్దలు కొట్టేవు జాగ్రత్త— 'అప్పచేశారా?' అవే నాటకం విని, అంది ఉష. నిజమే—జ్ఞాపకం ఉంచుకోవాలి—కనీసం రాసేనా పెట్టుకోవాలి.

అసలిదంతా ఎందుకొచ్చింది? వారు అన్నారుకదా ఇవ్వవలసినవన్నీ లిస్టు రాయి చూద్దాం అన్నారు— ఎప్పుడు ? సరదాగ ఓచీర కొన్నానండి పాతిక ఇవ్వాలి అన్నప్పుడు! ఆకోపం కోపంతో లిస్టు రాయడం ప్రారంభిస్తే—మైళ్ళు దాటుతూంది. సాయంత్రానికి దాన్ని చూపెట్టే ధైర్యం పోయింది. ఎవరో చెప్పినట్టు చిరునవ్వుతో వారిని ఆహ్వానించి లిస్టుసంగతి చీరసంగతీ మరిచేలా చేద్దామనుకున్నాను. కాని వారా మరిచేది? ముద్దుగా కాఫీ అందిస్తే లిస్టు రాశావా? తీసుకురా చూద్దాం అన్నారు... తెస్తున్నా—తెస్తున్నా కాస్త ఆగండి. ఆలిస్టు చూసి కాఫీకప్పు నేలపడింది. ఇవన్నీ మనం ఇవ్వవలసినవేనా? అన్నారు— అందుకే చెప్ప లేదు అన్నాను — అంతమాత్రం చేత అవి తీరుతాయనా? కాదు — ఊరా అనవసరపు సీను తప్పించుకోడానికి ... వారికి గుండె పోటు వచ్చాకగాని తెలియలేదు— అప్పలు అనంతంగా పెంచడం డేంజరని— అందుకే ఏవారం కావారమే లిస్టువేసి కొద్దో గొప్పో తీర్చేయ్యాలని నిర్ణయించాము—మనలో మన మాట వారానిదే మూరెడు! ఇక సంవత్సరానిదెంత లిస్టు తేలుతుందో ఊహించారా? ●

# రష్యన్ ఛలోక్తులు

ఒక త్రాగుబోతు తన రక్తం పరిశీలించమని డాక్టర్ని అడిగేడు. పరిశీలించిన రెండోరోజు ఉదయం డాక్టర్ని త్రాగుబోతు మీ ఉద్దేశం ఏంటని ప్రశ్నించేడు 'మీ శరీరంలో ప్రవహించే బ్రాందీలో అక్కడక్కడ కొన్ని రక్తం ముక్కలు కనిపించాయండి నాకు' అని ఆశ్చర్యపోతూ జవాబిచ్చాడు డాక్టరు.

* * *

ఒక చిన్న రైలుస్టేషన్‌లో ప్రయాణీకుడు ఒకడు రైలుకోసం నిరీక్షిస్తున్నాడు. రైలు ఎంతసేపటికి రాక పోయేటప్పటికి అతనిలో ఓపిక నశించి వెనక్కు బయలుదేరాడు. 'అదేంటి! ఇంక రైలు వచ్చేస్తుంది ఇప్పుడు బయలుదేరుతున్నారేంటి?' అన్నాడు స్టేషన్‌మాష్టరు. వ్య:—'మీకు ఎక్కడ నుంచి తెలిసింది ఆ విషయం?' స్టే మా:— 'ఎందుకంటే ఇంజన్ డ్రైవరు కుక్కపిల్ల వస్తోంది. అతన్ని కలియడానికి'

* * *

ఒకచోట ఇద్దరు స్నేహితులు కలుసుకున్నారు. 'నీకు తెలుసా! ఇప్పటి ఎండలకు మా ఊర్లో సీతాకోకచిలుకల రెక్కలు కూడా కాలిపోతున్నాయి' 'ఆ! మా ఊళ్లో ఈ ఎండలకి కోళ్ళకి ఐస్‌క్రీమ్ తినిపిస్తున్నాం. లేకపోతే అవి ఉడికినగుడ్లు పెట్టేట్టున్నాయి.'

* * *

'పదండి— ఇవాళ రెష్టారెంటుకు వెళ్లి చచ్చేంతవరకు తాగేద్దాం' అని రోడ్డున వెళుతున్న కొంతమంది స్నేహితులు అనుకొంటున్నారు. ఇది విన్న ఒక వ్యక్తి వాళ్ళలోకలసి 'పదండి నన్ను కూడా ఇవాళ మీతో చావనీయండి' అన్నాడు.

* * *

'మేరీ! నీతో ఒక ముఖ్యమైన విషయం చెప్పాలి. నేను వివాహితుడ్ని' అన్నాడు ఒకతను.

'ఓస్! అంతేకదా ఎంత భయపెట్టేశావ్! నీకారు దొంగిలించేశారని చెప్తావేంటో అనుకున్నా' అంది మేరీ.

* * *

'నీకు తెల్సోయ్! మా ఆవిడ ఎంత తెలివైందో? తన ఈవినింగ్ గౌన్ (Evening gown) చించి నాకు షర్టు తయారు చేసింది' అన్నాడు మొదటివాడు.

'ఓస్ ఇంతేకదా! మా ఆవిడ 'నా షర్టు చించేసి తనకి ఈవినింగ్ గౌన్ కుట్టుకుంది తెలుసా' అన్నాడు రెండోవాడు.

* * *

ఒకతను తుపాకీలమ్మే షాపులోకి ప్రవేశించి నాకు ఒక పిస్టోలు కావాలి అన్నాడు. 'ఎందుకు?' షాపు యజమాని ప్రశ్నించేడు. 'మా పక్కింటి వాడ్ని కాల్చిపారేస్తా?' అన్నాడతను. 'మీకు కోపం రాకపోతే నేనొకటిచెప్తా' అన్నాడు షాపు యజమాని. 'ఏంటది చెప్పండి' అన్నాడు వ్యక్తి. 'ఇవాళ మీరు కోపంతో ఉద్రిక్తంగా ఉన్నారు. అందుచేత రేపు కాల్చండి లేకపోతే గురి తప్పిపోతుంది' అన్నాడు షాపు యజమాని.

* * *

ఒక మిలట్రీ లెఫ్టినెంటు బాగా తాగేసి జీపులో చాలా వేగంగా పోతున్నాడు. అతన్ని ఆపడానికి ఒక పోలీసు మోటారుసైకిలు మీద వెంబడించి ఎంతోదూరం వెళ్ళినతరువాత ఆపగలిగేడు.

'ఏమయ్యా అంతగట్టిగా కేకలు వేస్తున్నా వినపడలేదా? ఆపవేం జీపు?' అని ప్రశ్నించేడు.

'ఆ! వినపడకేం? వినపడ్డాది. ఇందాక జీపుకిందపడ్డవాడు వేసిన కేకల్లాంటివే అనుకొన్నా' అన్నాడు లెఫ్టినెంటు.

టి. ఎస్. సుబ్రహ్మణ్యం——
(స్నేహ విద్యాలయం, మాస్కో)




### జరిగిన కథ

రెండోపెళ్లివాడయిన గోపాలంతో సుభద్రకి పెళ్లి జరిగింది. అతనికి ఆమెతో వయసొచ్చిన కొడుకు శ్రీనివాస్ ఉన్నాడు గోపాలం మరణం శ్రీనివాస్ చదువు సుభద్రని కష్టాలపాలు చేశాయి, జగదీశ్ ఆమెని మోసం చేశాడు తత్ఫలితంగా ఆడపిల్లని కంటుంది ఫకీరు పంచలో ఆమెకి ఆశ్రయం లభిస్తుంది రాజేశ్వరి శ్రీనివాస్‌ని వెతుక్కుంటూ వస్తుంది. ఇద్దరూ పెళ్లి చేసుకోవాలనుకుంటారు. రాజేశ్వరికూడా ఉద్యోగంలో చేరింది. అక్కడి పరిస్థితులు నచ్చక మళ్లీ విరమించుకున్నది ఫకీరు మరణిస్తాడు సుభద్ర చేతులు మారుతున్నదని ముకుందం ద్వారా విని — ఆమెని వెతుక్కుంటూ వస్తాడు శ్రీనివాస్

## 12

నెలలు గడుస్తూంటే రాజేశ్వరి మిస మిసలాడే శరీరంతో కొంచెం పచ్చని ఛాయని పులుముకుని మరీమరీ చూడాలని పించేట్లు వుంది. శ్రీనివాస్ రాజేశ్వరికోసమే బ్రతుకుతున్నాడు. అతనికి శరీరంనిండా అణువణువూ రాజేశ్వరి నిండిపోయింది ఎనిమిది నెలలు దాటిపోయాయి. శ్రీనివాస్ అప్పులు అధికం అయిపోయాయి రాజేశ్వరికి యేమాత్రం తెలియనివ్వలేదు అతను రాత్రి పదకొండుగంటలు దాటుతూంటే రాజేశ్వరికి నొప్పులు ప్రారంభం అయ్యాయి చేతిలో ఇదురూపాయలు తప్ప అతనికి కానీ కని పించడం లేదు.

గవర్నమెంటు హాస్పటల్లో చేర్పించాడు. తెల్లవారితే, అన్ని సమస్యలే. పాలవాడు, యింటిఅద్దె, కిరాణా కొట్టుమనిషి, చాకలి యిలా అంచెలంచెలుగా నిలబడి అతని కన్నులముందు నృత్యం చేస్తున్నారు రాజేశ్వరి నెమ్మదిగా అంది 'నేను బ్రతక్కపోతే '

'ఛ! యేంమాటలవి? చూడు రాజేశ్వరీ నువ్వు మగపిల్లడిని కంటేనే యింటికి రావాలి'

'లేకపోతే?'

'తలుపు తియ్యను'

'యేవిటో ఆశ'

'అదంతే'

'నాకు ఆడపిల్లే కావాలి'

'అయితే నీయిష్టం' శ్రీనివాస్ మొహం చిన్నపోయింది

'మీ యిష్టమే నెరవేరు తుందేమో అప్పుడే చిన్నబుచ్చుకోవడం దేనికి?'

'నేను యేమిటో భయంగా వుందండీ!' శ్రీనివాస్ ప్రేమగా చూశాడు. 'మొదట్లో ఆడవాళ్లంతా యిలాగే భయపడతారు రాజేశ్వరీ! భయపడినా అందరూ పిల్లల కోసమే ప్రాకులాడుతారు చిత్రంగా లేదూ...'

రాజేశ్వరి స్ట్రెచర్‌మీద పడుకుని రెండు చేతులూ జోడించి నమస్కారం చేసింది.

శ్రీనివాస్ భగవంతుడిని ప్రార్థిస్తూనే వున్నాడు. రాజేశ్వరికి సులభంగా ప్రసవం కాలేదు. మేజర్ ఆపరేషన్ చేశారు. మగ పిల్లాడు చాలా ఆరోగ్యంగా, మరీ దృఢంగా సిస్టర్ చేతిలో నలిగిపోతూంటే శ్రీనివాస్ ప్రాణం గిజగిజలాడింది.

తొమ్మిదిరోజులు క్షణాల్లా గడిచి పోయాయి. బలవంతంగా తనంతట తానే డిస్చార్జ్ చేయించుకొని వచ్చేసింది రాజేశ్వరి. శ్రీనివాస్ యిల్లు తుడవడం, అంట్లు తోమడం, బట్టలకి సబ్బు పెట్టడం రాజేశ్వరి హృదయాన్ని గుప్పిట్లో పెట్టుకొని యెవరో కసితీరా నలుపుతున్నట్లు బాధపడుతోంది. అతని భుజం మీద చేయివేసి 'పోనీ పనిమనిషిని పెట్టించండి' అంది నెమ్మదిగా. శ్రీనివాస్ తలెత్తి వొకసారి చూశాడు అతని చూపుల్లో భావ వీచికలు విసురుగానే తగిలాయి తమాయించుకుని అన్నాడు. 'ఈ రోజుల్లో పది రూపాయలు పెడితేగానీ దొరకరోయ్ పని మనుషులు ఆ డబ్బువుంటే బాబుకి పాలూ, నీకు మందులూ వస్తాయి.'

'నా సంగతికేమి? మీ ఆరోగ్యం చూసుకోండి?. మీరూ దెబ్బతిన్నారంటే యిక జీవితం సాగేదెలా?'

శ్రీనివాస్ నవ్వి అన్నాడు. 'నువ్వు నమ్ముతావో లేదోగానీ నర్సుచేతిలో బాబు నలిగిపోతూంటే నా ప్రాణం విలవిలలాడి పోయింది సుమా!'

'అబ్బ!మరేం. మీకే మహ ప్రేమవుంది. పిల్లాడు నలిగిపోతే యేమై పోతుందేవిటి?'

'అదేమో నా ప్రాణాన్నే నలిపేస్తున్నా

రేమో' అనిపించింది. ఈకష్టాలు యెక్కువ కాలం నిలవ్వు రాజేశ్వరీ. పనిమనిషి దేనికి? రెండు నెల్లాగితే నువ్వే ఆరోగ్యంగా తిరుగు తావు.'

రాజేశ్వరి మరి మాట్లాడలేదు.

*　　*　　*

బాలింతరాలు రాజేశ్వరికి కడుపునిండా తినేందుకే పెట్టలేకపోతున్నామ అనే బాధ శ్రీనివాస్‌ని పీల్చి పిప్పిచేస్తోంది. శ్రీనివాస్ మునికాళ్లమీద చేతులు చాపుకుని కూర్చుండి పోయాడు. పిల్లాడు పాలకి గోల పెడుతున్నాడు. రాజేశ్వరికే తిండిలేక పోతే పసివాడికి పాలు యెక్కణ్ణించి వస్తాయి. ఈ ఆకలిలో ఈబాధలో యెవరినైనా అప్పు అడిగితే? శ్రీనివాస్ చేసేపనుల్లో యేదో మోసం, అన్యాయం కనిపిస్తున్నాయి రాజేశ్వరి కంటికి:

రాజేశ్వరి ఆలోచనలు మరో వైపుకు మళ్లాయి. పోనీ సమాజం ప్రెసిడెంటుని అడిగితే? చుట్టూ ప్రహరీ, బొగెన్‌విల్లా పూల చెట్లు; నాలుగైదు వేపచెట్లూ చిన్న ఆశ్రమంలాంటి యింట్లోవుండిపోయిన గెడ్డంతో గుబురు మీసాలతో చూడగానే నమస్కారం చేయాలనే వర్చస్సుతో పవిత్రంగా వెలిగిపోతూ సదా గీతాపారాయణ చేస్తూంటారు, సమాజంలో హోదా పలుకుబడి వున్న నారాయణబాబు.

మేలిముసుగు వేసుకుని అడుగులో అడుగు వేస్తూ మండుటెండలో ఆయన గదిలోకి అడుగుపెట్టింది రాజేశ్వరి.

సమాజంలో చాలా పెళ్లిళ్లు జరుగుతూంటాయి. యెంతోమంది వస్తూ పోతూ వుంటారు. ప్రత్యేకం రాజేశ్వరిని గుర్తుంచుకోవడానికి కారణం లేకపోలేదు. శ్రీనివాస్ జంటనగరాల్లో నాటక సమాజాల్లో ప్లేబాకుయిచ్చి గొప్పపేరు తెచ్చుకున్నాడు. రెండు మూడేళ్లలోనే అతనిపాట వినని మనిషి లేకపోవచ్చును బహుశా. రేడియోలో అతను పాడుతూంటే నూటికి ఒక్కరైనా ఆగి, నిలబడి, విని మరీ వెడుతుంటారు. సమాజంలో యేదైనా కార్యక్రమం జరుగుతే శ్రీనివాస్ తప్పకుండా హాజరు అవుతాడు.

రాజేశ్వరిని వెంటనే పోల్చుకుని అన్నారు నారాయణబాబు 'రామ్మా రా. కూర్చో. యెండలో వచ్చావు పనిమీదేమో' ఆయన కంఠస్వరం శాధ్యతతో నిండిపోయింది:

రాజేశ్వరి నెమ్మదిగా అంది: 'ఆయన తెచ్చే జీతం యేమౌతుందో తెలీడంలేదు బాబుగారూ. యింట్లో తిండికే యిబ్బందిగా వుంది. యేదైనా సమాజం తరపున సర్దుతారేమో అని'

'సమాజం ఆర్థికంగా పెద్దహోదాలో లేదు రాజేశ్వరీ. మాబాధ్యత మేము గుర్తించి దేశ సౌభాగ్యంకోసం ప్రయత్నిస్తాం. ఏకజాతి, ఐకమత్యం సమాజం ఆదర్శం. మరి నువ్వు యిలా యిబ్బందుల్లో చిక్కుకున్నావంటే ఆశ్చర్యంగా వుంది. అతను ట్యూషన్లు చెబు



తాడు. పైగా రేడియో ఆర్టిస్టు...ఒగా డబ్బుంతా...'

'ఆయన తాగుతారు బాబుగారూ'

నారాయణబాబు ఆశ్చర్యాన్ని అణచుకున్నారు: 'నేను దాన్ని సమర్థించను కానీ శ్రీనివాస్ జీతం త్రాగేందుకే అయిపోతోంది అంటే నమ్మకంలేకుండా వుంది'

'ఆయనలో వున్న మంచి నేర్పరితనం నలుగుర్నీ నమ్మించడం. ఆయన్ని చూసి అందరూ అలాగే అంచనా వేసుకుంటారు. నిజానికి నేను చెప్పేది మీకూ నమ్మకం లేనట్లుంది'

'అదేం కాదు. ఆర్థిక యిబ్బందులు అందరికీ వుంటాయి. శ్రీనివాస్ తాగేవాళ్లో వుంటాడనేదే కొంచెం ఆశ్చర్యంగా వుంది'

'బాబుగారూ నేను ట్యూషన్లు చెప్పి అయినా బాకీ తీరుస్తాను. దయచేసి ఒక్క పాతిక రూపాయలు సర్దండి'

నారాయణబాబు లేచివెళ్లి బీరువాలో రెండు పదికాగితాలూ వొక ఐదునోటూ చేతికి యిస్తూ అన్నారు: 'అంత యిబ్బందిలో వుంటే శ్రీనివాస్‌వచ్చి అడగవచ్చును గదా. అంత దూరంనుంచి వొంటరిగా ఆడపిల్లని రావడం ... ప్చ్ నాకు బాగులేదు. నేను వస్తాను యింటివరకూ.'

రాజేశ్వరి తల వాల్చేసింది: 'ఒద్దు బాబుగారూ. బస్సులో వెళ్లిపోతాను. అట్టేదూరం అనిపించదు. కృతజ్ఞురాలిని' అంది ఆయన పాదాలు తాకుతూ.

# మొగలి పొదలు

వెనక్కి తగ్గి అన్నారు: 'సమాజం యే ఒక్కరికీ ఆర్థికంగా సహాయం చేయలేదు యిది పెద్దబాబు యింటి ఖర్చుల కోసం పంపాడు బీదా బిక్కీ ఫీజులు వాడేడతాడు. అందులోంచి యిస్తున్నాను. నువ్వు జాగ్రతగా వెళ్లిరా'

రాజేశ్వరి వీధి మలుపుదాటే వరకూ నిలుచుని నిట్టూర్చారు. రాజేశ్వరి వెనుతిరిగింది నిట్టూర్పు విని.

అవును ఆయనతో అబద్ధం చెప్పింది. డబ్బు అడిగేందుకు శ్రీనివాస్ త్రాగుతాడని అంది. పార్టీకి వెళ్లిన శీనివాస్ స్నేహితుల బలవంతంమీద కొంచెం తాగివస్తే అప్పుడు సమర్థించిన తను నారాయణబాబు యెదుట చిలవలు పలవలుగా అల్లి డబ్బు తీసుకువచ్చింది. 'యెందుకిలా చేశాను' తనకు తానే ప్రశ్నించుకుంది. శ్రీనివాస్‌కీ విషయం తెలిస్తే వొక్కనాటికి వూరుకోడు అభిమాన ధనుడు అతను చంద్రమౌళిని అప్పు అడిగినట్లూ, నారాయణబాబు దగ్గర తెచ్చినట్లూ తెలిస్తే అతను ముమ్మాటికీ రాద్ధాంతం చేస్తాడు. ఒగా సమస్యని తను యెదుర్కోవాలి. యింటికి వచ్చి ఆలోచనలో పడింది రాజేశ్వరి

శ్రీనివాస్ పీట మీద కూర్చున్నాడు. రెండు కూరలూ, పులుసూ, పచ్చడితో కడుపునిండా వడ్డిస్తూంటే శ్రీనివాస్ ఆశ్చర్యపోయాడు: 'యివన్నీ యెక్కడివీ' అంటూ:

'ముందు మీరు భోజనంచేయండి, కడుపునిండా భోజనంచేసి చాలారోజులు అయింది'

శ్రీనివాస్ అసంతృప్తిగా అన్నాడు: 'నా కేమిటో ఒగా పదార్థాలు రుచికరంగా లేవు రాజేశ్వరీ. రోజూ నువ్వుచేసే మిరపకాయల పచ్చడే చాలా బాగుంది వీటి ముందు అయినా నీకు డబ్బు యెక్కడిదీ. నిరంజనంగారు ఆఫీసు బాపతు డబ్బు యేమైనా యిచ్చారా'

'వుహుఁ'

'మరి ?'

'మీరు భోజనం చేయండి బాబూ. తినేది వంటబట్టకుండా విస్తరిముందు కూర్చొని తెగ ప్రశ్నలు కురిపిస్తున్నారు. నేను డబ్బుతీసుకు వచ్చేందుకు తగనా'

'అదికాదు రాజేశ్వరీ. విషయం తెలీకుండా తినేందుకు ముద్ద మింగుడు పడడం లేదు కంఠం మధ్యలో నే ఆగిపోయింది గులకరాయిలా. అదేదో చెప్పేస్తే నాకు అంత బాధ వుండదు'

రాజేశ్వరి గుండె దిటవు చేసుకుని అంది నెమ్మదిగా: 'ఆర్యసమాజం ప్రెసిడెంటు యిచ్చారు'

నోటికి అందిస్తున్న ముద్ద కంచంలో పడిపోయింది జారి. అతను కంచాన్ని ముందుకు తోసేసి వెంటనే చెయ్యి కడిగేసుకున్నాడు. కోపాన్ని దిగమింగుతూ అడిగాడు.

'యెందుకిచ్చారు ఆయన? దయాభిక్షగా సమాజం యెవరికీ ఆర్థికసహాయం చేయదు. అందులో నేను గవర్నమెంటు వుద్యోగస్థుడిని నిన్ను పిలిచి, మన ఆర్థిక చిక్కులు తెలిసినట్లు యివ్వడం నాకు నమ్మ శక్యంగా లేదు'

'అది వాళ్లబాధ్యత మనకి పెళ్లిచేశారు. యిప్పుడు ఆపదలో వున్నాం. మధ్యాహ్నం నారాయణబాబు కనిపిస్తే అడిగాను'

'నీకెంత బుద్ధిలేదు' శ్రీనివాస్ యెన్నడూ ఆమాట అనలేదు.

'తప్పేం వుంది ఇందులో? బుద్ధితక్కువ పనేమీ చేయలేదు నేను. పిల్లడు పాలకోసం వొకటే యేడుపు అప్పటికే చంద్రమౌళి గారిని అప్పుగా అడిగాను.'

శ్రీనివాస్‌కి దుఃఖం ముంచుకు వచ్చింది. మనం యివాళ దరిద్రంలో వున్నాం అని

'ఏం సరూ సైకిలు కొంత్తవా??



# మొగలి పొదలు

నలుగురినీ దేబిరించేందుకు వెళ్ళావా? నా పరువు నట్టేట్లో ముంచి. చంద్రపాళి నాకు స్నేహితుడే కానీ అప్పులు అడిగేంత సన్నిహితం లేదే నాకు. అతను అంత పెద్ద ఆఫీసరు. నీకు సిగ్గే లేకపోయిందా?'

'ఆకలి సిగ్గుని జ్ఞాపకం చేస్తూంటే బ్రతుకులో అందరూ బాగుపడేవారే'

రాజేశ్వరి అన్న ఆ వాక్కు మాటా అతనికి శూలాలలా పొడుచుకుంది. 'ఒరేయ్ బడుద్ధాయిగా నీకు మొదటినుంచీ సంసారం నడపడం వస్తే, నీపని యిలా యెందుకయ్యేది. నీ చేతకానితనానికి మాటలు కూడా యెక్కువా' అంటున్నట్లుగా అనిపించింది.

'యేమైనాగానీ నువ్వు నారాయణబాబునీ చంద్రపాళినీ డబ్బు అడగడం ఛీ, నీ మొగుడు పత్తి వెధవ అని చాటుకోవడమే అనిపిస్తోంది.'

'పిల్లాడికోసం చేశాను. లేకపోతే నేనెప్పుడూ అదివరకు అంతర్నీ భిక్షం అడగలేదు. మిమ్మల్ని వెధవ అనీ, చవట అనీ నేను అందరికీ చెప్పడం లేదు.'

'నీకు మాటలు వచ్చును. యింటో డబ్బు లేదని నీకంటికి అలుసుగానే కనిపిస్తాను. పాతరోజులు త్వరగానే మరిచిపోతాం మరి. ఈనాడు అనుకోకుండా నా అవస్థ యిలా అయిందనేగా'

రాజేశ్వరి అహం దెబ్బతింది! 'అంటే మీ యింటికి ఆడదాన్ని నౌకరిగా వచ్చి అన్నాళ్ళూ మీ సంరక్షణలో వుండి పోయాననీ నేనే మిమ్మల్ని పెళ్ళిచేసుకోమన్నాననీ జ్ఞాపకం చేస్తున్నారా' తను మధ్యాహ్నం యెంత కష్టపడి యెంతదూరం నడిచి వెళ్ళింది. భర్తకి తిండిపెట్టాలని తనకి లేకనా...

'నువ్వు ఎలా అర్థం చేసుకున్నా సరే' పిల్లాడు గుక్కపట్టి యేడుస్తూంటే వాణ్ణి క్రిందికి దింపేశాడు.

రాజేశ్వరి అప్రతిభురాలై పోయింది. తను అన్నమాటలు సమర్థిస్తాడనీ, తనని కౌగిట్లో ప్రేమగా బంధిస్తాడనీ కడుపు నిండా పెట్టినందుకు అభినందిస్తాడనీ యేమో, యేమో అనుకుంది.

రాజేశ్వరి అంతరంగం చితికిపోయింది సిగ్గుతో, అవమానంతో. అభిమానంగల మనిషికావడంవల్ల చాలాసేపు బాధపడింది. శ్రీనివాస్ అన్నదాంట్లో యదార్థాన్ని గ్రహించి అతని కాళ్ళమీద చేతులు వేసి కన్నీరు కార్చింది.

'పోన్లే రాజేశ్వరీ యింకెప్పుడూ అడగకు. మనం ఉపవాసాలున్నా నలుగురికీ తెలియడం నాకు బాగుండదు' రాజేశ్వరికి దుఃఖం ముంచుకు వచ్చింది: 'యింకెప్పుడూ అడగను' అంది.

* * *

రోజులు గడుస్తూంటే రాజేశ్వరి ప్రమాణం నిలువలేదు. అతను యెన్ని ట్యూషన్లు చెప్పినా యెంతబాకీ తీర్చినా కొండలా పేరుకుపోయిన అప్పు కళ్ళకి తరిగినట్లు కనిపించడంలేదు. ఈ ఆకలితో... బహుశా శ్రీనివాస్ అన్నట్టు నిర్లక్ష్యం చూపిస్తూ తనను పరోక్షంగా ద్రోహం చేస్తున్నాడేమో... ఛా-విషయం. అవును రెండూ రెండూ నాలుగెందుకు కాదూ?

రెండోసారి వచ్చినప్పుడు నారాయణబాబు ప్రశాంతంగానే అడిగారు: 'బాగున్నారా అమ్మా' అని.

రాజేశ్వరి ఆయనకు కొంచెందూరంలో చాపమీద కూర్చుంది. చాలాసేపు నిశ్శబ్దంగా వుండిపోయింది.

'వచ్చిన సంగతి చెప్పావు కాదు' ఆయనే అన్నారు.

'బాబుగారూ నాకు విడాకులకు యేర్పాటు చేయించండి'

నారాయణబాబు తెల్లబోయారు.

'అది...అది... నీకు యిప్పుడు యేం జరిగింది?'

'ఆయన కృష్ణప్రియ అనే అమ్మాయి ప్రేమలో చిక్కుకున్నారు'

'అబద్ధం' నారాయణ బాబు గొంతు ఖంగుమంది.

'నిజమే బాబుగారూ. ఆయన జీతంలో చాలా భాగం ఆ పిల్లకోసమే వుపయోగిస్తున్నారు'

'ఛ! అటువంటి మాటలనకు రాజేశ్వరీ. శ్రీనివాస్ సంగతి అందరికీ తెలుసును'

'నేను అబద్ధం ఆడుతున్నానంటారా'

'అది మీ రిద్దరూ వుంటేగా అడగవలసిన విషయం. నీ కిప్పుడు బాగా జరుగుతోంది కదా'

'మొన్న సినిమానుంచి రావడం ఆలస్యం అయింది. బస్సులు రాకపోతే చీకట్లో త్వర త్వరగా యింటికి కాలినడకనే వచ్చాను. దారిలో పిక్చర్కట్కుకు కొంచెం దూరంలో ఒక సిక్కు అతను వెంటబడ్డాడు. అతన్ని తప్పించుకుని వచ్చేసరికి ఆయన నామీద చెయ్యిచేసుకున్నారు'

'దేనికి ?'

'ఆ సిక్కు అతనితో నేను కలిసి వెళ్లానేనే అనుమానంతో'

'నేను కనుక్కుంటాను'

రాజేశ్వరి ఖంగారుని అణుచుకుంది: 'వొద్దు బాబుగారూ. విచ్ఛిన్నం అయిపోయిన సంసారం ఒకటి కావడం యిష్టం లేదు నాకు. వోటుపోయిన పాత్ర అతుకు పెడితే దాని పూర్వపు అందం దానికి రాదు. విరిగిపోయిన మనసుతో జీవితం అంతా గడిపేందుకు నాకూ యిష్టంలేదు'

'నిజంగా బుద్ధిలేదు నీకు. కట్టుకున్న మగవాడిని కాదని నువ్వు సుఖపడలేవు. మంచో-చెడో ఒకసారి దైవం నిర్ణయించిన యీ పెళ్లిని మాటిమాటికీ విడదీసుకోవడం-ఛ! యిదేమంత మెచ్చుకో దగిన విషయం ?' రాజేశ్వరికి కోపంతో ముచ్చెమటలు పోశాయి.

'అయితే నేను లాయరుతోనే సంప్రదించడం మంచిదంటారా ?'

'ఆ సలహాకూడా నేను యివ్వను'

రాజేశ్వరి విసురుగా వెళ్లిపోయింది. సమాజపు పెద్దమనిషి అనే గౌరవం లేకుండా.

* * *

యింటికి వచ్చింది మొదలు రాజేశ్వరి మనసు అతలాకుతలమై పోతోంది. కృష్ణప్రియకి పాఠం చెబుతున్నప్పుడు మధ్య మధ్య ఒకటి రెండుసార్లు పరిహాసానికి అతని నెత్తిమీద చేయి వేయడం సహించలేక పోయింది. తను అనవసరంగా తొందరపడి యిల్లువదిలి రావడం అవివేకమే అనిపిస్తోంది. అక్కడేవుంటే రామదాసుకు తను భారం అయేది. తనను దేవదాసు...ప్చ్. జరిగింది తిరిగి రాదు. తను యిలా శలభంలా కొట్టుకోవలసిందే నేమో? తను నారాయణ బాబుదగ్గరికి వెళ్లిన విషయాన్ని కడుపులోనే దాచుకుంది. ఒకటికి రెండుసార్లు: 'ఛ! యెంతపని చేశాను ? యిలా సొంటి చీరతో, వట్టి అన్నంతో బ్రతుకుతానని తెలుస్తే ఆ దేవదాసునే చేసుకునేదాన్ని', అనే సింది శ్రీనివాస్ యెదుట వుండబట్టలేక.

'శ్రీనివాస్ మొదట్లో చాలా తేలికగా తీసుకున్నాడు. మనిషీ, మగవాడూ, ఉప్పూ కారం తింటూండే అతనిలో అహం పైకి వచ్చేసి మించిన మంచితనాన్ని మరుగు పరిచేస్తోంది.

'చూడు రాజేశ్వరీ. నీకు దేవదాసును చేసుకోవాలనుంటే నేను వద్దని యెప్పుడూ అనలేదు కోర్టువుంది. ఆనాడు ఏమహాత్ముడన్నారో కోర్టుకి మనలో యెవరు యెక్కినా అని. నీకు తోచినట్లుగా చెప్పేసి విడాకులు తీసుకో. ఆ తరువాత ఎవరిని చేసుకున్నా నాకు అభ్యంతరంలేదు'

'అంటే మీ వుద్దేశ్యం?'

'నీకు తోచినట్లుగా చేసి కనీసం నీ ఆత్మనీ తృప్తిపరచాలని?'

'యిప్పుడు నాకు తృప్తిలేదనా?'

'వుంటే యిలా జీవితం పాడుగువా సాధించవు.'

'ఎందుకిలా చేస్తున్నారు మీరు?'

'నీ యిష్టాన్ని అర్థంచేసుకోవడం కోసం.'

'అంటే మిమ్మల్నే కాకుండా మరొకరిని చేసుకుంటాననుకున్నారా?'

'తప్పేం వుంది. మీ యిళ్లల్లో అటువంటివి అంత తప్పుగా తోచవు. మేము హిందువులం. మాకు కొన్ని నియమాలు వుంటాయి.'

'మీకే యిష్టం లేదు. అసలు విషయాన్ని దాచేసి నాతో తెగతెంపులు చేసుకుందాం అనుకుంటున్నారు.'

'నాకేం ఆ వుద్దేశ్యం లేదు. నాకు యెవరూ లేరు పోజాగా చేసుకుందాం అనుకోవాలన్నా.'

'నేను దేవదాసు విషయం అన్నాననేగా దెప్పుతున్నారు.' ఇక ఆ తరువాత రెండు మూడురోజులు యిద్దరి మధ్యా మాటలు లేవు.

రాజేశ్వరి పేర కవరు రావడం శ్రీనివాస్కి ఆశ్చర్యం వేసింది. ఉత్తరాన్ని జాగ్రత్తగా అందించాడు.

రాజేశ్వరికి,

ఆశీసులు. నువ్వు యేమీ సుఖపడటం లేదని తెలిసి యెంతో బాధపడ్డాను. అంతకుమించి చేయగలిగింది యేముంది కనుక ? మీ బాబాయి పోయారు. మగవాడిని చాకచక్యంతో స్వంతం చేసుకోవాలి. మన మతంలో ఆ శ్రీనివాస్ని చేరమను. మనవాళ్ల సహాయం నీకు దొరుకుతుంది. అసలు యెందుకిలా చేశావు? తినడానికైనా సరిగాలేని ఆ జీవితంలో నువ్వు అనుభవిస్తున్నది యేమిటి? ఉన్న ఆస్తిలో కదుపు కదలకుండా నా బిడ్డను పోషించుకునే శక్తి నాకు వుందని చెప్పు. వెంటనే వచ్చేయి.

మీ అమ్మ,
పద్మావతి.





# మొగలి పొదలు

శ్రీనివాస్‌కి,

ఆశీర్వచనములు యిన్నాళ్లూ నా బిడ్డకు రక్షణ యిచ్చావు. నా కృతజ్ఞతలు. దానికి తెలిసో తెలియకో నిన్ను కష్టపెట్టి వుండవచ్చును. తిండిలేక అల్లాడి పోతున్న నా బిడ్డను నేను పోషించుకోగలను. వెంటనే పంపు.

—పద్మావతి.

శ్రీనివాస్ అడిగాడు: 'నీకు వెళ్లాలని వుందా.'

'అవును వెడతాను. అమ్మ పిలుస్తూంటే వాకిక్కడేం బాగులేదు.'

'సరే నీ యిష్టం'

'యివాళే వెడతాను'

'అలాగే'

శ్రీనివాస్ స్టేషన్‌లో టిక్కెట్టుకొని పిల్లాడిని తీసుకున్నాడు.

'రైలు వచ్చే వేళ అయింది పిల్లాడిని యివ్వండి,' రాజేశ్వరి అంది,

'పాలీ యిదొక్కటే నేను చేయను.'

'పిల్లాడు పాలు లేకుండా వుండడు.'

'అవన్నీ నేను చూసుకుంటాను.'

'పిల్లాడిని యివ్వరన్నమాట.'

'నువ్వు బెంగపెట్టుకోకు. నాకు వాడిని కూడా దూరం చేయకు. మొదటి నుంచీ యేకాకి బ్రతుకే అయిపోయింది నాది.'

రాజేశ్వరి వాదించలేదు. రైలు రాక ముందే శ్రీనివాస్ స్టేషన్ బయటికి వచ్చేశాడు.

*　　　*　　　*

చంద్రవకాళి నెమ్మదిగా అన్నాడు: 'మొన్న పబ్లిక్ గార్డెన్స్‌లో మీ ఆవిడనీ, అతన్నీ చూశాను. ఆవిడ పూళ్లో పేరని ప్రభావతి అంది. ఎప్పుడు వచ్చారు?'

శ్రీనివాస్ కాళ్లక్రింద భూమి గిర గిరా తిరిగిపోయింది. అతను గాలిలోకి తేలి పోతున్నట్లుగా అన్నాడు: 'హరం అయింది వచ్చి' యింక యెక్కువ మాటలు పెరగ నీయలేదు.

నారాయణబాబు దగ్గరికి వెళ్లి యిప్పటికప్పుడు జరిగింది చెబుతూనే వచ్చాడు. సమాజం బాధ్యతలకి యే మాత్రం భంగం రావడం శ్రీనివాస్‌కి యిష్టంలేదు.

'నువ్వు ఆవిడ తల వెంట్రుకలు కోపంతో కత్తిరించావుట. చదువుకున్న వాడివికదా యిదేం పని?', నారాయణబాబు మెత్తమెత్తగా చివాట్లు వేస్తూంటే తెల్ల బోయాడు శ్రీనివాస్.

'తనే ఫాషన్‌కి చివర్లు కత్తిరించు కుంది నేనా పని చేయలేదు ఒట్టు. నన్ను నమ్మండి'

'నువ్వు అనుమానించి కొట్టావట కదూ,'

'మాటి మాటికీ దేవదాసును చేసు కుంటే...అని బాధపడుతూంటే మాట అన్నాను గానీ యెన్నడూ చెయ్యిచేసుకోలేదు.'

'తిండికి మొహం వాచిన పిల్ల అప్పు అడగడంలో తప్పేం వుంది? మరి నువ్వు తాగడానికీ, తినడానికీ యెక్కడినుంచి వస్తోంది?' శ్రీనివాస్ చిత్రంగా చూశాడు. 'తాగేకులంలో పుట్టినా నేను దానికి అల వాటు పడలేదు. పార్టీలో స్నేహితులు బల వంతం చేస్తే ఆ రోజే మొదటిసారి. ఆఖరుసారీ రుచి చూశాను. ఈ సంగతి చెబితే మనశ్శాంతి కోసం అలా చేయడంలో తప్పులేదని తను సమర్థించింది. ప్రమా ణంగా చెబుతున్నాను. నేను మరి ముట్టు కోలేదు.'

'రాజేశ్వరి అన్నీ అబద్ధాలే చెప్పిందం టావా.'

'నన్ను నేనెలా ఋజువు చేసుకో గలను?', శ్రీనివాస్ ప్రాధేయ పూర్వకంగా అన్నాడు: 'నారాయణబాబూ ఆనాడు నేను రైలు టికెట్టు కొని యిచ్చాను. కానీ తను దేనికో వెళ్లలేదు రాజమండ్రీ, తిరుమల గిరిలో కాపురం పెట్టింది నాకు పరి చయం వున్న వాళ్లింట్లో. ఎందుకలా చేసిందో యెలా బ్రతుకుతోందో అర్థం కావడం లేదు.'

'నీ దగ్గరికి కృష్ణప్రియ అనే ఆడ పిల్ల వస్తోందట. దానికి సంజాయిషీ యేం చెబుతావు?'

నారాయణబాబు వేసే ప్రతి ప్రశ్నకీ సిగ్గుపడుతూనే వున్నాడు. అసలు రాజేశ్వరి యిన్ని అబద్ధాలు యెందుకు చెప్పింది? నెమ్మదిగా అన్నాడు: 'కృష్ణ ప్రియ ఎచ్. ఎస్. సి. స్టూడెంటు. ఆ పిల్లకు ఎవరూ లేరు. నేను కొంత మంది బీద విద్యార్థులకి ఫ్రీగా చెబుతాను. అందులో తనూ ఒకతె.'

'నీకు ఆ పిల్ల అంటే ప్రత్యేకం అభి మానం యేమీ లేదన్న మాట'

'ఆ పిల్లే కాదు నారాయణబాబూ! ప్రతి ఆడపిల్లా యేకాకిగా బ్రతుకుతోం దంటే నా మనసు కుతకుతలాడుతుంది. కారణం మీకు యిదివరకే చెప్పాను. పిన్ని ప్రతి ఆడపిల్లలో నాకు కనిపిస్తుంది. యే ఆడపిల్లను చూసినా మనసు జాలిగా నిట్టూరుస్తుంది,'

'ఇంతకుమించి నీకూ ఆ పిల్లకూ...'

'ప్రమాణ పూర్తిగా యే సంబంధం లేదు బాబుగారూ.'

'ఆర్యసమాజంలో చేసే పెళ్లిళ్లు సక్రమంగా నలుగురికీ ఆదర్శప్రాయంగా వుండాలి ఈ సమాజంలో కులమతాలు వుండవు. ఆపదలో ఆదుకోవడమే దీని ముఖ్యోద్దేశం. మాటి మాటికీ మీకులం అని రెట్టించే వాడివట. అది నిజమేనా'

'నేను అలా వొకసారే అనవలసి వచ్చింది. దేవదాసును చేసుకుంటానంటే మా యిళ్లల్లో ఆడపిల్లలు అలా అనరు అన్నాను'

'పాలుతాగే పిల్లాడిని తల్లికి దూరం చేయడం తప్పు కాదంటావా?'

'మీరూ అంతే అర్థం చేసుకున్నారా?' శ్రీనివాస్ ముఖం పాలిపోయింది. 'రాజేశ్వ రిని నేను ప్రాణంలా చూసుకున్నాను. తను బాబు కోసం అయినా నన్ను వదులుకోదు. యీ గట్టి నమ్మకంతో వాడిని నాదగ్గర వుంచుకున్నాను. కానీ తను మాత్రం ప్రేమనే మరిచి పోయింది.'

'యిప్పుడు యేం చేద్దాం అనుకుం టున్నావు?'

'తిరుమలగిరిలో చంద్రవకాళి యింటికి మైలు దూరంలో గవర్నమెంటు స్కూలు పక్కన వుంటోంది. ఎలాగైనా రాజీకి తీసుకు వచ్చి కాపురం చక్కగా చేయాలి. యిని చేతులు కావు. బాబుని గాని, దాన్ని గానీ వదులుకోలేను బాబుగారూ.'

'అలాగే నా శాయశక్తులా ప్రయత్నం చేస్తాను.'

'కృతజ్ఞుడిని' శ్రీనివాస్ కళ్లు నీళ్లతో తడిశాయి.

(ఇంకా ఉంది).




# ప్రకటనల ప్రాణాలు

రాజు

'నమస్కారం, రా జా గా రూ!' అని వన్నెవరో పలకరించారు. పరధ్యాన్నంగా ఉన్న నేను ఎవరా ఉలిక్కిపడి చూశాను. ఇంకెవరో కాదు ఏ. వీ. రావు. (పూర్తి పేరు అయ్యగారి విశ్వనాధరావు. స్నే హి తు లు 'అన్నీ వచ్చు' అని పిలుస్తూ ఉంటారు.)

'ఏమండీ రావుగారూ కులాసా ?' అని అడిగాను. 'చాలా రోజు లయింది చూసి! ఎక్కడున్నారు ఏం చేస్తున్నారు ?'

'ఎడ్వర్టయిజింగ్ ఏజన్సీలో పనిచేస్తున్నా నండీ...అదే, ప్రకటనా సంస్థ !'

'అలాగా ! ఇంకా కథలు రాస్తున్నారా ?' అతను ఒకప్పుడు క థ లు రాసేవాడు. ఎప్పుడో ఒకసారి కథ అదేదో పత్రికలో పడినట్లు చెప్పినట్లు గుర్తు.

'ఆ ఏదో లెండి! అయినా అం త తీ రి కుండటం లేదండీ రాజుగారూ. ఆఫీసు పనితో సరిపోతుంది.'

'వెరీ గుడ్! బీచిలో కూడా గాలి లేకుండా ఉందే...అయినా మద్రాసులో కూడా రోజు రోజుకీ ఎండెక్కువయి పోతోంది' అన్నాను నేను ఇంకేమనాలో తోచక.

'అవునండీ వాతావరణమూ మ రి యు వేడి దుర్భరంగా ఉన్నాయి ... అ న్న ట్లు మ ర్చి పో యా ను నేను ట్రాన్స్‌లేటర్‌గా కూడా పనిచేస్తున్నాను మా కంపెనీలో,' అన్నాడు రావు.

'రండి, అలాకూచుని మాటాడుకుందాం' మని మనుష్యులు తక్కువగా ఉన్న చోటుని చూపించాను. కూర్చున్నామో లేదో ఒక అబ్బాయి 'సూడావ ఉప్పుకడల వేర్కడలె బటానీ...' అంటూ అరుస్తూ మా దగ్గిరకి వచ్చాడు.

'చూశారా రావుగారూ, ఇ త ని ప్రక టన ఎంత తేలిగ్గా ఉందో!' అన్నాను కొంత నవ్వు కొంటూ.

'ప్రకటన కాదు ప్రచారం' అని దిద్దాడు రావు అనాలోచితంగా (అనిపించింది నాకు) 'వేరుశనగ పప్పులో రుచి మరియు మాంస కృతులు ఉన్నవి. అవి మన ఆరోగ్యమును పెంపొందించ గలవు. ఈ పప్పుని తరుచు తినినచో దేశతిండి స మ స్య కొంత పరి ష్కారం అవుతుందని ని పు ణు లు చెప్పు తున్నారు...'

'మహాత్మాగాంధీకి కూడా ఇవంటే ఇష్టం!' అని అతనికి ఒక పొట్లం అందిచ్చాను. 'అందుకనే నేమో ఆయన మనిషి మెరిసి పోతూ ఉండేవాడు.'

'నేను ఆయన్ని చూడకపోయినా కొందరు అదే సంగతి నాకు చెప్పారండీ! లోకములోని మరియు భారత దేశములోని సౌందర్య

డాక్టర్ కబుర్లు

## ఊపిరి తిత్తుల ఉబ్బరం

40 ఏళ్ళు దాటిన కొందరికి ఆయాసం వస్తుంది. దానికి 'పల్మనరీ ఎంఫిసిమా' లేక ఊపిరితిత్తుల ఉబ్బరం కారణం కావచ్చు ఊపిరి తిత్తులలో గాలి ఎక్కువనిండి ఈ ఉబ్బరం ఏర్పడుతుంది.



మనం లోపలికి గాలిపీల్చి నప్పుడెల్లా ఊపిరి తిత్తులలోని చిన్న చిన్న తిత్తులలో గాలి నిండుతుంది ఈ గాలి త్వరగా బయటికిరాదు. కొంచెం ప్రయాస అవసరం. ఇంకొక విధంగా చెప్పాలంటే లోనికి పీల్చటం తేలిక, బయటికి వదలటం కష్టం!

ఎంఫిసిమా ఉన్నవారికి తెల్లవార్లు కొంచెం దగ్గు, కఫం, పిల్లికూతలు, అలసట, బరువు తగ్గటం, మడమలు వాయటం — ఈ బాధలు ఉండవచ్చు. డాక్టర్లు రొమ్ముని పరీక్షించి ఎక్స్‌రేలు తీసి రోగనిర్ణయం చేస్తారు.

దానికి చికిత్స ఏమిటి? తేలిక చికిత్స ఏదిలేదు. మెల్లిగా నడవటం, నెమ్మదిగా మాట్లాడటం. ఎక్కువ సార్లు తక్కువ తినటం మంచిది. ధూమపానం, పొగ, దుమ్ము ఉన్నచోట్ల ఉండటం ఈ పరిస్థితిని తీవ్రం చేస్తాయి.

హెచ్. ఎల్. హెర్షెన్‌సోన్

(కాపీరయిటు)

రాణులుకూడా ఈ విషయాన్ని గుర్తుంచుకుంటే ఉత్తమంకదా!'

వాకు నవ్వొచ్చింది. 'వానిషింగ్ క్రీమ్‌ల కన్నానా వేరుశనగ?' అని అడిగాను.

'వ్యానిషింగ్ క్రీమ్!' యాంత్రికంగా దిద్దాడు ఏ. వి. రావు. 'అవును! వేరుశనగలో విశిష్టమయిన మరియు సౌందర్య పోషణకి అనువు అయిన పదార్థాలు కలవు.

'అవును! బి. బి. ఏ. టీ పాడినే ఎల్లప్పుడూ వాడండి! సువాసనతో కూడిన ఈ పానీయాన్నే సేవించండి!! ఇదే ఆహ్లాదాన్ని కలిగించే కప్పు! బి. బి. ఏ! బి. బి. ఏ. టీ...' అన్నదొక అదృశ్యవాణి నా వెనకాల హటాత్తుగా.

'ఈ ట్రాన్సిస్టర్ రేడియోలు నిజంగా పెద్ద చికాకయి పోయాయి' అని ఫిర్యాదు చేశాను రావుతో.

'నిజమే ననుకోండి, కాని అందరికీ అందుబాటులో ఉన్నవి కదా సంగీత సాధనలు! కొంత స్వరకంట్రోలు విప్పి శబ్దాన్ని తగ్గిస్తే మీకింత బాధగా ఉండేదికాదేమో... అవును! ఎల్లప్పుడూ మీ చెవికి బాధ కలిగించ నటువంటి స్వరకంట్రోలు వాడి కర్ణానందాన్ని పొందండి. ఇది ఆధునిక పోకడ! మునుపయితే ఉద్యానవనంలో అధిక చప్పుడు కల మైకులని వాడి బాధ మరియు కోపం తెప్పించే పద్ధతి యుండేది!'

ఇంతలో ఉరుముశబ్దం వినిపించింది దూరంగా మెరుపు కూడా మెరిసింది.

'అసలే మబ్బుగా ఉంది వాన వస్తుందంటారా?' అని అడిగాను.

రావు ఆకాశంవంక పరీక్షగా చూశాడు. 'రావచ్చు!' అన్నాడు. 'వానాకాలములో తరచు చినుకులు పడుతాయి వానలో తడిసినవారికి శైత్యము లేక రొంప పట్టవచ్చును! మీ ఆరోగ్యాన్ని సరైన పద్ధతిలో రక్షించుకోవాలంటే తగిన జాగ్రత్త పడటం మంచిది. వాతావరణంలో అధిక చలి ఉన్నప్పుడే సూక్ష్మక్రిములు మీ దేహంమీద దాడి తియ్యవచ్చును! అందుచేతనే...' అంటూ రావు చెప్పకు పోతూ ఉండగానే చినుకులు పడటం మొదలు పెట్టాయి. ఇద్దరం దగ్గరే ఉన్న బస్ స్టాండ్ షెల్టర్ కిందికి పరిగెత్తాము.






ఆ ఉత్తరం మడిచి జేబులో పెట్టుకుని కుర్చీలో వెనక్కి చేరగిల బడ్డాడు రాజు.

ఆ ఉత్తరం రాసింది అతని పినతండ్రి కూతురు కాత్యాయని. "నేను చాలా కష్టాల్లో వున్నాను. నీ సహాయం కావాలి. రెండు రోజులు సెలవుపెట్టి రాగలవా అన్నయ్యా? ఒకప్పుడు నీదయవల్ల నాకు స్వంత ఇల్లు ఏర్పడింది. ఆయిల్లు ఇప్పుడు నువ్వు నిలబెట్టాలి" అని వుంది అందులో.

రాజుకు మతిపోయినంత పనైంది.

"ఏంచేశాడీ మూర్తిగాడు?" అనుకున్నాడతను

మూర్తి అతని ఆబాల్య స్నేహితుడు. తమ స్నేహబృందంలో అందరికన్నా డబ్బు కలిగిన కుటుంబంలో పుట్టినవాడు. కాత్యాయనికి, అతనికి పెళ్లికావడానికి కారకుడు రాజే.

మూర్తి అంటే స్నేహబృందంలో అందరికీ ఏవ రీతమైన వాత్సల్యం, గౌరవం వుండేది. అంటే మూర్తి చాలా గొప్పవాడనీ, అతీంద్రియశక్తులు కలవాడని అర్థం కాదు. అమాటకొస్తే ఏదో ఒక సందర్భంలో మూర్తి చేతిలో అడ్డమైన తిట్లు తినని స్నేహితుడు వాళ్ల బృందంలో లేడు. ఆ తిట్లు వాళ్లకి అమృత సమానంగా ఉండేవి.

కాలేజీల్లో చదువుకునే రోజుల్లో మూర్తికి మిత్రబృందం పెట్టుకున్న ముద్దుపేరు 'దక్షిణ నాయకుడు' అని. మూర్తి అందమైనవాడుకాదు. లావుగా, నల్లగా వుండేవాడు. దాదాపు మోకాళ్ల వరకు వచ్చే చొక్కా తొడుక్కుని, గొట్టాం పంట్లాం తొడుక్కునేవాడు. కాలికి పది లక్షల కుట్లుపడ్డ చెప్పులుండేవి. 'బోలెడంత ఉన్నవాడివి. నీకిదేం దవుర్భాగ్యంరా?' అని ఎవరైనా అడిగితే 'నాకు షోకుకుందుకు పోనిద్దూ' అనేవాడు తేలిగ్గా. షోకులేకపోతే పింగుబోయిరి—కనీసం నీట్‌గానైనా ఉండడేం? అని విసుక్కునే వారు మిత్రులు.

అలాంటి మూర్తికి కాలేజీలో అందాల రాణులుగా గణుతికెక్కిన ఆడపిల్లలో చాలా సన్నిహితమైన స్నేహం వుండేది. ఆస్నేహంలో 'అందరూ అనుకునే అంశం' లేకపోవడం మిత్ర బృందానికి మరింత ఆశ్చర్యం కలిగించేది. 'ఇంతనిగ్ర హంతో ఎలా వుండగలుగు తున్నావురా?' అని ఎవరైనా అడిగితే 'ఈప్రపంచంలో సెక్సు తప్ప మరేంలేదా?' అని తారాజువ్వలా లేచేవాడు.

వాళ్లతో—అంటే ఆడపిల్లలతో—కలిసి మూర్తి తిరుగుతుంటే అందరికి మల్లికి రాజుకు కూడా అసూయ కలిగేది. ఆ అసూయతోబాటు ఒక భయంకరమైన అనుమానం కూడా కలిగేది! 'కొంపదీసి ఈ వెర్రివెధవని వాళ్లుఆటలు పట్టించడం లేదుగదా?'

ఆ అనుమానం నిర్ధారణ చేసుకోవడానికి రాజుకి ఎన్నడూ అవకాశం చిక్కలేదు. నేరుగా మూర్తినే అడిగితే అతను తిట్టి పోతాడని తెలుసును గనుక అప్రయత్నం కూడా అతను చెయ్యలేదు.

చదువులైపోయింతర్వాత అందరూ నౌకరీలో కుదురుకున్నారు. అందరికి పెళ్లిళ్లయి పోయాయి కూడ ఆపెళ్లిళ్లయి కూడా అంతే. మూర్తి ఎక్కడుంటే అక్కడ బంతిపూల రథాల కొలువు వుండేది. అతను చెప్పే కబుర్లకి పొట్టలు పగిలేట్టు నవ్వుతూండేవారు వాళ్లు. బుద్ధావతారం లాగాఉండే మూర్తిలో అంతటి హాస్యచతురత ఎలా దాంకొని వుందా అన్నది మిత్రులకి ఎన్నడూ విడని మిస్టరీల్లో ఒకటి.

మిత్రులందరికీ పెళ్లిళ్లయి పిల్లలు పుట్టు కొస్తున్నా మూర్తి బ్రహ్మచారిగానే ఉండి పోయాడు. మిత్రు లందర్లోకీ అతనో

నిక్కువ సన్నిహితంగా వుండే రాజు ఒకటి రెండు సార్లు కేకవేశాడు కూడా "మీ అమ్మగారి కోరిక తీర్చడం కోసమైనా చేసుకోరా! ఎన్నాళ్లిలావుం టావు?" అని మూర్తి నవ్వేసి వూరుకునేవాడు.

అలాంటిది ఒకనాడు.

అప్పుడు రాజు గుంటూర్లో పనిచేస్తున్నాడు. ఆరోజు ఆఫీసు వదిలాక అతను బయటికి వొస్తుంటే మూర్తి ఎదురొచ్చాడు. అప్పటి మూర్తి అవతారం చూసి రాజు కొయ్యబారి పోయాడు. పూర్తి టెర్లిన్ డ్రెస్‌లో వున్నాడు మూర్తి. వేలికి తెల్ల రాంటిరాయి ఉంగరం పెట్టు కున్నాడు. తళతళ మెరిసిపోతున్నబూట్లు తొడిగాడు. క్రాపు నున్నగా దువ్వాడు. సెంటు కూడా రాసు కున్నాడు.

"ఏమిట్రా ఆ కోడి చూపు? నేనే మూర్తిని" అన్నాడు నవ్వుతూ.

"ఎంత బావున్నావురా వెధవా?" అన్నాడు రాజు ప్రీతిగా.

"సరిసరి! దిష్టి తగుల్తుందేమో?..... పద. హొటల్‌కి పోదాం" అన్నాడు మూర్తి.

ఇద్దరూ హొటల్‌కి నడిచారు. మూర్తి నడ కలో కూడా మార్పు వచ్చింది. గాలిలో తేలిపో తున్నట్లు నడుస్తున్నా డతను. హొటల్లో కూచుని, కావల్సినవి ఆర్డ రిచ్చాక "ఏమిట్రా విశేషాలు? ఏమంటుంది మా చెల్లెలు?" అన్నాడు మూర్తి.

"మా అన్నాయికి ఎప్పటికి బుద్ధొస్తుంది— అని అడుగుతుంది" అన్నాడు రాజు కసిగా.

మూర్తి పకపక నవ్వాడు. "ఆల్‌రైట్ అబ్బాయ్ మూర్తికి బుద్ధి వచ్చేసింది" అన్నాడు.

"అంటే......?" అన్నాడు ఆశగా రాజు.

"అవును బ్రదర్! నా అన్వేషణ ఫలించింది"

ఆనందం పట్టలేక మిత్రుడి భుజం పట్టుకు వూపేశాడు రాజు. కొద్ది క్షణాలకి తెప్పరిల్లి "ఎవరా అదృష్టవంతురాలు?" అన్నాడు.

"చెబుతాను. నీ టిఫిన్ కానియ్" అన్నాడు మూర్తి.

ఇద్దరూ తిండి ముగించి బయటికి వచ్చాక "సస్పెన్స్‌తో చచ్చిపోతున్నాను. ఎవరో చెప్పరా బాబూ?" అని రాజు వేధించగా మూర్తి చెప్పాడు.

ఆ అమ్మాయి పేరు కూడా అతనికి తెలియదు. తాము చదువుకున్న కాలేజికి వెళ్లే దోవలోవున్న ఆకుపచ్చ డాబా యిల్లు వాళ్ల నివాసం. మూర్తి చెప్పిన ఈ వివరాలు విని రాజు తెల్లబోయాడు.

"ఇడియెట్" అన్నాడు.

"నువ్వేమన్నా అను బ్రదర్! నాకు ఆఅమ్మాయి కావాలి. లేకపోతే పెళ్లే అక్కర్లేదు" అన్నాడు మూర్తి.

"ఏడవలేకపోయావ్. వాళ్లకులమేమిటో గోత్ర మేమిటో తెలియకుండా, ఈ గోలేమిట్రా? అన్నాడు రాజు నిరుత్సాహంగా.

"కులం — సంగతి ఎవడికి పట్టిందోయ్?"

"నీకు పట్టకపోతే వాళ్లకి పట్టదా?"

"నాన్సెన్స్! నే నంత హీనుణ్ణా?"

"నీ బొందలే!......పోనీ ఆ అమ్మాయికి నువ్వు తెలుసా?"

"నన్ను నాలుగైదుసార్లు చూసింది."

"అసలిదంతా ఎలా తటస్థ పడిందిరా?"

మూర్తి సవివరంగా చెప్పాడు. కాలేజి పక్కన సందులోవున్న ఒక స్నేహితుడ్ని కలుసుకో డానికి ఒక సాయంత్రం పూట వెడుతుంటే, ఆ డాబామీద జెడ ముందుకు వేసుకుని నిలబడి వున్న అమ్మాయి కనిపించింది. సాయంత్రపు నీరెండ పడి ఆమె ముఖం బంగారపు రంగులో ప్రకాశించింది ఆక్షణాన. మూర్తి కన్నార్పకుండా ఆమె వంకే చూశాడు. ఆమె కూడా అతని వంక చూసింది.

ఆ తర్వాత వరసగా వారం రోజులపాటు అతను ఆ యింటి వైపు వెళ్లాడు. ఆమె రోజూ కనిపిం పించింది. రోజూ అతని వంక అలాగే చూసింది. నమ్మకం చాలని మూర్తి రెండు మూడు తడవలు ఆ యింటి పక్కకి వెళ్ళి కూడా చూశాడు. ఆమె అటుకూడా రావడంతో అతనికి నమ్మకం బల పడింది. ఒకరోజున ఆమెనవ్వుతూ, తననిచూపిస్తూ పక్కనున్న స్నేహితురాలితో ఏదో చెప్పడంతో మూర్తిలో ఆశకి బీజాలు పడ్డాయి.

అదీకథ.

రాజు అంతావిని "ఇంతకీ ఆ అమ్మాయి నువ్వంటే యిష్టపడుతుందంటావు?" అన్నాడు.

"షటప్!" అన్నాడు మూర్తి కోపంగా.

రాజు నవ్వి "అది కాదురా! నువ్వు రోజూ హాజరు కావడం చూసి ఆ అమ్మాయికి ఎగతాళిగా వుందని ఎందుకు అనుకోవు?" అన్నాడు.

"ఎగతాళి దేనికి?"

రాజు ఇక ప్రశ్నించడం మానుకుందామనుకుని "ఇక ఏం చెయ్యదల్చుకున్నావ్?" అన్నాడు.

"ఆ అమ్మాయి తండ్రి రైల్వేలో పనిచేస్తు న్నాడు. అతన్తో మాట్లాడాలి."

"అంటే? మీఅమ్మాయిని నాకిచ్చిచెయ్యండి అని అడుగుతావా?" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

"ఏం? తప్పా?"

"తప్పని కాదు గాని, వాళ్లు వప్పుకోక పోతే?"

"శకునపక్షి మాటలు మాట్లాడకు. ఎందుకు ఒప్పుకోరు.? నాకన్నా మంచి అల్లుడు దొరుకు తాడా వాళ్లకి?"

నవ్వాపుకున్నాడు రాజు. "సరే అయితే! వెళ్లి అడుగు" అన్నాడు.

మూర్తి ఒక్క క్షణం ఊరుకుని "నేను ఒక్కడినీ వెళ్లలేను రాజూ! నువ్వుకూడా రావాలి" అన్నాడు.

"ఏడిసినట్టుంది."

"తప్పదు."

ఈ వ్యవహారం బెడిసిపోతే తన పేరు బయటికి రానివ్వనని వాగ్దానం చేయించుకొని, స్నేహితుడితో కలిసి బెజవాడ వచ్చాడు రాజు. తీరా సదరు అమ్మాయి తన పినతండ్రి కూతురు కాత్యాయనని తెలియడంతో రాజుకి కొండంత బరువు తీరినట్లని పించింది.

పిలిచినా ఏనాడూ రాని రాజు, పిలవకుండానే దిగబడడం అతని పినతండ్రి జగన్నాధానికి, పిన్నికి, కాత్యాయనికీ చాలా ఆనందం కలిగించింది. రాజు, కాత్యాయనిని చూసి అప్పటికి ఏ నాలుగైదేళ్లో అయివుంటుంది. తనకి చెల్లెలవుతుంది గనుక గాని, అదే మరోపిల్ల అయితే "ఏం బావుందిరా యీ అమ్మాయి?" అని కొట్టిపారేసేవాడే అతను. చివరికి ఆసాయంత్రం, పినతండ్రితో తను వచ్చిన రాచ కార్యం ముచ్చటించాడు అతను.

"నా అభ్యంతరం ఏముంది? దానిని కూడా అడిగి చూడాలి కదా?" అన్నాడు జగన్నాధం అంతా విని.

"అడిగి ఎప్పుడు చెబుతావు?"

"రెండుమూడు రోజుల్లో— ఉత్తరం రాస్తా నులే" అన్నాడాయన.

ఆయన ఎందుకో సందేహిస్తున్నాడని తోచింది రాజుకి. అదే మాట పైకి అన్నాడు.

"అంటే..!" నసిగా డాయన.

"కట్నం కానుకల సంగతా?"

"అబ్బెబ్బె! అదేం లేదు."

"మరి?"

"మీ ఫ్రెండ్ దానికి నచ్చుతాడా అని."

రాజుకు నవ్వొచ్చింది. "అదే అయితే నువ్వు చెప్పి వొప్పించు. వాడి వరకు పూచీ నాది. మనిషి చాలా మంచివాడు. పోనివ్వడం మంచిదికాదు." అన్నాడు.

"నువ్వింతగా చెప్పాల్రా?.. రెండురోజుల్లో కబురుచేస్తాములే?" అన్నాడాయన.

రాజు, ఆ తర్వాత అందరి దగ్గరా సెలవు తీసుకుని బయటికి వచ్చాడు.

నాలుగడుగులు వేశాక "ఏమన్నార్రా?" అన్నాడు మూర్తి.

రాజు అతని వంక చూశాడు. మనిషి ముఖంలో దైన్యం కనిపించింది.

బాబాయి చెప్పింది మూర్తికి చెప్పాడు రాజు.

"హోశ్! ఇంతేనా? అయితే త్వరలోనే ఆ.." అర్థోక్తిలో సిగ్గుపడ్డట్లుగా ఆగిపోయాడు మూర్తి.

ఆ తర్వాత రెండురోజులు గడిచాయి. మూర్తి మళ్లా గుంటూరు వచ్చి రాజును కలుసుకున్నాడు. అప్పటికింకా జగన్నాధం ఏమీ రాయలేదు. మూర్తి మాట కాదనలేక తిరిగి బెజవాడ వచ్చాడు రాజారావు.

"అమ్మాయి యిష్టంగా మాట్లాడడంలేదు రాజా!" అన్నాడు జగన్నాధం.

ఆమాట విన్నప్పుడు మూర్తి ముఖంలో కని పించిన దైన్యం రాజును శృంగదీసి వేసింది. "ఆవి డంత అప్సరసేమిట్రా? ఆవిడ కాకపోతే ఆవిడ తల్లో జేజెమ్మ దొరుకుతుంది." అని రాజు అంటే "థాంక్స్ రాజా! వస్తాను" అనేసి వెళ్లిపోయాడు మూర్తి.

ఆతర్వాత రెండునెలలు గడిచిపోయాయి. ఒకరోజున ఉన్నట్టుండి జగన్నాధం గుంటూరు దిగబడ్డాడు. ఆఫీసులోనే రాజుని కలుసుకుని "నీతో పని వుండి వచ్చాన్రా" అన్నాడు.

రాజుకి పినతండ్రితో సవ్యంగా మాట్లాడా అనిపించలేదు.

"ఏమిటి విషయం?" అన్నాడు ముభావంగా.

"మీ స్నేహితుడి సంగతి."

"మూర్తి సంగతా?"

"ఊ! వాళ్ళింటికి పోయొద్దాం వస్తావా ?" అన్నాడు.

రాజు బాబాయి వంక పరిశీలనగా చూసి, "సంబంధం కోసమా?" అన్నాడు.

"ఔన్నా! కాత్యాయని వొప్పుకున్నది. నీకు వీలుంటే యివాళే బయలుదేరి వెడదాం." అన్నాడాయన.

"రమ్మంటే వస్తాను. కాని సంబంధం కుదురుతుందని గ్యారంటీ యివ్వలేను" అన్నాడు రాజు.

"అవేం!" అన్నాడాయన భయంగా.

"ఔను బాబాయ్! వాడు బంగారపు పిచ్చిక. ఈపాటికి మరో సంబంధం కుదిరిపోయుంటే?"

"అంతేనంటావా?" అన్నాడాయన నిరాశగా.

"అంతేగా?.. అయినా పోయొద్దాంలే. రేపు ఆదివారం. ఇద్దరం వెడదాం." అన్నాడు.

"అతని క్కూడా రేపు సెలవేనేమో?"

"వాడికి రోజూ సెలవే!" అని "పద పోదాం" అన్నాడు రాజు.

సంబంధం కోసం జగన్నాధం వచ్చాడని రాజు చెప్పేసరికి మూర్తి ఆనందంతో డాన్స్ చేసినంత పని చేశాడు. "చూశావా? ఆరోజున నేను చెబితే ఋకాయించావు. ఇప్పుడేమంటావు?" అన్నాడు.

రాజారావు నవ్వుకున్నాడు.

పెళ్ళయి పోయిం తర్వాత హనీమూన్‌కి బెంగుళూరు వెళ్లిన మూర్తి అక్కడ నుంచి రాసిన ఉత్తరం చదివిన రాజుకి ఆనందం కంటనీరు తిరిగింది. "కవిత్వం రాయడం నాకు యిష్టంలేదని, కొంతవరకు అసహ్యం అనికూడా నువ్వెరుగుదువు, కాని రాజూ! మీ చెల్లెలి వడిలో పడుకున్నప్పుడు నాకు ఎక్కడ లేని కవిత్వమూ వస్తున్నది. ఎంత

# ఇడియెట్

అదృష్టవంతుణ్నోయ్ నేను?" అని రాశాడు మూర్తి.

రాజు ఆలోచనలని తెంపి వేస్తూ ప్యూన్ మాట వినపడింది. "అయ్యగారు పిలుస్తున్నారు సార్!" అన్నాడు తను. రాజు లేచి ఆఫీసర్ గదిలోకి వెళ్ళాడు. ఆయన యితన్ని చూసి చిన్నగా నవ్వుతో "వాట్ మిస్టర్ రాజూ! పరధ్యానంలో మునిగి వున్నావు? మీ యింటికి మళ్ళా కొత్త మెంబరెవరన్నా....." అన్నాడు.

రాజు సిగ్గుగా నవ్వి "లేదు సార్" అన్నాడు.

"ఆ నవ్వే చెబుతోంది. గుడ్‌లక్!.. ఇంతకు పూర్వం కొడుకు కదూ? దిస్ టైమ్ ఐ విష్ యూ ఏ డాటర్" అన్నాడాయన.

రాజు ఒక్కక్షణం ఊరుకుని "రెండురోజుల సెలవు కావాలి సార్. బెజవాడ పోయి రావాలి" అన్నాడు.

"అలాగే!..ఈ డ్రాఫ్ట్లు రెండూ చూసి వాటితో పాటే లీవ్ లెటర్ కూడా పంపించు" అన్నాడాయన ఒకఫైలు ముందుకు యిస్తూ.

రాజు తల వూపి ఫైలు అందుకొని బయటికి వచ్చాడు.

* * *

బెజవాడలో బస్సుదిగిన రాజుకి, ఎదురుగా కాంటీన్ దగ్గర ఎవరో అమ్మాయితో నవ్వుతూ మాట్లాడుతూ నిలబడి వున్న మూర్తి కనిపించాడు. రాజు అటుకేసి నడిచాడు. ఆవిడతో మాట్లాడుతూ ముఖం యిటు తిప్పిన మూర్తి మిత్రుడ్ని చూసి "అరె! ఎప్పుడొచ్చావురా!" అన్నాడు.

"ఇప్పుడే" అన్నాడు రాజు ఆ అమ్మాయిని క్రీగంట చూస్తూ.

మూర్తి ఆమెని పరిచయం చేసి "వస్తాను ఊర్మిళగారూ! మీ ఆయన్ని అడిగానని చెప్పండి" అని మిత్రుడి బుజాల మీద చెయ్యివేసి "పద" అన్నాడు.

బస్‌స్టాండులోంచి రోడ్డు మీదికి వచ్చాక "ఏమిటలా హఠాత్తుగా ఊడిపడ్డావు?" అన్నాడు మూర్తి.

"కాత్యాయని రమ్మని రాస్తే వచ్చాను" అన్నాడు రాజు అతని వంక నిశితంగా చూస్తూ.

మూర్తి నవ్వు ముఖంతో "ఏం రాసిందేమిటి?" అన్నాడు.

రాజు జేబులోంచి ఉత్తరం తీసి అతని కందించాడు.

మూర్తి ఆ ఉత్తరం చదువుతూన్నంతసేపు రాజూ అతని ముఖం వైపే చూశాడు. చిన్నపాటి మందహాసం మినహా అతని మొఖంలో ఎలాంటి మరోమార్పూ అగపడలేదు. చదవడం పూర్తి చేశాక "సరాసరి అక్కడికి వెడతావా? మా యింటి కొచ్చి వెడతావా?" అన్నాడు మూర్తి.

"మీ యింటికి రావడం అవసరమా?" అడిగాడు రాజు.

"వస్తే సంతోషిస్తాను."

"పద"

ఇద్దరూ మూర్తి యింటికి వచ్చారు. మూర్తి తల్లి కుశలప్రశ్నలకి జవాబు చెప్పి, మూర్తి గదిలోకి వచ్చిన రాజు 'ఈ గ్రంధమంతా తల్లికి తెలియదన్నమాట?' అనుకున్నాడు. కూచున్నాక "ఏమిట్రా ఈ గొడవ?" అన్నాడు రాజు.

మూర్తి వెంటనే జవాబు చెప్పలేదు. రాజు వంక తదేకంగా కొద్దిసేపు చూసి "మీ చెల్లెలు నేను విడిపోతున్నాం రాజూ!" అన్నాడు.

రాజు "ఛ" అన్నాడు బాధతో అసహ్యంతో.

"ఔన్నా! నాతో కాపరం చెయ్యలేనని పుట్టింటికి వెళ్లిపోయింది."

"ఎందుకని?"

"రాత రాజూ! రాత" అన్నాడు మూర్తి.

అతని కళ్ళు అశ్రుసిక్తాలవడం రాజు గమనించాడు. కంట తడిపెట్టే మగవాళ్లంటే అసహ్యించుకునే మూర్తికి కన్నీరా? ఏమిటో చెప్పరాదురా?" అన్నాడు రాజు.

"చెబుతాను బ్రదర్! ఇదంతా విని నువ్వు నన్ను అసహ్యించుకుంటావు. నాకు తెలుసు. కాని దయవుంచి నీ చెల్లెలిని మాత్రం అసహ్యించుకోకు అది నేను భరించలేను.

"నీకు సత్యవతి గుర్తుందా? జడ్జి చలపతి రావుగారి అమ్మాయి. ఆ అమ్మాయికి యీమధ్యనే పెళ్లయింది. వారం పదిరోజుల క్రిందట మొగుడితో సహా మా యింటికి వచ్చి నాలుగైదు రోజులుండి వెళ్లింది.

"నీకు తెలుసుగా! ఆ అమ్మాయి నేను ఒకప్పుడు చాలా స్నేహంగా వుండేవాళ్లం. అప్పట్లో ఆ స్నేహాన్ని ఆ అమ్మాయి అపార్థం చేసుకున్నది. ఒకరోజున నా దగ్గరేదో నవల పట్టుకుపోయి తిరిగి యిస్తూ అందులో ప్రేమలేఖ పెట్టి యిచ్చింది. నేను లేకపోతే తాను బ్రతకలేనని, నాతో పెళ్లి కాకపోతే తాను ఉరిపోసుకుంటానని ఆ ఉత్తరం తాత్పర్యం.

"ఆ ఉత్తరం చదివినప్పుడు నాకు చాలా బాధ కలిగింది. ఆ అమ్మాయికి ఏం సమాధానం చెప్పాలో



తోచక కొద్దిరోజుల పాటు ముఖం చాటేసుకుని తిరిగాను. చివరికొక రోజున నా మనసులో అభిప్రాయం — ఆమెని చేసుకోవాలని నాకు లేదని తెలుపుతూ ఉత్తరం రాశాను.

"ఆతర్వాత కొన్నాళ్ళు ఆమెకీ నాకూ మాటల్లేకుండా పోయాయి. చివరికొక రోజున, ఏమనుకుందో ఏమో, తనంతట తానే మా యింటికొచ్చి పలకరించింది. జరిగిందంతా మర్చిపొమ్మని, స్నేహితులుగానే వుందామని అన్నది. ఆమె అంటే నాకు ఎలాంటి కోపమూ లేదు గనుక సరేనన్నాను.

"ఆతర్వాత వాళ్ళ నాన్నగారికి మరో ఊరు బదిలీ కావడం, సత్యవతి వైజాగ్‌లో ఎం. ఎ. చదవడానికి వెళ్ళడం నీకు తెలిసినవేగా? పెళ్లి శుభలేఖ వచ్చేవరకు ఆమె ఎక్కడ వుందో కూడా నాకు తెలియదు. శుభలేఖ చూశాక మళ్లీ ఉత్తరం రాశాను—రాలేకపోతున్నందుకు ఏమీ అనుకోవద్దని, శుభాకాంక్షలనీ చెబుతూ, వీలైతే యిద్దరు కలిసి రావలసిందని కూడా ఆహ్వానించాను.

"ఆ ఆహ్వానం మీదనే వాళ్లిద్దరూ యిక్కడికి వచ్చారు. ఏదో మాటల సందర్భంలో ఆ ఉత్తరాల ప్రసక్తి వచ్చిందిట. "మీ ఆయన చాలా బాగా రాస్తారు. ఆయన ఉత్తరాల్ని స్నేహితులందరూ అపురూపంగా దాచుకొంటారు. నాకూ ఆయన చాలా ప్రేమగా ఉత్తరాలు రాశారు" అన్నదిట.

"ఆ పైనే నేనేమీ చెప్పను. నువ్వేఊహించుకో" ముగించాడు మూర్తి. రాజు ఒక్కక్షణం ఊరుకుని "ఎన్ని అబద్ధాలు చెబుతావురా?" అన్నాడు జాలిగా.

"అబద్ధాలా?"

"నిజానికి జరిగిందింతేనా? ఈమాత్రానికే కాత్యాయని పుట్టింటికి వెళ్లిపోయిందా?"

"నమ్మకపోతే నీ ఖర్మ ! జరిగింది మాత్రం అంతే."

"నా ముఖం చూసి చెప్పు"

మూర్తి నవ్వడానికి ప్రయత్నిస్తూ "ఏమిటనుకుంటున్నావు నువ్వు?" అన్నాడు.

ఆ ప్రశ్నకి జవాబు చెప్పవలసిన అవసరం లేదని రాజుకు తెలుసు. ప్రాణం మీదికి వచ్చిన ఈనాడు గాని సత్యవతి తనకి ఉత్తరం రాసిందని చెప్పని మూర్తి, అంత తేలిగ్గా అసలు విషయం ? చెబుతాడని రాజు అనుకోవడంలేదు. కాని తన మనసులో ఉన్న అనుమానం బయట పెడితే మూర్తి తన మీద తారామండలానికి లేస్తాడు.

"ఏమిట్రా ఆలోచిస్తున్నావు ?" అన్నాడు మూర్తి.

"ఏంలేదు.. సరే! నేను కాత్యాయని దగ్గరికి వెళ్తొస్తాను." అన్నాడు రాజు లేస్తూ.

"అలాగే" అని "అన్నట్లు నిన్న ఏలూరు నుంచి పూతరేకులు తెప్పించాను. పూత రేకులంటే మీ చెల్లెలికి ప్రాణం. కాసినిస్తాను. పట్టికెళ్ళు." అన్నాడు మూర్తి.

రాజు అతని ముఖం వంక పరీక్షగా చూశాడు. మనసులో హాలాహలం దాచుకుని, పైకి నిబ్బరంగా వుండగలగడం ఎంతటి త్యాగానికి నిదర్శనమో ఆక్షణాన రాజుకి అర్థమైనట్లు తోచింది.

రాజు కదలబోతూ "సత్యవతి భర్త పేరు శంకరం. కదూ?" అన్నాడు.

మూర్తి ముఖం పక్కకి తిప్పుకుని "ఔను" అన్నాడు.

రాజు అనుమానం తీరిపోయింది. శంకరం కాత్యాయనికి చాలా దగ్గిర చుట్టం. కాత్యాయని మూర్ఖంగా ప్రవర్తించకపోతే, ఈ వెర్రివెధవ తన కోసం కట్టిన స్వర్గం ఆమెకి దూరం కాదు.' అనుకున్నాడతను. ఒకసారి మిత్రుడ్ని తనివిదీరా కౌగలించుకుని, అతనిచ్చిన పొట్లాం చేతబట్టుకుని, భారంగా అడుగులు వేస్తూ రోడ్డు మీదికి వచ్చాడు రాజు. ●

### గమనిక

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ కింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తిపేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5. సిరాలోనే రాయాలి. —సం॥





# వారఫలం

## 30-8-1968 శుక్రవారం మొదలు 5-9-1968 గురువారం వరకు

**మేషం:** వారం ప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది, ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—కుటుంబవ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృషభం:** ఫలితంమాట యెలాగ ఉన్నా, ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మిథునం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలకు అనుకోని మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతి పక్షాల సంచలనం పెరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. పోటీవారితో మాట పట్టింపులు తగవు

**కర్కాటకం:** వ్యాపారంలో మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. నూతన వ్యవహారాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం:** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. రాజకీయవ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కన్య:** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు, సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. నూతన వ్యవహారాలు ఫలించ గలవు

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**తుల:** వ్యాపారంలో ప్రయోజనం గల వ్యక్తులను కల్సుకొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. బంధువులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**వృశ్చికం:** వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతిలభించ గలదు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు:** ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**మకరం:** వ్యాపారంలో మీరు యిది వరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కుంభం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణిస్తుంది. పోటీ వారిలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో అనుకోని చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు.

**మీనం:** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణంద్వారా కార్యసాధన చేయగలరు. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు.

—మహేష్

# హాస్యం - హాసం

## (నవ్వగలిగితే నవ్వండి)

### డిగ్రీ తీసుకున్నాక ః కిం కర్తవ్యం

ఒక కాలేజి విద్యార్థి కుతూహలంతో "కాలేజి చదువు పూర్తి చేసి డిగ్రీ తీసుకున్నాక ఏమి చదవమని మీ సలహా?" లెక్చరర్ని ప్రశ్నించాడు.

"ఉద్యోగానికి పత్రికలలో ప్రకటనలు చదువు నాయనా!" అని రకీమని సమాధానం చెప్పాడు లెక్చరరు.

### అనుభవ శూన్యం

వో కన్నతల్లి పురిటినెప్పులు చాలా ఎక్కువగా వుండటంతో ప్రసవవేదన భరించలేక విపరీతంగా కేకలు వేస్తోంది.

లేడీ డాక్టరు మిస్ కరుణ వచ్చి, "అంత గట్టిగా కేకలు వేయకు. కాస్త వోర్చుకో!" అంది.

"నీకు పెళ్లే కాలేదు—నీకేం తెలుసు ఈ బాధ అమ్మా......" అని బాధగా నిసుక్కుంది కన్నతల్లి మెనువుగా.

మిస్. కరుణ నవ్వుకుంది వోరారా.

(గమనిక : కన్నతల్లి, మిస్ కరుణ హైస్కూలులో సహాధ్యాయులు, మీదు మిక్కిలి స్నేహితులు.)

### దుశ్శకునం

టికెట్ కలెక్టర్ టిక్కెట్లు తనిఖీ చేస్తూ, వో ముక్కు పొడుం శాస్త్రిగారి దగ్గరికి వచ్చి టికెట్ చూసి "మీరు దిగవలసిన స్టేషను దాటిపోయింది!"

"అవును నాయనా! నేను దిగుదామనుకుంటూంటే ఎవడో తుమ్మేడు. అందుకని దిగలేదు" అని సమాధానం ఇచ్చారు శాస్త్రిగారు వో పట్టు పీలుస్తూ.

### సీటు లేకపోతే ఉపాయం

ఆ పట్టణంలో ఎక్కడా ఆరవ తరగతిలో సీట్లు దొరకక మిగిలిన ఆ ఒక్క స్కూలులోనూ ప్రయత్నించి చేర్పించాలి అని కుర్రవాడిని తీసుకువెళ్లి హెడ్‌మాష్టరును కలుసుకొని "ఏవిధంగా అయినా సీటు ఇప్పించాలి" అని ప్రాధేయపడ్డాడు కుర్రవాని తండ్రి.

"సీట్లు అన్నీ నిండిపోయాయి. ఇంక సీట్లు లేవు—నన్నేం చెయ్యమంటారు?" అన్నాడు ముఖం చిట్లించుకొని హెడ్‌మాష్టరు.

వెంటనే కుర్రవాడు "సీట్లు లేకపోతే క్రింద అయినా కూర్చుంటాను—చేర్చుకోమను నాన్నా!" అన్నాడు తండ్రితో ఎక్కడ తను చదువు మానవలసి వస్తుందోనని భయంతో.

### ఏమిటో ముందు చెప్పాలి

మా నాలుగేళ్ల వాసుని వాళ్ల అమ్మమ్మగారి ఇంటి దగ్గరనించి తీసుకు రావటానికి వెళ్లాను. వస్తూంటే వాడిని ఎత్తుకుని వాళ్ల అమ్మమ్మ "వాసూ! మీ బామ్మని అడిగానని మరీ మరీ చెప్పు!" అంది.

"ఏమిటి? ఏమిటడిగావని చెప్పను అమ్మమ్మా" అన్నాడు వాసు.

### పరీక్ష తప్పటానికి కారణం?

పరీక్ష తప్పిన పిల్లవాని తండ్రి కోపంతో, "నీ కొక్కడికే పేపర్లు కష్టంగా ఉన్నాయా? పక్కింటి శారద ఎల్లాగ ప్యాసయ్యింది? ఆడపిల్ల పాటి చెయ్యావు. వెధవా:" అని చిందులు తొక్కుతున్నాడు.

"నువ్వు పరీక్షలో కాపీ కొట్టటం తప్పు అని చెప్పావు?......మరి వాళ్ల నాన్న చెప్పలేదుట!" అన్నాడు దండయాత్ర చేసిన పిల్లవాడు పౌరుషంగా.

### భయమెందుకే చిట్టీ

ఒకే కాలేజీలో చదువుకునే పెళ్లి కాని అబ్బాయి అమ్మాయీ (కన్నెపిల్ల) చాలా స్నేహంగా ఉంటున్నారు. వాళ్ల స్నేహం ఎంతవరకూ వచ్చిందంటే కాస్త సందు దొరికితే ఏ సినిమాకో, షికారుకో పోయి సరదాగా గడపటంలో ఎంతో ఆనందం పొందేవారు. వో రోజు వూరి బయట అడవిలోకి సాయంత్రం హుషారుగా షికారుకి వెళ్లారు. ఆకాశం, చెట్లూ, కొండలూ అన్నీ ఎంతో ఆహ్లాదంగా కనిపించాయి—ఈ లోకం మరచిపోయాడు అబ్బాయి.

"ఇంక చీకటి పడుతోంది—చాలాదూరం వచ్చాం నిర్మానుష్యంగా వుంది— వెనక్కి పోదాం—నాకు భయం వేస్తోంది!" అంది చిట్టితల్లి (అమ్మాయి).

"నేను నీ ప్రక్కన వుండగా భయమెందుకు?" అన్నాడు దీమాగా భరోసా ఇస్తూ అబ్బాయి.

"అందుకే!" అన్నది అమ్మాయి జాగ్రత్త పడుతూ.

### ఎవరి వృత్తిరీత్యా ??

డాక్టరు వైద్యనాథం తీరిక చేసుకొని ఆయన సతీమణి కోరికపై సినిమాకి బయలుదేరారు. హాలు దగ్గర వో అందమైన పడుచుపిల్ల డాక్టరు గారికేసి చూసి చిరునవ్వు విసరి మెరిసే కళ్లతో పలకరించింది. అది గమనించిన సతీమణి ముఖం చిట్లించుకొని "ఏమండీ! ఆ అమ్మాయిని ఎప్పుడేనా కలిసారా?" అని ఉండబట్టలేక అడిగేసింది.

"ఆ! వృత్తి రీత్యా ఒకసారి కలుసుకొన్నాం" అన్నారు వైద్యనాథం.

"మీరా? లేక.....ఆమెయా?" అని తిరిగి ప్రశ్నించింది సతీమణి కుతకుతలాడుతూ.

### ఉద్యోగం పురుష లక్షణం—వినయం వ్యాపార లక్షణం

కిరాణా కొట్టుకి కుర్రాడిని పంపితే కే. జీ. కందిపప్పుకి పదిహేను పైసలు ఖరీదు ఎక్కువ తీసుకున్నాడని, తూనికలు మరియు కొలతల ఇనస్పెక్టరుగారికి వారి శ్రీమతి రాత్రి ఫిర్యాదు చేసింది. మరునాడు సదరు ఇనస్పెక్టరు కిరాణా కొట్టు దగ్గరికి కుర్రాడిని తీసుకు వెళ్లి —

"ఏమయ్యా! నిన్న వీడికి కందిపప్పు కే. జీ. ఎల్లాగ ఇచ్చావ్?" అని ప్రశ్నించాడు కోపంగా.

"సరిగ్గా తూచి ఇచ్చానండి!" అని సమాధానం చెప్పాడు వ్యాపారి వినయంగా.

### మిశ్రమ ఆహారం

"మిశ్రమ ఆహారమనగానేమి?" అన్న ప్రశ్నకు ఒక విద్యార్థి వ్రాసిన జవాబు : "పప్పు, నెయ్యి, కూర, పచ్చడి, పులుసు, పెరుగు, పిండివంటలు అన్నీ ఉన్న ఆహారమే మిశ్రమ ఆహారం"

దీనికి ఎన్ని మార్కులు వెయ్యాలి? అన్నది తెలలేదు గురువుగారికి.

—రాజవరపు పార్థసారథి




వచ్చే 'ఏకాదశి'నాడు మీరు తప్పక మాయింటికొస్తే ఒక ప్లేటు పస్తుంది వెళ్లాలి సార్!!

# ముగ్గురు మూర్ఖులు



## వినాయకుని వరం

మహేష్ — వసుంధర

'దేశంలో అవినీతి ప్రబలిపోయింది. శాసనాలను గౌరవించడంకంటే ఉల్లంఘించడమే ఎక్కువగా జరుగుతూంది. దేశంలో చాలాచోట్ల మద్యపాన నిషేధ శాసనాలు అమలులో ఉన్నాయి. కాని వాటిని ప్రజలు ఎంత బాహాటంగా, యెంత పెద్ద ఎత్తున ఉల్లంఘిస్తున్నారో వేరే చెప్పవలసిన అవసరం లేదు. అలాగే లంచగొండితనానికి వ్యతిరేకంగా యెన్నో శాసనాలు అమలులో ఉన్నాయి. కాని గాలివలెనే లంచగొండితనం కూడా సర్వవ్యాప్తంగా ఉన్న మాటను ఎవరైనా కాదనగలరా?' అంటూ తన నిరాశను వెలిబుచ్చాడు చిదంబరం.

'ప్రస్తుతం ఉన్న యీ పరిస్థితికి కేవలం యీ తరానికి చెందిన ప్రజలను నిందించడంవలన ప్రయోజనం లేదు. దీనికి చారిత్రక కారణాలు చాలా ఉన్నాయి' అంటూ చెప్పడం ప్రారంభించాడు.

'గత వెయ్యి సంవత్సరాల్లో యిది నా ప్రభుత్వం', 'యీ ప్రభుత్వం నా ప్రయోజనాలను తప్పక కాపాడుతుంది', 'యీ ప్రభుత్వాన్ని గౌరవించవలసిన బాధ్యత నామీద ఉంది' అని దేశంలో అత్యధిక సంఖ్యాకులచేత భావింపచేయగలిగిన ప్రభుత్వం యేదీ యేర్పడలేదు.'

'ప్రజలూ, ప్రభుత్వమూ ఒకరి కొకరు దూరంగా ఉండిపోవడం మాత్రమేకాదు. ఒకరి కొకరు శత్రువులుగా నిలబడిన సంఘటనలు మన దేశ చరిత్రలో చాలా ఉన్నాయి. ప్రభుత్వాన్ని వ్యతిరేకించిన వ్యక్తులే సమాజంలో నాయకులుగా పరిగణింపబడ్డారు. అందుచేతనే ప్రభుత్వం మీద, ప్రభుత్వపు శాసనాలమీద ప్రజలకు గౌరవం లేకుండా పోయింది.'

'అంతే కాకుండా, ఆంగ్ల ప్రభుత్వాన్ని యెదురించడానికి మహాత్మాగాంధి శాసనోల్లంఘనాన్ని ఒక ఆయుధంగా స్వీకరించాడు. శాసనోల్లంఘనాన్ని ప్రజలకు బాహాటంగా బోధించడంవలన మున్ముందు దుష్ఫలితాలు కలగవచ్చునని కొంత మంది నాయకులు గాంధీని హెచ్చరించారు. కాని ఆ పరిస్థితిలో శాసనోల్లంఘనంకంటే శక్తివంతమైన సాధనం యేదీ మహాత్మాగాంధికి కన్పించలేదు. అందుచేత ఆయన యీ మార్గాన్ని అనుసరించక తప్పలేదు.'

'ఈ అన్ని కారణాలవలన శాసనాలను ఉల్లంఘించడం ప్రజలకు అలవాటు అయిపోయింది' మన దేశంనుంచి ఆంగ్లేయులు వెళ్ళిపోయిన తరువాత యీ పరిస్థితి మారిపోతుంది. ప్రజలు శాసనాలను గౌరవిస్తారని కొంతమంది అనుకొన్నారు. కాని ప్రజలచేత శాసనాలను గౌరవింపచేయగల సామర్థ్యంగల నాయకుడు మనకు యింతవరకు లభించలేదు. అందుచేత యీ పరిస్థితిలో మార్పు రాలేదు.'

'ప్రజలచేత శాసనాలను గౌరవింప జేయడానికి సర్దార్ పటేల్‌వంటి సమర్థుడైన నాయకుడు దేశానికి చాలా అవసరం. అటువంటి నాయకుడు లభించేవరకు దేశ పరిస్థితిలో మార్పురాదు' అని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు చంద్రావు.

'నువ్వు చెప్పింది కూడా కొంతవరకు నిజమే. కాని యింతకంటే ముఖ్యమైన కారణం మరొకటుంది' అన్నాడు మూడామణి.

'ఏమిటా కారణం?' అని చిదంబరం, చంద్రావు ఒకేసారి ప్రశ్నించగా మూడామణి చెప్పడం ప్రారంభించాడు.

ప్రపంచంలో రెండు రకాల జంతువులు ఉన్నాయి. ఒకటి పగటి పూట ఆహారాన్ని సంపాదించుకొని, రాత్రిపూట నిద్రపోయేవి. ఆవు, మేక, మొదలైన జంతువులు యీ రకానికి చెందుతాయి.

రెండవ రకం జంతువులు రాత్రిపూట ఆహారాన్ని సంపాదించుకొని, తిని పగటిపూట నిద్రపోతాయి. పులి, సింహం మొదలైన జంతువులు యీ రకానికి చెందుతాయి.

ఈ రెండు రకాల జంతువులకు ప్రధానమైన తేడా ఒకటి ఉంది. పగటిపూట ఆహారాన్ని తినే జంతువులు కొన్ని, ఉదాహరణకు నాలుగు ఆవులు ఒకచోట ఉన్నాయనుకొందాం. అక్కడ రెండు ఆవులకు మాత్రం సరిపోయే గడ్డి ఉంది. అయినా ఆ నాలుగు ఆవులు ఆ గడ్డి ఉన్నంతవరకూ కలిసి తింటాయి. తరువాత కావలసిన ఆహారంకోసం దేని మట్టుకు అది ప్రయత్నం చేసికొంటుంది.

రాత్రిపూట ఆహారాన్ని తీసికొనే జంతువులు అలాగ ప్రవర్తించవు. ఉదాహరణకు ఒక పులికి నాలుగు పులులకు సరిపోయే మాంసం లభించిందనుకొందాం. ఆ పులి మిగిలిన పులులతో కలిసి తిన డానికి అంగీకరించదు. ఒకవేళ మరొక పులి అక్కడకు వస్తే దానితో దెబ్బలాడుతుంది. ఆ దెబ్బలాటలో బలమైన పులి జయిస్తుంది. వోడిపోయిన పులి అక్కడనుంచి పారిపోతుంది. గెలిచిన పులి తనకు యిష్టం వచ్చినంత మాంసాన్ని తిని మిగిలిన దానిని వదలి వేస్తుంది.

'మానవుడు సహజంగా పగటిపూట ఆహారాన్ని తీసికొని రాత్రిపూట నిద్రించే జంతువు. అయినా అతడు రాత్రిపూట నిద్రించే జంతువువలె ప్రవర్తిస్తున్నాడు. తనకు కావలసిన దానికంటే అదనంగా లనకి ఆహారం డబ్బు మొదలైనవి ఉన్నా, అవను వాటిని యితరులకు యివ్వడానికి అంగీకరించడం లేదు. ఇది ప్రకృతికి విరుద్ధం. మానవుడు యిలాగ ప్రకృతికి విరుద్ధంగా వ్యవహరించడమే యీ సమస్యలకు ఉత్పత్తికి కారణం' అని తేల్చాడు చూడామణి.

'ఈ విషయంలో సామాన్య మానవులను కూడా నిందించడానికి అవకాశం లేదు. ఎందుచేతనంటే ప్రతి మానవుడూ తనూ,తన కుటుంబమూ సుఖంగా గౌరవంగా జీవించాలని కోరుకొంటాడు. దానికి అతడు కొంత డబ్బును సంపాదించడం అవసరం. ఆ సంపాదించడంలో అతడు తనకు ప్రస్తుతం కావలసిన దానికంటే అదనంగా సంపాదించాడనుకొందాం. అప్పుడు అతను అదనపు ధనాన్ని భవిష్యత్తుకోసం దాచుకోవడానికి ప్రయత్నిస్తాడు. అలా కాకుండా అతడు సంపాదించిన అదనపు ధనాన్ని యితరులకు పంచిపెట్టివేస్తే, మున్ముందు తనకు కావలసివచ్చినప్పుడు మిగిలినవారుగాని, ప్రభుత్వంగాని తనకు తోడ్పడతారని హామీ యేమి ఉంటుంది ? అందుచేత సామాన్య మానవుడు కూడా యీ పరిస్థితికి వ్యక్తిగా బాధ్యుడుకాడు' అని అన్నాడు చిదంబరం.

అయితే యీ పరిస్థితికి కారణం ఎవరంటావు? అని చంద్రరావు ప్రశ్నించాడు.

అసలు యీ నిమ్నోన్నత ఆర్థిక వ్యవస్థలోనే ఉంది యీ లోపమంతా. అయినా యే వ్యక్తికి వీలు అయినంతవరకు ఆ వ్యక్తి డబ్బు దాచుకొనడానికి అవకాశం యిప్పుడు ఉంది. ఈ అవకాశం ఉన్నంతవరకూ మానవుడు అవినీతికి లొంగిపోతాడు.

ఈ నిమ్నోన్నత ఆర్థిక వ్యవస్థను తొలగించి సమాజాన్ని సరియైన స్థితిలో ఉంచవలసిన బాధ్యత ప్రభుత్వంమీద, నాయకులమీద ఉంది. కాని ఆ నాయకులే ప్రజల డబ్బును తిని వేస్తున్నారు. కంచెయే చేనును మేసివేస్తూంది' అన్నాడు చిదంబరం.

నాయకులు ప్రజల డబ్బును తిని వేస్తున్నారన్నావు. దానికి వినాయకుని వరం ఉంది గదా ! అన్నాడు చూడామణి.

ఏమిటా వరం? అని చిదంబరం ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

ఒకప్పుడు ప్రపంచంలో ఏనుగుల సంఖ్య పెరిగిపోయింది. అందుచేత వాటికి కావలసినంత ఆహారం లభించలేదు. ఆకలిచేత ఏనుగులు బాధపడి, చివరకు తమ నాయకుడైన వినాయకుని ప్రార్థించడం ప్రారంభించాయి. అప్పుడు వినాయకుడు వాటికి ప్రత్యక్షం అయాడు.

"మీకేమి వరం కావాలి?" అని వినాయకుడు యేనుగులను ప్రశ్నించాడు.

"దేవా! మా సంఖ్య పెరిగిపోయింది. అందుచేత మాకు కావలసిన ఆహారం లభించడంలేదు. మాకు సంతృప్తికరమైన ఆహారం ఎప్పుడూ లభించే లాగున వరాన్ని ప్రసాదించవలసింది' అని యేనుగులు అన్నాయి.

"ఏనుగులారా! మీ సంఖ్య పెరిగిపోయింది కాబట్టి మీకు కావలసినంత ఆహారం యిప్పుడు దొరకదు. అందుచేత మిమ్మల్ని మనుష్యులుగా సృష్టిస్తాను. అప్పుడు మీకు తగినంత ఆహారం లభిస్తుంది.''

వినాయకుడు చెప్పిన యీ మాటలను వినగానే యేనుగులకు ఒక సందేహం వచ్చింది. 'వినాయకుడు మనలను మనుష్యులుగా సృష్టిస్తానన్నాడు. అది బాగానే ఉందికాని మనం తినే ఆహారంలో పదవ వంతు ఆహారాన్ని కూడా మనుష్యుడు తిన లేడుగదా! అప్పుడు మనకు సంతృప్తి యెలాగ కలుగుతుంది' అని యేనుగులు తమలో తాము అనుకొన్నాయి. చివరకు ఒక ముసలి యేనుగు యీ సందేహాన్ని వినాయకునికి విన్నవించింది.

అప్పుడు వినాయకుడు చిరునవ్వు నవ్వి, వాటితో యిలాగ అన్నాడు.

'యేనుగులారా! మీకు అటువంటి సందేహం ఉండవలసిన అవసరంలేదు. మీరు మామూలు మనుష్యులుగా జన్మించరు. స్వతంత్ర భారత దేశంలో మీరు రాజకీయ నాయకులుగా జన్మిస్తారు. అప్పుడు మీరు ప్రజల డబ్బును తినివేసే లక్షాధికారులు, కోటీశ్వరులు కాగలరు. జంతువులకు తిన్నది ఎంత తృప్తిని యిస్తుందో మానవులకు ఉన్నది కూడా అంత తృప్తిని యిస్తుంది. అందుచేత మీ ఆకలి అప్పుడు తీరుతుంది.' అని వినాయకుడు వాటికి వరం యిచ్చాడు. ఇప్పటికే చాలా ఆలస్యం అయిందని చంద్రరావు లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు.



# ఇంతవాడు అంతవాడు అయ్యాడు



1949 నుండి 1968 వరకు చలనచిత్ర పరిశ్రమ అనుంగు బిడ్డగా, ముక్కోటి ఆంధ్రుల అభిమానుడిగా, ఉత్తమ కళాకారుడిగ వినుతికెక్కిన తెలుగు చిత్ర కథానాయకుడే శ్రీ నందమూరి తారకరామారావు. 'మనదేశం' చిత్రంలో కర్తవ్య నిర్వహణాధికారిగా పరిచయమయిన యీ రాముడు నటుడిగ, బాధ్యతగల నిర్మాతగ తన కర్తవ్యాన్ని సక్రమంగా నెరవేర్చుకుంటూ దినదిన ప్రవర్ధమానుడవుతున్నాడు ఈయన రాజయోగ జాతకుడు. విజయాన్ని నిరంతరకృషితో తనదాన్ని చేసుకున్నాడు. ఇంతవరకు యెవ్వరూ, యిన్ని విభిన్నపాత్రలను ఉచితరీతిలో పోషించినట్లు కానరాదు ఎవ్వరూ సాధించలేనిదాన్ని యీయన ఎలా సాధించాడు.

'కృషితో నాస్తి దుర్భిక్షమ్' అన్నట్లు శ్రీ ఎన్ టి ఆర్. తన మనోవాక్కాయ కర్మలను తన వృత్తిపై కేంద్రీకరింపచేసి ప్రతిపాత్రను పరిశోధించి, తన విజ్ఞానంతో కవి భావాన్ని మేళవించి, పాత్రలో జీవించి మనందరి ఆశీస్సులను, ఆదరణాభిమానాలను తన భుక్తిగా భావించి మన మనస్సుల్లో లీనమయ్యాడు.

వ్యాసం: శ్రీనివాస్

అంతస్థు పెరిగినా, అహం పెరగలేదు; అడ్డంకులు వచ్చినా అడ్డదారి తీయలేదు అడుగిడిననాడు ఎలా ప్రవర్తించాడో, ముందడుగు వేసిననాడుకూడ అలాగే వున్నాడు. మద్రాసులో తెలుగుచిత్ర పరిశ్రమకు రాజయ్యాడు పరిశ్రమనునమ్ముకున్న పనివాండ్రకు తండ్రిగా తన బాధ్యతను గుర్తించి, యెక్కువ చిత్రాల్లో నటిస్తూ వారి కెల్లవేళలా పని కల్పిస్తున్నాడు. తన్ను నమ్ముకున్నవారిని నట్టేట ముంచక సాధ్యమయినవరకు సహాయ పడుతున్నాడు. అందుకే 'యింతవాడు అంతవాడు' కాగలిగాడు.

భాగ్యనగరంలో అత్యద్భుతమయిన థియేటరును సృష్టించారు చిత్రసీమలో గడించిన డబ్బును ఆ సీమకే అంకితం చేసిన మహానుభావుడు. థియేటరుతోపాటు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ కోరికపై బ్రహ్మానంద చిత్రపురిని ఆంధ్రా హాలివుడ్‌గా మార్చడానికై కంకణం కట్టుకున్నాడు స్టుడియో నిర్మాణం చక, చక సాగిపోయే తరుణం ఆసన్నమయింది స్టుడియోలో షూటింగు ప్రారంభిస్తే నిర్మాతలు అవస్థలకు గురి కాకూడదనే తలంపుతో అక్కడే ఫిలిం కాలనీకూడ యేర్పడేందుకు కృషి చేస్తున్నాడు

ఇతని పాదపూజ ఎవరికి ? మరెవ్వరికో తన్ను కన్న తల్లిదండ్రులకే భూమిపై మనకు ప్రత్యక్ష దైవాలు మాతాపితలు అన్న సత్యాన్ని శ్రీ రామారావు జీవితమే నిరూపించింది. చలనచిత్ర చరిత్రలో శ్రీ ఎన్. టి ఆర్. కున్న స్థానం అపూర్వం.



'బాంధవ్యాలు'లో సావిత్రి

**చిత్రసమీక్ష:**

# బాంధవ్యాలు

కథల్నిబట్టి, అందులో వున్న పాత్రల ననుసరించి నటీనటుల్ని ఎన్నుకోవడంకంటె —నటీనటుల్నిబట్టి కథని అల్లుకు పోవడం ఇప్పటి మన చలనచిత్ర పరిశ్రమ పరిస్థితి. అయినా—నటుల సామర్థ్యాన్ని దృష్టిలో వుంచుకుని, అందుకు అనుగుణ్యమైన చిత్రీకరణ జరిగినప్పుడు-ఆ చిత్రానికీ తప్పక ప్రజాదరణ లభిస్తుంది అని యస్. వి. ఆర్. ఫిలిమ్స్ వారి 'బాంధవ్యాలు' నిరూపిస్తుంది.

ఒక గ్రామంలో రామయ్య, లక్ష్మయ్య అనే అన్నదమ్ములుంటారు. రామయ్య భార్య సంగతి దేవుడికెరుక! లక్ష్మయ్యకి (రామయ్య దృష్టిలో) సీతమ్మలాంటి భార్య, అప్రయోజకులయిన ముగ్గురు వంశోద్ధారకులు వుంటారు. మరదలికి రామయ్యపై అంతులేని అభిమానం 'బావగారు బ్రతికుండగానే తను సుమంగళిగా కన్నుమూయ్యాల'నేది ఆమె విచిత్ర వాంఛ! రామయ్యకి బంధుప్రీతి ఎక్కువ అని వేరే చెప్పనక్కర్లేదు. పానకంలాంటి వాళ్ల తియ్యని కుటుంబంలో పుడకలాంటి పానకాలు అడ్డొచ్చి ఒడిదుడుకులకు కారణమవుతాడు తమ్ముడి కొడుకుల్ని ప్రయోజకుల్ని చెయ్యాలనే తలంపుతో రామయ్య ఆస్తి పంపకాలు జరుపుతాడు. తత్ఫలితం మనస్సు చివుక్కుమనిపించే సంఘటనలకి దారితీస్తుంది. ఈ ఇబ్బందులన్నింటినీ గడిచి గట్టెక్కిస్తాడు రామయ్య ఉప్పుతిన్న ఒక కృతజ్ఞుడు!

కథలో సత్తువ లేదు. అందులో వున్న దిట్టమైన పాత్రలే కథని పాయం పడతాయి. ఒక కుగ్రామంలో పానకాలు పగైరాల్లాంటి 'నాగరిక సమాజాన్ని' చూపెంచకుండా వుంటే కథకి సహజత్వం వచ్చి వుండేది. క్లయిమాక్సులో పటుత్వం లేకపోయినా చిత్రీకరణ పకడ్బందీగా వుండటం వల్ల ఆ లోపం అసలు కనిపించదు. ఇందుకు దర్శకుడ్ని ప్రశంసించి తీరాల్సిందే!

యస్. వి రంగారావు ఏ పాత్రలోవున్నా ప్రేక్షకుల ఆదరాన్ని సంపాదించుకో గలుంతాడు. ఆ నటునికీ జనానికీ మధ్య బాంధవ్యం అలాంటిది. చిత్రంలో తెరనిండుగా రామయ్య కనిపిస్తాడు, ఆ పాత్ర నిండు తనాన్ని ప్రేక్షకుల హృదయాల్లో నింపి బాంధవ్యాన్ని మరింత గాఢతమం చేసుకో గల్గుతాడు యస్వీఆర్. రామయ్య పాత్రకి తీసిపోని క్లిష్టమైన పాత్ర అతని మరదలిది. ఈ పాత్రని సావిత్రి అతి సహజంగా ప్రశంసనీయంగా పోషించి రక్తి కట్టించింది లక్ష్మయ్య కుమారులుగా నటించిన మోదుకూరి సత్యం, గుంటూరు వెంకటేష్, సారథి బరువైన కథాగమనానికి చక్కని రిలీఫ్నిచ్చారు. అవకాశం వస్తే గుంటూరు వెంకటేష్ మంచి హాస్యనటుడుగా రాణించగలడని రుజువు చేసికొన్నాడు. లక్ష్మయ్య పాత్రలో ధూళిపాళ నటన ప్రత్యేకించి మెచ్చుకోతగ్గది. తదితర ముఖ్య పాత్రలలో రాజబాల, హరనాథ్, చంద్రమోహన్, నాగయ్య, లక్ష్మి మొదలైన వారు పాత్రోచితంగా నటించి కథకి జీవం పోశారు.

చిత్రం చూస్తున్నంతసేపూ డి. వి. నరసరాజు సరస సంభాషణలు గ్రామ వాతావరణాన్ని ఆహ్లాదంగా రుచి చూపిస్తాయి. యస్. హనుమంతరావు సంగీతంలో ప్రత్యేకత, సాంకేతిక పరివారం టీమ్‌వర్కు చిత్రం పొడవునా కనిపిస్తాయి.

నటుడుగాను, దర్శకుడుగాను యస్ వి. రంగారావు కీర్తిని ఇనుమడింప చేయగల 'బాంధవ్యాలు' నిర్మాతలు బడేటి సత్యనారాయణ, పుట్టా వెంకటరావు.

—సీతరాజు

# మన హాస్యనటీనటులు

### రేలంగి వెంకట్రామయ్య

ఈస్టిండియా ఫిలిం కంపెనీవారు నిర్మించిన 'శ్రీ కృష్ణతులాభారం' చిత్రంతో చలనచిత్ర రంగ ప్రవేశం చేశారు. నాటి నుంచి నేటి 'బంగారు గాజులు' చిత్రం వరకూ 230 చిత్రాలలో నటించారు. అగ్గిరాముడు, రాజు పేద, పాతాళభైరవి, గుణసుందరి కథ, పెద్దమనుషులు, లేత మనసులు, దొంగరాముడు మొదలైన చిత్రాలు శ్రీ రేలంగికి విశేషమైన పేరు ప్రఖ్యాతులు ఆర్జించి పెట్టినవి.

శ్రీ రేలంగి హాస్యానికి ఒక ప్రత్యేక ధోరణి వున్నది. అందువల్లనే ఆయన ఇన్నేళ్ళా



హాస్యనటుడుగా నిలబడగలిగి తిరుగులేని స్థానం సంపాయించుకున్నారు, 'హాస్య నట చక్రవర్తి' అనిపించుకున్నారు. ఇవాళ్టికీ ఆయన హాస్య నటనలో ఎంతో కృషి కన పరుస్తూ వుండటం చెప్పుకోదగిన విషయం. ప్రస్తుతం శ్రీ రేలంగి వరకట్నం, నిండు సంసారం, శ్రీరామ కథ, బాగ్దాద్ దొంగ, గౌరీవారి సాంఘికం, పెళ్ళిరోజు, కలిసిన మనసులు చిత్రాలలో నటిస్తున్నారు.

### పద్మనాభం

మాయాలోకం పద్మనాభం నటించిన మొదటి చిత్రం. ఇప్పటిదాకా 150 చిత్రా



లలో నటించారు. పాతాళభైరవి, దాగుడు మూతలు, లేతమనసులు, అనేకళ్ళు, దేవత చిత్రాలు, శ్రీ పద్మనాభం హాస్యనటనకు గీటురాళ్ళు. దాగుడుమూతలు చిత్రంద్వారా కొత్తతరహా హాస్యాన్ని ప్రవేశపెట్టి ప్రేక్ష కులనుంచి విశేషంగా ప్రశంస లందుకున్నా రీయన.

శ్రీ పద్మనాభం హాస్యనటుడుగా వుంటూనే రేఖా అండ్ మురళీఆర్ట్సువారి 'శ్రీరామకథ' చిత్రానికి దర్శకత్వపు బాధ్యత చేపట్టారు. ఈ చిత్రంలో ఆయన నారద భూమికను ధరిస్తున్నారు కూడా. ప్రస్తుతం పారథీస్టూడియోస్ చిత్రం, అదృష్ట వంతులు, వరకట్నం, పెళ్ళిరోజు, వింత కాపురం, కుంకుమభరిణ, మూగనోము, బాగ్దాద్‌దొంగ, గోపాలకృష్ణ ప్రొడక్షన్స్ చిత్రాలలో నటిస్తున్నారు.

### బాలకృష్ణ

'కీచకవధ' చిత్రం ద్వారా సినిమాలలోకి ప్రవేశించిన బాలకృష్ణ యింతవరకు వంద చిత్రాలకు పైగా నటించారు. పాతాళ భైరవి, గురువునుమించిన శిష్యుడు, నవగ్రహ పూజామహిమ, అగ్గిపిడుగు, అగ్గిదొర, మున్నగు చిత్రాలలో శ్రీ బాల కృష్ణ చక్కని హాస్యనటనను అగపరిచారు. ఆయన హాస్యరస పోషణలో గమ్మత్తయిన విధానం వున్నది. సంభాషణలు లేకున్నా చూసేవాళ్ళని నవ్వించగల నేర్పరి.

నిన్నే పెళ్ళాడతా, సప్తస్వరాలు, లక్ష్మీ నారాయణ ప్రొడక్షన్స్, అందంకోసం పందెం, పి. యస్. ఆర్. పిక్చర్స్, తారా శశాంకం ప్రస్తుతం బాలకృష్ణ నటిస్తున్న చిత్రాలు.

### రమణారెడ్డి

శంకరరెడ్డిగారి 'మానవతి' చిత్రం ద్వారా ప్రేక్షకులకు సుపరిచితులైన శ్రీ రమణా రెడ్డి ఇప్పటిదాకా సుమారు 150 చిత్రా లకు పైగా నటించారు. భార్యాభర్తలు, కులగోత్రాలు, అగ్గిబరాటా వద్దంటే పెళ్ళి, ఇల్లరికం చిత్రాలు ఆయనకు చక్కని పేరు తెచ్చిపెట్టిన చిత్రాలలో కొన్ని...

నెల్లూరి యాసభాషను చిత్రాల్లో ప్రవేశపెట్టి హాస్యనటనలో ఒక కొత్త మార్గాన్ని అనుసరించారు రమణారెడ్డి. ఇప్పుడు నిన్నే పెళ్ళాడతా, నిండు సంసారం మున్నగు చిత్రాలలో నటిస్తున్నారు.



## జ్ బాబు

సమాజం చిత్రంలో చిన్న హాస్యభూమికలో కనిపించిన రాజ్‌బాబు–యివాళ అగ్రశ్రేణి హాస్యనటుల జాబితాలోకి ఎక్కాడు. ఇంతవరకు అతను నటించిన చిత్రాలు దాదాపు యాభై దాకా ఉంటవి.

ప్రతి చిత్రంలోను కొత్తదనాన్ని చూపిస్తూ చక చక పైకివస్తున్న రాజ్ బాబుని చదరంగం, నిండు మనసులు, సర్కార్ ఎక్స్‌ప్రెస్, అత్తగారు — కొత్త కోడలు, కలిసొచ్చిన అదృష్టం, మొదలయిన చిత్రాలు వెలుగులోకి తీసుకొచ్చినవి. నడమంత్రపుసిరి, అగ్గి మీద గుగ్గిలం, మాధవీ ప్రొడక్షన్స్ చిత్రం,



శ్రీ రాజ్ ఆర్ట్‌ఫిలింస్, బంగారు పిచిక, డి బి యన్ అండ్ డేగా కంబైన్స్ చిత్రం, సురేష్ పిక్చర్స్, మాకూ మంచిరోజులొచ్చాయి, బంగారు సంకెళ్ళు, జయశ్రీ లక్ష్మీపిక్చర్స్ చిత్రం, ప్రతిమాఫిలింస్ మున్నగువాటిలో యివుడు రాజ్‌బాబు నటిస్తున్నాడు.

## అల్లు రామలింగయ్య

డా. రాజారావుగారి 'పుట్టిల్లు' చిత్రం ద్వారా చిత్రరంగం ప్రవేశం చేసిన శ్రీ అల్లు రామలింగయ్య ఇప్పటిదాకా 125 చిత్రాలలో నటించారు. మంచిమనసులు, మూగమనసులు, ప్రేమించి చూడు, బందిపోటు చిత్రాలు యిటీవలి సంవత్సరాలలో ఆయనకు మంచిపేరు తీసుకువచ్చినవి.



సంభాషణోచ్చారణలో హాస్యాన్ని దించి గిలిగింతలు పెడతారు శ్రీ అల్లు రామలింగయ్య. ప్రస్తుతం బంగారు సంకెళ్ళు, వరకట్నం, బాగ్దాద్ దొంగ, డి. వి. యస్. ప్రొడక్షన్స్, గ్రామదేవతలు ఆయన నటిస్తున్న చిత్రాలు.

## నాగభూషణం

హాస్యనటుడు కాని హాస్యనటుడీయన. ఏది నిజం చిత్రంలో నాయకుడిగా వేసిన శ్రీ నాగభూషణం — 'మంచి మనసులు' చిత్రం నుంచి కామెడీ విలన్‌గా మారారు. మూగమనసులు, తోడూనీడా, భార్య, రాము, నిలువుదోపిడి. బ్రహ్మచారి, భలే కోడళ్ళు చిత్రాలు ఆయన కెంతో పేరు తెచ్చిపెట్టినవి ఇంతవరకు నటించిన చిత్రాలు సుమారు 100 దాకా ఉంటవి...

హాస్యరస పోషణలో ఈయనకీ ఒక ప్రత్యేక ధోరణి వున్నది. సీరియస్‌నెస్ లోంచి కామెడీలోకి, కామెడీనుంచి సీరియస్ నెస్‌లోకి వెళ్ళిపోయి రక్తి కట్టించ గల నేర్పున్న చక్కని నటుడు. ప్రస్తుతం శ్రీ రాజ్ ఆర్ట్‌ఫిలింస్. మాధవీ ప్రొడక్షన్స్, నేనంటే నేనే. గోపాలకృష్ణ ప్రొడక్షన్స్, సారథీ స్టూడియోస్ చిత్రం, మధు పిక్చర్స్, నడమంత్రపుసిరి మొదలయిన చిత్రాలలో నటిస్తున్నారు

## చలం

రాజ్యం పిక్చర్స్‌వారి 'దాసి' చిత్రం ద్వారా ప్రేక్షకులకు పరిచయమైన శ్రీ చలం యింతవరకు 80 చిత్రాలకు పైగా నటించారు. వదినగారి గాజులు ప్రేమించిచూడు, భలేకోడళ్ళు, మనసే మందిరం, బ్రహ్మచారి, మంచికుటుంబం చిత్రాలు చలానికి చక్కని కీర్తిప్రతిష్ఠ లార్జించి పెట్టినవి.

ఇచ్చిన పాత్రను అర్థం చేసుకుని నేర్పుతో ఒప్పించగల ప్రజ్ఞవున్న హాస్యనటుడు శ్రీ చలం. ఇపుడు ఉండమ్మా బొట్టుపెడతా, సత్తెకాలపు సత్తెయ్య, ఎవరు మొనగాడు, మధుపిక్చర్స్, నవ్వులు పువ్వులు, గ్రామదేవతలు, అరుణాచలం స్టూడియోస్ చిత్రం, మెర్క్యురీ ప్రొడక్షన్స్ చిత్రాలలో నటిస్తున్నారు.

## సూర్యకాంతం

'వారద—నారది' చిత్రం ద్వారా వెండితెరకు వచ్చిన శ్రీమతి సూర్యకాంతం యిప్పటిదాకా సుమారు 175 చిత్రాల్లో నటించారు. సంసారం, రత్నమాల, గుండమ్మకథ, చదరంగం ఆదిగాగల చిత్రాల్లో ఆమెకెంతో పేరూ, ప్రతిష్ఠ లభించినవి.

అద్భుతమైన ప్రజ్ఞాపాటవాలుగల నటి శ్రీమతి సూర్యకాంతం. ఆమె హాస్యంలో జీవం ఉట్టిపడుతూ వుంటుంది. సంభాషణల్లో చతురత, సహజత్వం కొట్టవచ్చినట్టు కనిపిస్తూ ఉంటవి. ముహూర్తబలం, విన్నే పెళ్ళాడుతా, మాధవి పిక్చర్స్, సారథీ స్టూడియోస్, అదృష్టవంతులు. వరకట్నం, ఉండమ్మా బొట్టుపెడతా, నడమంత్రపు సిరి, చింతకాపురం, శ్రీ రామ



# మన హాస్య నటీనటులు

కథ, నేనంటే నేనే. నవ్వులు— పువ్వులు, మాకూ మంచిరోజు లొచ్చాయి. ప్రస్తుతం ఆమె నటిస్తున్న చిత్రాలు రానున్న 'వడ్డంతప్పు సిరి' చిత్రంలో సొసైటీ లేడీగా మీ అందర్నీ ఆశ్చర్యపరిచి నవ్వుల్లో ముంచెత్తే మంచిపాత్రలో కనిపిస్తారు సూర్యకాంతం.

**గుంటూరు వెంకటేశ్**

ప్రథమంగా 'బాంధవ్యాలు' చిత్రంలో అవకాశం లభించినా, 'చిన్నారి పాపలు' ముందుగా విడుదలయి — హాస్యనటుడుగా వెంకటేశ్‌కి మంచి పేరు తెచ్చిపెట్టింది. బాంధవ్యాలు చిత్రంలోకూడా అతను — తనకిచ్చిన వేషాన్ని అర్థం చేసుకుని రసవత్తరంగా పోషించాడు.

వెంకటేశ్ యిపుడు కలసిన మనసులు, గుణదాసు, అందంకోసం పందెం మొదలయిన చిత్రాల్లో నటిస్తున్నాడు.

**గీతాంజలి**

'సీతారామ కల్యాణం' చిత్రంలో నటిగా ప్రేక్షకులకి పరిచయమైన కుమారి గీతాంజలి యింతవరకూ సుమారు యాభై చిత్రాలలో నటించింది. సాఫ్ట్ రోల్స్ లోనే కాక, హాస్య భూమికల్లోకూడా ఈమె బాగా రాణించింది.

ఎలాంటి పాత్ర ఇచ్చినా అర్థం చేసుకుని ఒప్పించగల సమర్థత ఉన్న నటి గీతాంజలి మూగనోము, పెళ్లిరోజు, మాకూ మంచిరోజు లొచ్చాయి, శ్రీరామ కథ, బంగారుపంజరం, భాగ్దాద్ దొంగ, అదృష్టవంతులు, ప్రతిమాఫిలింస్ చిత్రాలలో ప్రస్తుతం గీతాంజలి నటిస్తున్నది. ఇల్లాలు, లేతమనసులు, శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న, అనేకళ్లు ఆమెకు మంచి పేరు తెచ్చిపెట్టిన వాటిలో కొన్ని...

**మీనాకుమారి**

'సతీ సుకన్య' మీనాకుమారి నటించిన మొదటి చిత్రం. ఇప్పటివరకూ సుమారు 30 చిత్రాల్లో నటించింది. పెళ్లిమీద పెళ్లి, అన్నాచెల్లెలు, కనకదుర్గ పూజామహిమ, వరలక్ష్మీ వ్రతం చిత్రాలు ఆమెను హాస్యనటిగా స్థిరపరచిన చిత్రాలు.

వచ్చిన అవకాశాలను సద్వినియోగపరచుకొంటూ, ప్రతి చిత్రంలోను కొత్తదనాన్ని కనపరుస్తూ అభివృద్ధిని సాధించిన హాస్యనటి. ఎవరు మొనగాడు శ్రీరామ కథ, శ్రీ రాజ్ ఆర్ట్ ఫిలింస్, అగ్గిమీద గుగ్గిలం, సప్తస్వరాలు, కలసిన మనసులు, అన్నదమ్ములు, కళాచిత్ర — చిత్రాలలో యిపుడు మీనాకుమారి నటిస్తున్నది.

**రమాప్రభ**

ప్రత్యగాత్మ గారి 'చిలకా గోరింకా' చిత్రంద్వారా రమాప్రభ తెలుగు ప్రేక్షకులకు సుపరిచిత అయినది. అపాధ్యుడు, బ్రహ్మచారి, చదరంగం, అత్తగారు — కొత్తకోడలు చిత్రాలు రమాప్రభను చక్కని హాస్యనటిగా నిలబెట్టినవి.

సున్నితమైన హాస్యాన్ని ప్రదర్శించగల నటి భావ ప్రకటనలోను, సంభాషణోచ్చారణలోను ప్రత్యేకతను సంతరించుకున్న కుమారి రమాప్రభ— ప్రస్తుతం బంగారు సంకెళ్లు, మాధవీ పిక్చర్స్, గోపాలకృష్ణ పిక్చర్స్, గౌరీ శంకరుల కల్యాణం, శ్రీకాంత్ ప్రొడక్షన్స్ చిత్రాలలో నటిస్తున్నది.

**ఛాయాదేవి**

ఇవాళ్టివరకూ ఛాయా దేవి సుమారు 150 చిత్రాలలో నటించారు. కన్నకొడుకు, ఆలుమగలు, గుండమ్మకథ ఇత్యాదిచిత్రాలు— హాస్య నటనలోకూడా ఆమెది అగ్రతాంబూలమని నిరూపించినవి.

ఇటు హాస్య భూమికలను, అటు గయ్యాళి పాత్రలను పోషించడంలో ఛాయాదేవికి ఒక ప్రత్యేకత వున్నది. ఈమె సంభాషణోచ్చారణ కూడా ఎంతో స్పష్టంగా వుంటుంది. ప్రస్తుతం శిన్నే పెళ్లాడతా మొదలయిన చిత్రాలలో నటిస్తున్నారు.

**రావికొండలరావు**

'దాగుడు మూతలు' చిత్రం ద్వారా చక్కని హాస్య నటుడుగా గుర్తించబడ్డ శ్రీ రావికొండలరావు ఇంతవరకు పాతిక చిత్రాల్లో నటించారు. ప్రేమించి చూడు, స్త్రీజన్మ, ఇద్దరు మొనగాళ్లు, లక్ష్మీనివాసం, పాలమనసులు, చిత్రాల్లో ఆయనకు మంచిపేరు వచ్చింది.

సంభాషణలు చెప్పడంలోను, భావాన్ని వ్యక్తపరచడంలోను హాస్య రసాన్ని గుప్పించడంలో ఈయన కీయనే సాటి. అర్థరాత్రిలో వెరైటీవున్న వేషం పోషిస్తున్నారు. బంగారు సంకెళ్లు, వేసంటే వేనే, బంగారు పంజరం, అగ్గిమీద గుగ్గిలం, కలసిన మనసులు, గోపాలకృష్ణ ప్రొడక్షన్స్, త్రికాలపు సత్తెయ్య మొదలయినవి ప్రస్తుతం శ్రీ రావికొండలరావు నటిస్తున్న చిత్రాలు.

**కాకరాల**

బి. యన్. గారి 'రంగులరాట్నం' చిత్రంలో లభించిన చక్కని అవకాశాన్ని సద్వినియోగపరచుకొని మంచి హాస్య నటుడిగా గుర్తించబడ్డాడు కాకరాల. ఆ తర్వాత పెద్దక్కయ్య, రాజయోగం చిత్రాలలో నటించాడు



రాజయోగం లో హాస్యజంట బాలకృష్ణ మీనాకుమారి

# మన హాస్య నటీనటులు

డా॥ రాజారావుగారిలాంటి పెద్దల శిక్షణలో పెరిగిన కాకరాల ప్రతిభావంతమైన భూమికల్ని పోషిస్తున్నాడు యివాళ బంగారు పంజరం, నిన్నే పెళ్ళాడతా, బంగారు సంకెళ్ళు, గోపాలకృష్ణ ప్రొడక్షన్స్ చిత్రాల్లో ప్రస్తుతం నటిస్తున్నాడు.

### కె వి చలం

'తేనెమనసులు' చిత్రంద్వారా హాస్యనటుడిగా పరిచయమైన కె వి, చలం-యిప్పటిదాకా సుమారు 20 చిత్రాల్లో నటించారు కన్నెమనసులు, మరపురానికథ, చిక్కడు దొరకడు, పెద్దక్కయ్య స్త్రీజన్మ చిత్రాలలో అతనికి చక్కని పేరు వచ్చింది.

విశేషమైన కృషిచలిపి ప్రజ్ఞతో పైకి వచ్చిన హాస్యనటుడు. అవకాశం లభిస్తే పరిపూర్ణత చూపగలడు. నేనంటే నేనే, జయశ్రీ లక్ష్మీపిక్చర్స్, అన్నదమ్ములు, శ్రీ రాజ్ ఆర్ట్ ఫిలింస్, మాధవీ పిక్చర్స్ వస్తాడే మాబావ, కుంకుమభరిణ, గుణ దాస్, వెంట్రామా ఫిలింస్ చిత్రాలలో ప్రస్తుతం నటిస్తున్నాడు

—మోహన్‌కుమార్

# సినిమా

ఆగస్టు 15 భారతీయులకు పుణ్య దినం. అదే మనకు స్వాతంత్ర్యం వచ్చిన శుభదినం. ఆ పర్వదినమే నటి భారతి పుట్టిన దినం ఈ ఆగస్టు 15 కు భారతికి 19 సంవత్సరాలు నిండాయి కర్నాటకంనుండి వచ్చి తన నటనతో మన మనస్సులను దోచుకున్న అందాల ప్రాబంతి భారతి తను కష్టించి ఆర్జించిన డబ్బుతో కట్టుకున్న బంగళాలో ఈ పుట్టినరోజు వేడుకను వైభవంగా జరుపుకుంది పరిశ్రమ ప్రముఖు లనేకులు వచ్చి ఈ చిన్నారిని 'దీర్ఘాయుష్మాన్ భవ' అని దీవించారు. ఈ సంతోషంలో నేను భాగస్వామి నయ్యాను. నేను వెళ్ళి వూరక వుంటే ఎలా? నా నోరు కదలించి ఆమె పెదవి విప్పించాను ఆమె చెప్పిన విషయాన్ని మీ కప్పగిస్తాను

'నన్ను ఆదరిస్తున్న ఆంధ్ర ప్రేక్షకులకు నా కృతజ్ఞతలు: నాంయీ పుట్టిన రోజు యింత వైభవంగా జరగడానికి ప్రేక్షకుల ఆశీర్వాదమే కారణం నేను వేరుగా చెప్ప లేక మీ పత్రికద్వారా నా మనోభిప్రాయాన్ని తెల్పుకుంటున్నానంది' భారతి 'మరొక్కమాట. ఈ మంచిరోజున కొత్త చిత్రం కాంట్రాక్టు ఒకటొచ్చింది'.



'అగ్గిమీద గుగ్గిలం'లో రామకృష్ణ, విజయలలిత.

'అసాధ్యుడు' చిత్రంద్వారా ఆంధ్రుల స్వప్నసుందరి అయిన అందాలనటి కె ఆర్ విజయ మాతృమూర్తి అయినదన్న విషయం యిదివరకే మీకు తెలిపాను. ఎనిమిదినెలల విశ్రాంతి అనంతరం తిరిగి చిత్రాలలో నటించేందుకు అంగీకరించింది. విశ్రాంతికి ముందు ఆమె నటించి విడుదల అయిన చిత్రం 'అసాధ్యుడు' ఇప్పుడు ఆమె నటించనున్న చిత్రంకూడ అసాధ్యుడే. ఒక నిండయిన నటిని వదులుకోవడం దుస్సాధ్యం అందుకే కె. ఆర్. విజయ లాంటి వుత్తమనటి మరలా నటిస్తుంటుంటే పరమానందంగా వుంది ముమ్మందు కూడ మన అభిమాన నాయికగా వుండేందుకు కృషిచేస్తానని యిటీవల నాతో చెప్పింది నటి కె ఆర్ విజయ.

### పేరుకుముందు హీరో

ఒక కథానాయకుడికి పేరుకు ముందు 'హీరో' పట్టం రావడం మన చిత్ర రంగంలో అపూర్వమయిన అంశం. ఆ అదృష్టానికి నోచుకున్న నాయకుడు లిద్దరున్నారు ఎవరో తెలుసా? అక్కినేని నాగేశ్వరరావు, కృష్ణ దశాబ్దం ముందు నాగేశ్వరరావుకు 'హీరో' బిరుదాన్నిచ్చి సత్కరించిన ప్రేక్షకులు ఈ రోజున కృష్ణకు అదేపని చేసారు అంటే మీ అభిమానాన్ని అపారంగా చూరగొన్న వర్ధమాన కథానాయకుడు కృష్ణ అన్నది నిర్వివాదాంశం. అతగాడుకూడ యిచ్చిన పాత్రకు పరిపూర్ణ న్యాయం చెయ్యడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు. నిర్మాతలు కృష్ణను పెట్టుకుంటే లాభాలు పొందుతున్నారు. శ్రీయుతులు రామారావు, నాగేశ్వరరావు చిత్రాలకు వచ్చే ఓపెనింగ్సు కృష్ణకు వస్తున్నాయి. దర్శకుల ఆజ్ఞకు కట్టుబడి తనకిచ్చిన భూమికను మీ మనోఫలకంపై ముద్రించే విధంగా నటిస్తున్నాడు. ఈ మధ్య కృష్ణ నటించిన మూడు చిత్రాల రష్ చూచి నిర్ఘాంతపోయాను. నటనలో ఎంత పరిపూర్ణత? వాచకంలో ఎంత పరిపక్వత? అభినయంలో ఎంత నాణ్యత? ఈ ఘనతంతా దర్శక, నిర్మాతలదే.

## మీకు తెలుసా?

హాలివుడ్ నటులకు స్వంతయిండ్లు వుండినా, లాడ్జింగ్‌హోంలో వుండడం సరద

అక్కినేని నాగేశ్వరరావుకు శివాజి గణేశన్ అల్లుడిగ నటించిన చిత్రం 'పరదేశి'

'మనోహర' చిత్రంలో కథానాయకుడిగ నాగేశ్వరరావును మొదట్లో నియమించారు ఆపైన కారణాంతరాల వల్ల ఆపాత్రను శివాజి ధరించారు

శ్రీమతి సావిత్రి కథానాయికగ నటించిన మొదటి చిత్రం 'ప్రతిజ్ఞ'

గోకుల్‌పిక్చర్స్ 'సిరుపేదలు' లో నాయికగ శ్రీమతి షావుకారు జానకి నటించాల్సింది కానీ ఆఖరి క్షణంలో నిర్మాతలు శ్రీ మ తి జమునను ఆపాత్రకు నిర్ణయించారు

శ్రీ ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వం వహించిన మొదటి చిత్రం 'అమర సందేశం'

'ధర్మపత్ని' చిత్రంలో శ్రీ అక్కినేని ఒకబాలుని పాత్రలో కన్పిస్తారు

ఎం జి ఎం నిర్మించిన 'గాన్ విత్‌ది విన్‌డ్' చిత్రం సెప్టెంబరు 10 న లండన్‌లోని ఎంపయిర్ థియేటర్లో వివిన్‌లి అవార్డు సందర్భంగా ప్రదర్శింప బడుతుంది

గేల్‌హానికట్, జేమ్స్ గార్నర్‌తో 'ది లిటిల్ సిస్టర్' చిత్రంలో కలిసి నటిస్తున్నారు

బ్రిటిష్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్ డైరెక్టరు జనరల్ మిస్టర్ బారిస్ కురాన్ హిందూస్థానిలో తన భారతీయ పర్యటన స్మృతులను వివరించారు.

---

ఈనాడు కృష్ణ యింతవాడయినందుకు బాబూమూవీస్, రాజ్యలక్ష్మి సంస్థలే కారణం 'ఉండమ్మా బొట్టుపెడతా' 'తంగై' 'నేనంటే నేనే' చిత్రాల రష్ చూపాను మూడు విభిన్నమయిన పాత్రలు గల యీ చిత్రాల షూటింగు ఒకేసారి జరిగాయి. ఒకపాత్ర స్వభావం మరొక దానిపై పడడానికి అవకాశం వుంది. కానీ, కృష్ణ మూ డిం టి ని వైవిధ్యమయిన నటనలో మెప్పించాడు. నేను చెప్పడమేమిటి మీరే చూస్తారుగ అప్పుడు మీరే అంటారు.

### ప్రోత్సాహ లోపమా?

మనకు నేపథ్యగాయకుల కొఱత కొట్టొచ్చినట్లు కన్పిస్తూనే వుంది. మరి మన ఆంధ్రదేశం, సంగీతానికి గొడ్డు పోయిందా? లేక మన సినిమారంగం కొత్తగాయకుల్ని ప్రోత్సహించ డానికి నిరాకరిస్తుందా అన్న విషయం తేలడం లేదు నిజంగా కొత్తగాయకుల్ని పరిచయం చెయ్యాలనే తలంపు మనవాళ్లకుంటే క్షణాల్లో వస్తారు గాయక శిఖామణులు. ఉదాహరణకి యీ మధ్య జనరంజని ఆఫీసులో ఒక మధుర కంఠాన్ని విన్నాను. ఆ గొంతులో యెంత తియ్యదనం? పాడడంలో యెంత చాతుర్యం? పాటను యెక్కడ యెలా (సంగీతులను) విరిచి పాడ్తే, రాణిస్తుందో ఆనే అంశాలను క్షుణ్ణంగా తెల్సిన యువగాయకుడే శ్రీ చిన్నారావు.

*   *   *



'శ్రీరామకథ'లో చంద్రమోహన్, గీతాంజలి,



శ్రీరాజ్ ఆర్ట్ పిక్చర్స్ రీ రికార్డింగ్ సందర్భంలో నిర్మాత సుంకవల్లి, టి వి రాజు సుశీల కె ఎ ఎస్ ఘంటసాల

## సినిమా

హిందీ క్యారెక్టరు నటుల్లో పృథ్వీ రాజకపూర్ బలరాజ్ సహాని, నసీర్‌హుస్సేన్ బిపిన్‌గుప్తా ముఖ్యులు వీరందర్నీ మన తెలుగు నటుడొకరిలో మూర్తీభవింప చేసాడు భగవంతుడు ఎవరతడు? అతడేమి మీకు అపరిచితుడు కాడు పరిశ్రమకు కొత్తవాడు కాడు, మీ అభిమాన ధనాన్ని దోచుకున్న గుమ్మడే అతడు నేను యిలా వర్ణించడానికి కారణం యిటీవల అతడు ధరించిన పాత్రలేనని మీకూ తెలుసు

'పంతాలు పట్టింపులు' పాత్రలో నజీర్ హుసేన్‌ను 'చుట్టరికాలు' నటనలో బిపిన్ గుప్తాను, 'చల్లనినీడ' లో బలరాజ్ సహానీ ముద్రను, 'బంగారు సంకెళ్ళు'లో పృథ్వీరాజ్ కపూర్ ఛాయలను తన ముఖ కవళికల్లో గుమ్మడి ప్రస్ఫుటింప చేసాడు 'బంగారుసంకెళ్ళు' చిత్రంలో గుమ్మడి పాత్ర స్వభావాన్ని మీరు తెల్సుకుంటేనే గాని అతని నటనను గూర్చి మీకొక కచ్చిత మయిన అభిప్రాయం యేర్పడదు

'బంగారుసంకెళ్ళు'లో గుమ్మడి ధరించే పాత్ర పేరు బసవయ్య ఇతడొక మోతుబరి రైతు, అతనికి లెఖ్ఖలేదు? అప్పులేదు, పట్టుదలకోసం ప్రాణం యిస్తాడు, అవసరం వస్తే ప్రాణం తీస్తాడు ఒక్కమాటలో చెప్పాలంటే అతనికి ప్రాణం కన్నా పరువే ప్రధానం తరగని డబ్బువుంది, గుణవతి అయిన భార్యవుంది సద్గుణ సంపన్ను డయిన కొడుకున్నాడు అన్నీ వున్నా మనశ్శాంతిలేదు ఇది తనకుతాను చేసుకున్న ద్రోహమా? లేక భగవంతుని శాపమా? లేక తెలియక చేసిన నేరానికి ప్రతిఫలమా? ఈ మానసిక సంఘర్షణతో సతమత మయ్యే యీ పాత్రలో గంభీరత ధీరత, హృదయ పరితప్తతను గుమ్మడి ఎలా ప్రతిబింబింప చేసాడో చిత్రం చూచి మీరే నిర్ణయించండి ఉదాత్తమయిన కథతో రసవంతంగా దర్శకుడు జి రామినీడు చిత్రించారు ఈ చిత్రంలో జమున తల్లీ కూతుళ్ళుగా అపూర్వంగ నటించింది మిగత ముఖ్య పాత్రలను హరనాథ్, ప్రభాకరరెడ్డి రాజబాబు, రావి కొండలరావు, టి జి కమల, కాకరాల, అల్లు రామలింగయ్య, రమాప్రభ, జ్యోతి, రాధిక పోషించారు శ్రీ ఎంగలి నాగేంద్రరావు పర్యవేక్షణలో దాసం గోపాలక్రిష్ణ రచన దీటుగా సాగింది ) ఎస్ ఆర్ స్వామి ప్రతి సన్నివేశాన్ని

## సినిమా డైరీ

● డి బి ఎస్ అండ్ దేగా ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న తాజా సాంఘిక చిత్రానికి "లక్ష్మీదమ్ములు" అని పేరు పెట్టారు వాహిని మూడవ ఫ్లోర్‌లో కృష్ణ సంధ్యారాణి సాక్షి రంగారావు దేవదాస్ (పూనా ఫిలింఇన్‌స్టిట్యూట్) కె వి చలం పాల్గొన్న దృశ్యాలను దర్శకుడు శ్రీ రామచంద్రరావు చిత్రీకరించారు

● మధు ఎక్చర్స్ నిర్మించే సాంఘిక చిత్రాన్ని శ్రీ తాతినేని రామారావు డైరెక్టు చేస్తున్నారు భమిడిపాటి రచన సాగించిన యీ చిత్రానికి కోదండపాణి సంగీత దర్శకుడు శ్రీ ఘంటసాల బాలసుబ్రహ్మణ్యం సుశీల ముఖ్యగాయకులుగా వుండే యీ చిత్రంలో కృష్ణ నాయకుడు మిగతా ముఖ్యపాత్రల్లో విజయనిర్మల శోభన్‌బాబు, నాగభూషణం చలం గీతాంజలి కన్పడగలరు

● వాహిని 5 వ ఫ్లోర్‌లో దర్శకులు శ్రీ ఎ ఎస్ రావ్ నవశక్తి నిండు సంసారం' చిత్రానికి గాను రమణారెడ్డి జయక్రిష కొత్తనటి పాల్గొను సన్నివేశాలను చిత్రించారు

● వీనస్ స్టూడియోలో చిత్ర్రదర్శ కుంకుమ భరిణె' షూటింగులో శ్రీ రాజనాల, అంజలీదేవి, పద్మనాభం, అనంతమోహన్ పాల్గొన్నారు శ్రీ వేదాంతం రాఘవయ్య డైరెక్టు చేసారు

● హీరక మార్ ఎక్చర్స్ నిర్మిస్తున్న షూటింగు ఆగస్టు 9 నుండి 14 వరకు న్యూటోన్ స్టుడియోలో జరిగింది శ్రీమతి కె ఆర్ విజయ వాణిశ్రీల నటించారు వీరిద్దరూ జయ్ శంకర్‌తో నటిస్తున్నారు

● శ్రీ పింజల సుబ్బారావు నిర్మిస్తున్న జానపద చిత్రం యొక్క మొదటి పాటను వాహిని రికార్డింగ్ థియేటర్లో జానకి బాలసుబ్రహ్మణ్యంచే ఆగస్టు 15న కోదండపాణి పాడించారు



'నిన్నే పెళ్ళాడుతా'లో భారతి.

చిత్రీకరించడంలో దర్శకునికి యిచ్చిన సహాయం చిత్రం యొక్క ఫోటోగ్రఫీని చూచి మీరే నిర్ణయిస్తారు. కళను రాజేంద్ర కుమార్, కూర్పును అంకిరెడ్డి, నృత్యాలను హీరాలాల్, సంగీతాన్ని పూర్ణచంద్రరావు, సహకార దర్శకత్వాన్ని రావు గోపాలరావు నిర్వహించిన యీ చిత్రానికి ఛటర్జీ పేర అనితర సాధ్యమనిపిస్తుంది. అక్టోబరు ప్రారంభంలో పూర్ణా పిక్చర్స్ ద్వారా విశాలాంధ్రలో విడుదలయ్యే యీ చిత్రాన్ని శ్రీ వి. సత్యనారాయణ నిర్మించారు.

**మొత్తం షూటింగు ఒకే షెడ్యూలులో**

ఇద్దరు మేధావులు ఒకచోట చేరితే జరిగేదేమిటి? మంచి, గొప్పలాంటిదే గదా. ఒక ప్రముఖ రచయిత, ఒక ప్రఖ్యాత ఆర్టిస్టు కలసి ఒక చిత్రాన్ని నిర్మించారు. మొదటి చిత్రమే ప్రయోగాత్మకంగా రూపొందించబడింది. ఇప్పుడు రెండో దాన్ని పూర్తి చేశారు. వీళ్లెవరో మీకూ తెలుసు? ఒకరు శ్రీ ముళ్లపూడి వెంకట రమణ. మరొకరు శ్రీ బాపు. వీరి మొదటి ప్రయత్నం సాక్షి. రెండవ యత్నం 'బంగారు పిచ్చిక'. ఈ చిత్రం సంపూర్ణ హాస్యచిత్రం. మొత్తం షూటింగు ఒకే



ప్రతిమాఫిలింస్ చిత్రంలో షీలా.



# పాత బొమ్మలు - కొత్త కబుర్లు

ఇది మరీ అటీవల, కొంచెం యిటీవల కాని సంవత్సరాలలో వచ్చిన ఒక చిత్రంలోనిది. ఈ చిత్రం పేరూ, ఇందులో వున్నవాళ్ల పేర్లూ చెప్పుకోగలరేమో ఒక్షణం ఆలోచించండి. మరీ ఆలోచిస్తూ కూచుంటే లాభం లేదండోయ్, ఒక్కక్షణమే టైము.. అదీ అయిపోయింది.

1950 లో వచ్చిన విజయావారి "షావుకారు" చిత్రంలోది. ఇందులో వున్నవాళ్లు శ్రీవాత్సవ, జానకి, శాంతకుమారి..సందర్భం ఏమిటంటే—పొరుగింటి వారబ్బాయిని, ఇరుగింటి వారమ్మాయి మనసారా ప్రేమించింది. మనువాడాలనుకొన్నది. పొరుగింటాయన ధనసంబంధమైన లావాదేవీల్లో ఆ యింటికీ ఈ యింటికీ మధ్యనున్న ద్వారాన్ని మూసేస్తూ, సంబంధాలు తెగతెంచేస్తుంటే నోట మాట రాక నిశ్చేష్టులైనారు యిరుగింటి వాళ్లు. ఈ చివరమున్నది ఇరుగింటి యజమాని, ఆ చివరనున్న ఆవిడ యజమానురాలు. మధ్యనున్నామె వాళ్లమ్మాయి. అదీ సంగతి.

"ఈ ఫోటో చూస్తుంటే మీాకే మనిపిస్తోంది?" అని నేను జానకి గారిని అడిగినపుడు ఆమె నవ్వి "అలాగే ఉండిపోకూడదా అనిపిస్తోంది. మా మొహాల్లో వున్న అమాయకత్వం, ఆ సిన్సియారిటీ అలాగే ఉండిపోతే ఎంత బావుంటుందీ?" అంటూ ఆమె యీ ఫోటోతోంచి గతంలోకి వెళ్లారు.

"షావుకారు నా మొదటిచిత్రం. అప్పుడు నాకు 17 ఏళ్లు. అంతవరకూ స్కూలు గర్ల్‌గా వున్న నేను ఒక్కసారిగా సినిమా తారనయ్యాను. సినిమారంగానికి సరికొత్త. సినిమా టెక్నిక్‌లూ, పద్ధతులూ నాకు తెలీవు. ఒక సీన్లో ఏడవాల్సి వచ్చింది. ఎంతకీ నాకు ఏడుపు రావటంలేదు. డైరెక్టర్ ప్రసాద్ గారు చేసి చూపిస్తుంటే నాకు నవ్వొచ్చి నవ్వేశాను. ఆయనకు విసుగెత్తి "డబ్బు తీసుకొని నవ్వేసి వెళ్లిపోదా మనుకుంటున్నావా?" అంటూ ఆయన ఏవేవో సీరియస్‌గా అనేసరికి నాకు పౌరుషం ముంచుకొచ్చి ఏడ్చేశాను. అలా ఎంతసేపో ఏడ్చాను. నేను ఎంతసేపటికీ ఆపటంలేదు. నాగిరెడ్డి గారు, చక్రపాణిగారు వచ్చి "నువ్వు సెన్సిటివ్ కదమ్మా! అంచేత మూడ్ వస్తుందేమోనని అలా తిట్టారాయన అంతే." అన్నారు. నా మొదటి చిత్రంలో ఏడుపు షాటు కోసం అంత గమ్మత్తు జరిగింది. ఆ రోజుల్లో స్టార్ సిస్టమ్ లేదు. పాత్రలకు తగినట్లుగానే ఆర్టిస్టులను ఎన్నుకొనేవారు. ఆర్టిస్టుల కోసం పాత్రల్ని తయారు చేసుకునేవారు కాదు." అన్నారు శ్రీమతి జానకి.

ఈ చిత్రంతోనే జానకి తెలుగువారికి "షావుకారు" జానకి, తమిళులకి "సౌకార్" జానకి అయ్యారు. నేటికీ ఆమెను 'షావుకారుజానకి' అనేఅంటున్నారుజనం.—మోహన్ కుమార్

పరిచయం:



సంగీత సారధి

## విజయకృష్ణమూర్తి

తండ్రి సంగీత విద్వాంసుడు కావడంతో, కొడుకు కూడ ఆ శాస్త్రంలో గట్టివాడు కావాలనుకున్నాడు. అందుకే పదవయేట నుండి హార్మోనియంపై సాధన చేసాడు. 15 వ యేటయింట్లో నుంచి పారిపోయి మద్రాసులో ఘంటసాల మాస్టారును ఆశ్రయించాడు. ఆయనవద్ద సంగీత శాస్త్ర సంగతులను క్షుణ్ణంగా నేర్చుకున్నాడు. సినిమా సంగీతానికి కావలసిన చిటకాలను గ్రహించాడు. శ్రీ ఘంటసాల, రాజేశ్వరరావులవద్ద సహాయకుడిగా పది సంవత్సరాలు కాలం గడిపాడు.

శ్రీ విఠలాచార్య యితని ప్రజ్ఞా విశేషాన్ని కని, "అగ్గిబరాటా"కి సంగీత సారధిగా నియమించాడు. వృత్తిలో నేర్పు, ఓర్పు వున్న కృష్ణమూర్తి యిప్పుడు శ్రీ టి. వి. రాజుకు కుడి భుజంగా అనేకానేక చిత్రాలకు తన సహాయ, సహకారాల్ని అందిస్తున్నాడు. ఇతనికి మాల్కోస్, భైరవి, కల్యాణి రాగాలంటే చాలా యిష్టం. సితార్, గిటార్, హార్మోనియం యితని కిష్టమైన వాయిద్యాలు. ఇంగ్లీషు, హింది సినిమాల్లో యేవేని మంచి ట్యూన్సు వుంటే, వాటిని గ్రహించి, తాను తయారుచేసే ట్యూన్లలో మేళవించి, కొత్త రాగాన్ని సృష్టిస్తానంటాడు. రీ—రికార్డింగ్ చేసేప్పుడు సన్నివేశ ప్రాముఖ్యత, ప్రాబల్యతను బట్టి సంగీతాన్ని వినిపించడం యితనికి అలవాటు. హిందూస్తానీ బాణీలపై మక్కువ ఎక్కువే అయినా, కర్ణాటకం, పాశ్చాత్యం, జానపద బాణీలను కూర్చడంలో యేమాత్రం తీసికట్టుకాదు.

సంగీత శాస్త్రాన్ని క్షుణ్ణంగా జీర్ణించుకున్న యితనికి మన పరిశ్రమలో యింకా పటుతరమయిన స్థానం దొరక్కపోవడం విచారించదగ్గ విషయం. మున్ముందు శ్రమకు తగ్గ ఫలితం లభిస్తుందని ఆశించవచ్చు.

## సినిషా

షెడ్యులులో పూర్తికావడం యిందులో విశేషం భాగ్యనగరపు సౌభాగ్యాలను, అందాలను కళ్ళకు కట్టేట్టు చూపించడం మరో విశేషం సినిమాలో ఒక్క సెట్టు కూడ వుపయోగించకపోవడం మరో విచిత్రయిన విషయం వినోదం ప్రధానంగల యీ హాస్యరసభరితమయిన చిత్రంలో విజయనిర్మల, చంద్రమోహన్ శాంతకుమారి, రాజబాబు, రామన్న పంతులు, సాక్షి రంగారావు, కాకరాల, పద్మాంజలి, భూషణ్, జగ్గారావు శివరామకృష్ణయ్య, ముఖ్యపాత్రలను ధరించారు శ్రీ ఆరుద్ర వ్రాసిన పాటలకు మహదేవన్ కమ్మటి బాణీలను వినిపించారు కెమెరాను కన్నప్ప, కూర్పును సంజీవి నిర్వహించిన యీ చిత్రానికి రచన శ్రీ రమణ దర్శకత్వం శ్రీ బాపు చేసిపెట్టారు ఈ చిత్రాన్ని శ్రీ కె వెంకటరామరాజు, ఎస్ ఎస్ మూర్తి నిర్మించారు

### హిట్లర్ గెటప్

ప్రేక్షకులకు మానసోల్లాసాన్ని కల్గించడమే సినిమా యొక్క లక్ష్యం అనే వాదాన్ని నవజ్యోతి పిక్చర్స్ 'నడమంత్రపు సిరి' చూస్తే మీకే తెలుస్తుంది. వినోదం, హాస్యం, సంతోషం ముఖ్యాంశంగా గల యీచిత్రం మీ హృదయాల్లో కలకాలం నిలిచే విధంగా యువ దర్శకుడు తాతినేని రామారావు జూనియర్ సముద్రాల రచన కనుగుణ్యంగా ప్రతి సన్నివేశాన్ని రక్తి కట్టించే రీతిలో నిర్దేశించారు. ఈ చిత్రంలో నాగభూషణం, సూర్యకాంతం చేసిన తతంగం, ఆడిన నాట్యం, పాడిన గానం మిమ్మల్ని ఒకవైపు కవ్విస్తే, రాజ్‌బాబు, విజయలలితల హాస్యం మిమ్మల్ని కడుపుబ్బ నవ్విస్తుంది. అంతేగాదు. విలన్ రాజనాల హిట్లర్ గెటప్‌ను చూస్తేనే మీకు నవ్వొస్తుంది. ఇక శృంగారం మాట అంటారా — విజయనిర్మల, హరనాథ్‌ల బిగి కౌగిలింతలు, ప్రేమ పారవశ్యాలు మిమ్మల్ని చక్కిలిగింతలు పెడ్తాయి. సంగీతం అతి ముఖ్యమని చలపతిరావు యీ చిత్రంలో తన సత్తాను చూపించారు. ఈ చిత్రంలో కూడ సత్యనారాయణకు మీ సానుభూతి లభిస్తుంది శ్రీ వందనం, సాంబశివరావులు నిర్మించిన యీ చిత్రం రాయల్ ఫిలింస్ ద్వారా సెప్టెంబరు ఆఖరివారంలో విడుదలౌతుంది

### పేరులోనే కిటుకు

శ్రీయుతులు ఎ పూర్ణచంద్రరావు, ప్రకాశరావులు కలిసి స్థాపించిన సంస్థ నవభారత్ వీరి మొదటి కానుక 'అగ్గిమీద గుగ్గిలం' పేరు వింటేనే యిందులో యేదో కిటుకు వున్నట్టనిపిస్తుంది గదూ! వుంది మీకు కావలసిన పదార్థాలన్నీ సమపాళ్ళల్లో జొప్పించారు నిర్మాతలు మీకళ్ళను చెదరగొట్టే కత్తిసాము, మిమ్మల్ని ఆశ్చర్యచకితుల్నిచేసే మంత్రజాలం, మీ హృదయాల్లో పరవశాన్ని అంకురింపచేసే ప్రణయఘట్టాలు, మీ మనస్సుల్లో దయ, సానుభూతిని యేర్పరచే శోక సన్నివేశాలు యీ చిత్రంలో సమపాళ్ళల్లో వుండేవిధంగా శ్రీ భావనారాయణ వ్రాసిన కథకు శ్రీ ఎంగళి సంభాషణలను కూర్చారు సన్నివేశాలకు సత్యం కూర్చిన నేపథ్యసంగీతం యేనుగంత బలాన్నిచ్చాయి ముఖ్యపాత్రల్లో కాంతారావు, గుమ్మడి, రాజనాల, రామకృష్ణ సత్యనారాయణ,



'నడమంత్రపు సిరి'లో విజయనిర్మల

ప్రభాకరరెడ్డి ధూళిపాళ రాజశ్రీ విజయలలిత, రాజ్‌బాబు మీనాకుమారి పోషించారు శ్రీ డి విశ్వనాథం తనకు తెలిసిందాన్నంతా యీ చిత్రంలో వుపయోగిస్తే యనకు కృష్ణ కిశోర్ సహాయకుడుగ వుండి చిత్రాన్ని ప్రేక్షక జనరంజకంగా వుండేట్లు చిత్రించారు సెప్టెంబరులో పూర్ణాద్వారా విడుదల కాగల యీ చిత్రం జానపద చిత్రాల్లో ఒక ప్రత్యేకతను యేర్పరుస్తుందని ఆశించవచ్చు

చిత్రంలో విశేషం

కౌముదీఫిలింస్ శరవేగంగా నిర్మిస్తున్న సాంఘిక చిత్రాన్ని శ్రీ కమలాకర కామేశ్వరరావు వీనస్ స్టుడియోలో చక్కగా చిత్రీకరిస్తున్నారు ఈ చిత్రంలో వాణిశ్రీ భారతి విడి డని ప్రియస్నేహితురాండ్రుగా నటుస్తున్నారు వాణిశ్రీని శోభన్‌కు పెళ్లికి యీ చిత్రంలో మీరు చూస్తారు మరి వాణిశ్రీకి జతగాడు లేడా అని మీరడుగుతారని నాకు తెలుసు? లేకేం, రాంమోహన్ వున్నాడు మరి శోభన్‌కు పెండ్లి, గిండ్లి ఏమయినావుందా లేదా? అని అడిగేరు సుమా వినక్షేపం లాంటి భారతిని శోభన్ పాణిగహం చేస్తాడు ఈ చిత్రంలో మరొక్క విశేషం— నిర్మాత శ్రీ ఎం ఎస్ రెడ్డి రచన సాగించడమేగాక ఒక ముఖ్యపాత్రను ధరించడం వేణు సమకూర్చిన సంగీతం చిత్రానికి ప్రాణం దర్శకులు అనుభవజ్ఞులవడంతో ప్రతినటుడు నటి తమకిచ్చిన పాత్రను చక్కగా పోషించారు శ్రీ ఆత్రేయ పాటలు మన కర్ణపుటాల్లో టంగ్‌టంగ్ మంటూ వుంటాయ డంలో అతిశయోక్తి లేదు ఈ చిత్రంకూడ సెప్టెంబరు ఆఖరికో లేక అక్టోబరు ప్రారంభానికి మీకు దర్శనమిస్తుంది

* * *

శ్రమించి, వృద్ధిలోకి వచ్చిన వాళ్లలో శ్రీ ఎ ఎస్ రాజు ఒకరు మంచితనంతో పరిశ్రమలో పలుకుబడిని సంపాదించి శ్రీ రామారావులాంటి ప్రముఖుల ఆశీర్వాదాన్ని పొందగల్గాడు వారి ఆశీర్వాదబలంతో నేడు నిర్మాత కాగల్గాడు ప్రముఖ నటిగా వినుతికెక్కిన గిరిజను పరిణయమాడాడు విజయ గిరిధ్వజ సంస్థను స్థాపించాడు ఆగస్టు 14 న విజయాగార్డెన్స్‌లో



'కలసిన మనసులు'లో వాణిశ్రీ, బేబీ శాంతికళ.

రికార్డింగ్ ప్రారంభించాడు. శ్రీ తివిక్రమరావు కొబ్బరికాయకొట్టి రికార్డింగ్ కార్యక్రమానికి నాందీవాక్యం పల్కారు. పాటను నారాయణరెడ్డి వ్రాసారు. శ్రీమతి సుశీల, ఈశ్వరి పాడారు. శ్రీ టి. వి. రాజు సంగీతాన్ని వినిపించారు, శ్రీ స్వామినాథన్ రికార్డు చేసారు. చిత్రపరిశ్రమ ప్రముఖులనేకులువచ్చి నిర్మాత శ్రీ పి. ఎస్ రాజును దీవించారు. శ్రీ ఎస్. డి. లాల్ దర్శకత్వం వహించే యీ చిత్రంలో రామారావు కాంచన, షీలా ముఖ్యపాత్రలను ధరిస్తారు శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ రచనను, కే ఎస్ ప్రసాద్ కెమెరాను నిర్వహిస్తున్నారు మొదట షెడ్యూలు ఆగస్టు 23 న ప్రారంభమౌతుంది రెండురోజులు జరిగే యీ షూటింగులో రామారావు, కాంచన పాల్గొంటారు

* * *

ప్రముఖ నిర్మాత శ్రీ డి బి నారాయణ కథకుడయ్యారు ఎక్కడ ఎప్పుడు అని అడగరేం? ఇంకెక్కడ మద్రాసులోనే ఇప్పుడే డి బి ఎస్ అండ్ డేగా ప్రొడక్షన్స్ నిర్మించే చిత్రానికి కథను వ్రాసింది డి బి ఎస్ అయితే మాటలను వ్రాసింది భమిడిపాటి రాధాకృష్ణ కె వి మహదేవన్ సంగీతాన్ని వినిపిస్తున్నారు ఆర్టిను కళాధర్ గమనిస్తున్నాడు కెమెరాను స్వామి కదిలిస్తున్నాడు దర్శకత్వాన్ని అసాధ్యుడు మరియు మరపురాని కథ (ఫేం) రామచంద్రరావు నిర్వహిస్తున్నాడు ఈ సంస్థ యొక్క షూటింగు ప్రస్తుతం వాహినిలో జరుగుతూవుంది ముఖ్యపాత్రల్లో కృష్ణ, రాంమోహన్ చంద్రమోహన్ రాజబాబు, విజయనిర్మల చంద్రకళ సంధ్యారాణి ధరిస్తున్నారు ఈ చిత్రానికి 'అన్నదమ్ములు' అని పేరు ఎట్టాలనుకుంటున్నట్లు నిర్మాతలలో ఒకరైన శ్రీ కె ఆర్ కృష్ణమూర్తి వెల్లడించారు —శ్రీనివాస్



బంగారు పిచిక లో విజయనిర్మల

# పుస్తకాలు

## స్వీట్ హోమ్

రచన శ్రీ ముప్పాళ రంగనాయకమ్మ ఎమెస్కో పాకెట్ సైజు 144 పేజీలు వెల రు 2 లు ప్రచురణ యం శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, సికింద్రాబాదు

'స్వీట్ హోమ్' అనగానే ఇదేదో ఇంగ్లీషు నవల అనుకుంటాం కాదు దేనికీ అనువాదమూ కాదు ఇంగ్లీషు పేరు పెట్టుకున్న— నాటికి నూరు వయాపైసాల తెలుగు నవల స్వీట్‌హోమ్‌కు రచయిత్రి నవలా సరస్వతి కావటం మరింత స్వీట్

స్వీట్ అంటే తీపి తీపి ఎక్కువయితే మొహం మొత్తుతుందంటారు ఈ స్వీట్ హోమ్‌లో ఉండుండి కారాలూ మిరియాలూ నూరే విమలది ముఖ్యపాత్ర ప్రియ విమలకు ప్రాణ సమానమైన ప్రియుడు బుచ్చి ఒకళ్ల మీద ఒకళ్లకి చచ్చేటంత ప్రేమ ప్రేమ కాస్త పాకం ముదిరింది· కాగా— నూనే మువ్వలా ఒక్కటే అవహేళనం పాక్యం సార్థకమయింది

బుచ్చిని విమల ఏరి కోరి వలచి మురిసి మరీ పెళ్లాడింది ఇందుకు మధ్యవర్తి— కవి— పెళ్లిళ్ల పేరయ్య విమల సోదరుడు మధు అందుకే పచ్చివాట్లు తిన్నాడు

బుచ్చి పాడయిపోతున్నాడని విమల భయం. దీని క్కారణం ఆమె అనుకోండీ అయినా మొగుణ్ణి సన్మార్గాన పెట్టి బాగు చెయ్యమని అన్నగారిని బతిమలాడుకుంటుంది ప్రతిఫలంగా 'మా స్వీట్ హోమ్‌లో నీకు చోటు లేదు తిండి తిని బండెక్కు' అని అన్నను తిట్టి తగిలేస్తుంది

ఈ మాట విమల అనేవరకూ 'ఇది ఒక స్వీట్ హోమ్' అనే అనిపించదు మనకి విమల గయ్యాళిగా, బుచ్చి పతీ విధేయుడుగా అనిపిస్తారు

ఎంత చదువుకున్న పిల్లనే కట్టుకున్నా, లాయరీ ప్రాక్టీస్ చేస్తున్న వ్యక్తి ఆత్మాభిమానాలు మరీ అంత చంపుకోవటంలో అవుచిత్యం ఏమిటో!— నాయిక నాయకుడితో ఏకవచనంలకి మాటాడటం ఒక మేనరిజమ్

స్త్రీకి సర్వస్వమూ భర్త అయినా— పిల్లలు పుట్టాక ఆమె ఆదరణలో సగం పిల్లలు పంచుకుంటారు స్త్రీ సహజమయిన ఈ నైజాలు 'స్వీట్ హోమ్'లో బొత్తిగా కనిపించవు అటు పిల్లల్నీ, ఇటు భర్తనూ కూడా తీసిపారేస్తుంది ఈ నవలలో విమల

'స్వీట్‌హోమ్‌లో' కాస్తంత ఆధ్యాత్మిక తత్వమూ చోటు చేసుకుంది మగవాళ్లలో కంటే ఆడవాళ్లలో దైవచింతనా, పాపభీతీ ఎక్కువగా ఉంటాయి ఇందులో విమల అటు దేవుళ్లమీదా, ఇటు పురాణాదులమీదా విరుచుకు పడుతుంది.

ఈ నవల చదివి ముగించాక, మన రామాయణ మహాభారతాలను దుయ్యబట డమే ఈ నవల ఉద్దేశమా అని ఒక శ్రేణికి చెందిన పాఠకులు అనుకోక మానరు అయితే రచనా పాటవంలో గల వడి, ఒడుపు, యుక్తి, తర్కం— ఈ అభిప్రాయాన్ని కొంతవరకు మరుగు పరుస్తాయి

—శివకుమారి

## గృహపరిశ్రమలు

గృహ పరిశ్రమల రహస్యము అన్న ఈ పుస్తకంలో వ్రాత సిరాలు దగ్గర నుంచి బాణా సంచా వరకు గల అన్ని రకముల గృహ పరిశ్రమలు ఎవరంగా తెలియపరిచారు ఉపయోగకరమైన పుస్తకం 214 పేజీల పుస్తకం వెల ఆరు రూపాయిలు రచన దివ్యశీతాడి బ్రహ్మానందవర్మగారు కాపీలకు శ్రీ జి జోగిరాజు పబ్లిషర్, ఏలూరు, ప గో. జిల్లా ●

ఆటలు

## టెన్నిస్‌లో కొత్త బృందానికి అవకాశాలు!



భారతదేశం ఇంకా ఎన్ని రోజులని ఆర్ కృష్ణన్, ప్రేమ్జిత్ లాల్, జయదీప్, ముఖర్జీల మీద ఆధార పడుతుంది? భారత దేశపు మేటి ఆటగాడు ఎందరో విదేశ క్రీడాకారులని వోడించాడు ఎన్నోసార్లు అతనికి ఏదో రకమయిన శారీరిక బాధ వచ్చింది అతను అతిగా క్రీడా కార్యక్రమాలలో పాల్గొన వలసి రావటంచేత తగిన తర్ఫీదు పొందలేక పోయాడు, ఇంటివద్ద 1966 లో అతను డేవిస్ కప్పు సందర్భంలో సాధించిన విజయాలు తీసుకోండి!

పోయిన సంవత్సరం తను రిటయిరవుతున్నానని చెప్పాడు అతను కానీ, మళ్లీ జపాన్‌కి ఎదురుగా ఆడిన మాచ్‌లలో నాయకత్వం వహించడానికి అంగీకరించాడు లాల్, ముఖర్జీలు అతనికి చక్కగా సహాయపడ్డారు

లాల్, ముఖర్జీలు కృష్ణన్‌కన్నా చిన్నవారు అయినా వారి ఆరోగ్యం అంత సరిగ్గాలేదు కొన్ని ముఖ్యమయిన మాచ్‌ల మధ్యలో మాను కోవలసి వచ్చింది అందుకనే, ఇప్పటినుంచే కొత్త జట్టు నొక దానిని తయారుచేసే బాధ్యత మనకి ఉంది! హైదరాబాద్ నుంచి ఎస్ పి మిశ్రా బాగానే ఆడుతున్నాడు కాని అధికారులు కొందరు అతనిపట్ల నిష్పక్షపాతంగా ప్రవర్తించటం లేదు ఏది ఎలా ఉన్నా అతన్ని రిజర్వ్ ప్లేయర్‌గా వేశారు టోకియో మాచ్‌లకి అదే చాలు రబీ వెంకటేశన్ కూడా బాగానే ఆడుతున్నాడు కాని ఎస్ మినోత్రా సంగతి మాత్రం అంత బాగా లేదు సిలోన్‌లో ఆడినప్పుడు అవకాశం ఇచ్చారు అతనికి వయస్సు మించిన వంటి బరువు ఉంది )జూనియర్లలో సుమంత మిశ్రా' కొడుకు గౌరాంగ్ మిశ్రా, ఆనంద అమృతరాజ్ వీరిద్దరూ బాగా ఆడుతున్నారు సిలోన్‌లో వీరిద్దరూ చాలా బాగా ఆడారు డబుల్స్‌లో మంచి ఆటగాళ్లనిపించుకున్నారు అయినా ఈ ఇద్దర్నీ టోకియోకి పిలవలేదు! వాళ్లకి అక్కడ ఆడే అవకాశం రాకపోవచ్చుట! ఆల్ ఇండియా లాన్ టెన్నిస్ ఎసోసియేషన్ ఆర్థిక పరిస్థితి బాగానే ఉంది వారి ప్రయాణం వల్ల వారికి నష్టం వచ్చేదికాదు వారికి పెద్ద ఆటగాళ్లతో ఆడే అవకాశమూ కలిగేది

అమృతరాజ్‌నీ, వెంకటేశన్‌నీ జకార్తాకి ఆసియా జూనియర్ పోటీలకి పంపిస్తున్నారు వీరుకాక మరిద్దరిని ఎన్నుకుంటారుట విజయ్ అమృతరాజ్‌కి ఈ సందర్భంలో మంచి అవకాశం ఉంది

ఆల్ ఇండియా లాన్ టెన్నిస్ ఎసోసియేషన్‌వారు జూనియర్ ఆటగాళ్లని బాగా తర్ఫీదుచేసే ఏర్పాట్లు చేస్తున్నారు ఇది మంచి పని! భారతదేశంలో నేషనల్ ఛాంపియన్‌షిప్ ఒకటి పెడ్తారుట అంతర్‌రాష్ట్ర పోటీలు ఏర్పాటు చేస్తారుట తర్ఫీదు స్థావరం ఒకటి నెలకొలుపుతారుట

ఆనంద్ అమృతరాజ్‌కన్నా గౌరాంగ్ చురుకుగా ఆడ్తాడు ఇద్దరూ పొడగరులే సరయిన వయస్సులో ఉన్నార జాతీయ ఛాంపియన్‌లు కాగలిగిన లక్షణాలు ఉన్నాయి

ఇద్దరినీ హారీ హాప్‌మాన్ కింద తరిఫీదుకి ఆస్ట్రేలియాకి పంపుతారుట, ఎటసియేషన్ వారు దీనిని గురించి పయి సంచికలో రాస్తాను

— కె ఎస్ నరసింహన్



Edited Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras 1. Chief Editor. S. Sambhu Prasad.

# వీణా బ్యూటీ సోపు మీ చర్మానికి మరింత అందాన్నిస్తుంది

నిత్యమూ చర్మంగురించి శ్రద్ధతీసు కుంచే వర్చస్సు ఎంతో మనోహరంగా ఉంటుంది. మేలిక సౌందర్య పోషణ నిండు యౌవన శోభలోని సౌందర్యాతి శయాన్నీ. మృదుత్వాన్నీ రాణింప జేస్తాయి.

స్వచ్ఛమైన. పట్టులాగా మృదువైన చర్మం కలిగి ఉండడంలో మీకు తోడ్ప దేందుకూ. మీ వర్చస్సు మరింత యౌవన శోభతో మనోహరంగా రాణించే లాగా చేసేందుకూ వెస్వో మీకు వీణా బ్యూటీ సోపును అంద జేస్తూంది. తమ వర్చస్సును అమూల్య మైనదిగా ఎంచేవారికి ఆనందప్రదమైన. మంచినురుగును నిచ్చే వీణాను మించి మేలు చేకూర్చేది మరొకటిలేదు. ఇదీ రోజంతా నవనవ లాడుతూ ఉండేలాగా చేయగల మనోహరమైన సువాసనలతో నిండినది.




## వీణా
బ్యూటీ సోపు

a Veswo PRODUCT

తయారుచేయువారు•

సేర్ నాగ్‌జీ పురుషోత్తమ్ & కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్

| | | | |
|---|---|---|---|
| పి బి నెం 36<br>కోజికోడ్-1. | పి. బి నెం 3254<br>బొంబాయి-3 | 25/84 సుబ్బయ్య<br>మొదలియార్ స్ట్రీట్<br>కోయంబత్తూరు | 38/20<br>మించిన్ స్ట్రీట్<br>కర్నూలు<br>(ఆంధ్రప్రదేశ్) |